

# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1101-1 భైరవి సం: 21-001**

**పల్లవి: ఇంకనేల బొంకనూ ఇద్దరము గూడితిమి**

**పొంకముగ నానతిమ్మా పూఁచి నవ్వే నేను**

**చ 1: ఆసలురేఁచుక పోయి ఆకెమీఁద వేడుకతో**

**సేసలు వెట్టితివా చెలరేఁగి**

**వేసరక నమ్మించి వేగినంతాఁ దమకించి**

**బాసలు సేసితివా పలుమారును**

**చ 2: చిక్కనినవ్వుతోడ సిగ్గులెల్లాఁ బెడఁబాయ**

**చెక్కులు నొక్కితివా సేదలుదేర**

**లక్కవలెఁ గరఁగఁగ లలనతో దూరుతాను**

**మొక్కులు మొక్కితివా ముచ్చట దీరఁగను**

**చ 3: వలపులు చల్లి చల్లి వంతులు వాసులెంచక**

**అలుకదేర్చితివా ఆపెను నీవు**

**యెలమి శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి**

**అలరీ యీసుద్దు లాడ నాడుకొంటివా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1101-2 పాడి సం: 21-002

పల్లవి: గుట్టుతోడి నీవు నన్ను గొరబుసేయకువయ్య

వుట్టిపడి నాతో నవ్వనోపుదువా

చ 1: ఆయములు సోఁక నీతో నాడుకొనఁజాలఁగాక

పాయపునీయాలఁగానా పరాకేఁటికి

చేయిచాఁచ కిటు నీతో సిగ్గువడి వుందానగా-

కోయినీవు నాతో సంతకోపుదువా

చ 2: కన్నుల జంకించి నిన్ను కక్కసించఁజాలఁగాక

మన్నించేదానఁగాన మాయలేఁటికి

చన్నుల నే నొత్తి నీతో సరసములాడఁగాక

వున్నపనుల కంతేసి కోపుదువా

చ 3: తేనెగారేమోవి ఇచ్చి తిట్టు దిట్టఁజాలఁగాక

మేనదానఁగాన నాతో మేకులేఁటికి

యీనెపాన శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

పూనినదారతులకు వోపుదువా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1101-3 శ్రీరాగం సం: 21-003**

**పల్లవి: చెలులాల నాయకుని చిత్తము గాక**

**తలఁపించేనా బాసలు తనతో నేను**

**చ 1: జగములేలేవాఁడు జవ్వనమదమువాఁడు**

**నగితే నే సరిగాను నవ్వఁగలనా**

**పగటుఁ జుట్టుఁగైదువపట్టినచేతివాఁడు**

**తగవులాడఁగలనా తనతో నేను**

**చ 2: వేవేలుసతులవాఁడు వెన్నెలచూపులవాఁడు**

**వావులు చెప్పి వరుసవంతడిగేనా**

**కోవరపుకాసులఁ గొట్టిన వొరటువాఁడు**

**తావళించి వొరసేనా తనతో నేను**

**చ 3: నాలుగుచేతులవాఁడు నాగశయనపువాఁడు**

**బేలుఁదనమున సరిపెనఁగేనా**

**యీలీల శ్రీవేంకటేశుఁ డిటు తానే నన్నుఁ గూడె**

**దైలతో నే గొసరేనా తనతో నేను**





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1101-4 మాళవిగౌళ సం: 21-004**

**పల్లవి: అప్పటి కప్పుడే కాక అంతయేఁటికి**

**యెప్పుడూ మనకుబోఁదు ఇందవయ్య విడెము**

**చ 1: తక్కి మాఁటునన్నన్నంతతడవు నిను దూరితి**

**నిక్కి చూడఁబోతేను నీవే నేను**

**కక్కసించ నిఁక నిన్ను కడు నానవెట్ట కిఁక**

**యిక్కువలు గరఁగేను ఇందవయ్య విడెము**

**చ 2: గుట్టుతో నూరకుండఁగా గుణము వెరవులాయ**

**నెట్టుకొని మాటాడితే నీవే నేను**

**పెట్టను రట్ల పెనఁగకుమిఁక నీవు**

**ఇట్టే నీమాఁటలు వింటి నిందవయ్య విడెము**

**చ 3: రయ దూరకున్నందు కటు నిట్టు బిగిసితి**

**నారిచి పొందుసేసితే నీవే నేను**

**కోరి శ్రీవేంకటేశుఁడ కూడితి మిద్దరమును**

**యీరీతిఁ బాయకుందము ఇందవయ్య విడెము**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1101-5 ఆహిరి సం: 21-005

పల్లవి: నమ్మిక లియ్యవచ్చేవు నాకా నీవు

తమ్ములపునోర నిఁక దడవకు పనులు

చ 1: చెక్కిటి చేఁతలమీఁద సెలవినవ్వలమీఁద

మొక్కిన మొక్కులమీఁద మోచె నీమాట

యెక్కువతక్కువలేల ఇంకా సాకిరులేల

దక్కె నీవేడుకలెల్లా తడవకు పనులు

చ 2: వొట్టినచెమట మీఁద వొరగుఁదురుమీఁద

నిట్టూరుపులమీఁద నిండె నీమాట

వట్టియాన లిఁకనేల వలవనిముచ్చటేల

దట్టమాయ నేరుపెల్లఁ దడవకు పనులు

చ 3: కన్నులచూపుల మీఁద కాయపుకళలమీఁద

మున్నిటి రతులమీఁద ముంచె నీమాట

యెన్నిక శ్రీవేంకటేశ ఇద్దరముఁ గూడితిమి

తన్నుఁదానె నైకమాయఁ దడవకు పనులు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1101-6 బౌళి సం: 21-006

పల్లవి: ఎక్కువతక్కువ మాట లికనేల
మిక్కిలి నీలోఁగలమేలు చూపవలెఁబో

చ 1: పంతమాడినట్లానే పనికి రావలెఁగాని
యెఁత్రైననేతులు నెమ్మె లెవ్వ రాడరు
మంతనాన నున్నారము మచ్చిక నిద్దరమును
చెంతన నీచేతఁలెల్లాఁ జేసి చూపవలెఁబో

చ 2: నన్ను నవ్వినట్లానే నను పు గావలెఁగాని
ఇన్నేసి వేసాలబీరా లెంతలేదు
కన్నుల యెదుట నిదె కానవచ్చీ మనగుట్టు
పన్నినరతిమర్మాలు పచరించవలెఁబో

చ 3: కొంగువట్టినట్లానే కూడిచూపవలెఁగాని
యెంగిలివట్టి సరసా లేమిబాఁతి
చెంగటఁ గూడితిమిదె శ్రీవేంకటేశ మనము
పొంగేటి యాసోదాల భోగించవలెఁబో



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1102-1 సామంతం సం: 21-007

పల్లవి: వలచినదాని కెందు వాదు చెల్లదు

బలువులే చూపవయ్య బాసదప్ప దిఁకను

చ 1: వేడుకకు వెలలేదు వెన్నెల కెంగిలిలేదు

ఆడిక నీచేఁతలకు నడ్డములేదు

వీడె మిందవయ్య నీవిద్యలెల్ల లోఁగొంటి

వోడ కిట్టె నవ్వవయ్య వొరయ నిన్నిఁకను

చ 2: మరునికి వేళలేదు మాయలకు గురిలేదు

వరుస నీకూటాలకు వావిలేదు

సరుగ మో విందవయ్య చనవెల్లఁ జేకొంటి

తెరలోనికి రావయ్య తెగ నీకు నిఁకను

చ 3: చిగురుకు చేఁగలేదు సిగ్గులకు తప్పులేదు

తగు నీయాసోదానకు తనివిలేదు

నిగిడి శ్రీవేంకటేశ నీవు నేనూఁ గూడితిమి

మొగమెత్తి చూడవయ్య మొక్కే నేనిఁకను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1102-2 దేసాళం సం: 21-008

పల్లవి: వట్టినవ్వు లంత యాల వావాతను

నెట్టుకొనఁ జొక్కించితే నిన్నుఁ బొగడేము

చ 1: వేడుక నీమాఁటలకు వెలలేదు అట్టె

కూడినకూటములకు గుఱిలేదు

యేడ సుద్దులు దడవే వింకా నీవు నన్ను

సూడిదెగా మన్నించితే చుట్టాలమయ్యేము

చ 2: కొంగువట్టితే వలపు కుప్పవడదూ నీ-

వుంగిటి మెచ్చులనే వుట్టిపడదు

జంగిలికేల తెచ్చేవు సారెకు నీవు మా-

ముంగిటికి వచ్చితేనే మొక్కులు మొక్కేము

చ 3: కన్నులఁ జూచినంతలో కాఁకదేరదూ లోలో

సన్నలుసేసినంతలో నడిదేరదు

ఇన్నిటా శ్రీవేంకటేశ ఇటు గూడితి మా-

విన్నపములు వింటేను విందుల వెట్టేము





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1102-3 పాడి సం: 21-009

పల్లవి: నేరుపరి ననుకొను నెరజాణ ననుకోను

యీరీతి నాహావభావా లింతెఱఁగఁడా

చ 1: మలసి తనతో నేను మాటాలాడనని దూరి

సెలవుల నవ్వితేనే సేనమాటలే

పిలిపించనని తాను బిగువులు నెరపీని

తలుపు దెరచితేనే తగుసన్నగాదా

చ 2: దగ్గరఁ గూచుండనంటా తమకించనంతలోనె

సిగ్గువడి వుండితేనె చేరివుండుటే

వొగ్గి తన్నుఁ జూడనంటా వొరట్లు వట్టీని

అగ్గమై యెదుటనుంటే అన్నియును గాదా

చ 3: ముందు కాఁగిలించనంటా మొనలెల్లఁ జూపీని

ఇందమని విడెమిచ్చు టిదియే అది

అందపు శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను

పొందితి మిద్దర మివి పోదులెల్లాఁగావా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1102-4 వరాళి సం: 21-010

పల్లవి: కామిని యప్పటి నుండి కాచుకున్నది

దోమటివలపులకు దోసమున్నదా

చ 1: మంతనమాడఁ గరాదా మలసి యప్పటనుండి

యింతి నిన్నుఁ బిలిచీని యేకతానకు

వింతవా రుండితే నేఁడు వెలపేల వచ్చె నీకు

దొంతరవలపులకు దోసమున్నదా

చ 2: పమ్మి చేయిచాఁచఁగరాదా పందెమువేసేనంటా

యెమ్మెలకే పెనఁగీని యీపె నీతోను

చిమ్ముచు నామోము చూచి సిగ్గేల వచ్చె నీకు

దొమ్మి వలపుల కింత దోసమున్నదా

చ 3: గడ్డమువట్టఁగరాదా కాఁగిలించుకొనేనంటా

వొడ్డుక వున్నవి చన్ను లువిదకును

అడ్డమై శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి

దొడ్డివలపులకును దోసమున్నదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1102-5 సాళంగం సం: 21-011

పల్లవి: వద్దు వద్దు మాతోను వట్టిసట లింకను
యిద్దరుఁ గూడేటివేళ యెవ్వరున్నా రపుడు

చ 1: పొంచి నిన్నాపెవేసిన పువ్వులచెండే గుఱుతు
కొంచక జారిననీకొప్పే గుఱుతు
యెంచఁగ నప్పుడు సాక్షి యెవ్వరు వచ్చుండేరు
ఇంచుకంతలోనే నీవేల బొంకే విపుడు

చ 2: వువిదకంకణములవొత్తు లవిగో గుఱుతు
జవళి నీపెంజెమటజాఱే గుఱుతు
పవళించి మీరుండఁగా పైకొని రానైతిఁగాని
ఇవల నిందుకుఁగాను యేలబొంకే విపుడు

చ 3: చెలి నీమోవి నించిన చిలుకవోటే గుఱుతు
సెలవుల నీకుఁదోఁచేసిగ్గు గుఱుతు
బలిమి శ్రీవేంకటేశ పైకొని నన్నుఁ గూడితి-
విలపై నిండె నీసుద్దులేల బొంకేవిపుడు



శృ.రేకు: 1102-6 పాడి సం: 21-012

పల్లవి: నిన్నేమనేము నేము నీకేఁటి ఆచారము

కన్నచోట్లను మోటు గాలికి వెఱచునా

చ 1: సరసము లేమాడేవు సతుల పయ్యదల

మఱిగేవాఁడవు నీకు మాటలు నేల

దరిచేరినవియెల్ల తలపోయ గుల్లలని

ధరలోన ననేమాట తగ నీయందున్నది

చ 2: తొడికేవు నిజముల తొయ్యలులచూపుల

బడిసెవాటవు నీకు బాసలునేల

నుడుగులు దప్పినాను నోముఫలము దప్పదు

అడరఁగ ననుమాట అది నీయందున్నది

చ 3: వేసరక నవ్వేవు వెలఁదులరతులకు

ఆసోదకాఁడవు నీకు నంతేశాల

సేసపెండ్లి కొడుకవు శ్రీవేంకటేశ కూడితి

తాసు పయిఁడంతతూకము తగ నీయందున్నది





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1103-1 వరాళి సం: 21-013

పల్లవి: కొలువువా రివి గంటే కొల్లున నవ్వుదురు

తిలకించి చూచుకొంటే తిద్దుకొందువు

చ 1: నీమేనివింతచేఁతలు నీడచూచుకోవయ్య

కామినిచెక్కులే నీకు కంచుటద్దాలు

వేమారు నేమనఁబోతే వెంగెమై తోఁచు నీకు

దీమసాన నీవైతే తిద్దుకొందువు

చ 2: వెలఁదిడినజవ్వాది వేరేపూవు గట్టవయ్య

పొలఁతిగుబ్బలే నీకు పూవుగుత్తులు

యెలమి నేమేమనిన యెగసక్కెమై తోఁచు

తెలుసుక నీకునీకే తిద్దుకొందువు

చ 3: యెయ్యేడో ఆఁకలి నీవు యీడఁ దీరుచుకోవయ్య

తొయ్యలిమోవే నీకు దొంతిబోనము

నెయ్యపుశ్రీవేంకటేశ నేనంటే నన్నుఁ గూడితి

తియ్యక వెనకవెల్ల తిద్దుకొందువు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1103-2 ముఖారి సం: 21-014

పల్లవి: ఔ నౌ మరి ఆఁడువార మంత కోపము

ఆనతిమ్మా నీకు నితవైనట్టే సేసేను

చ 1: సారె సారె నీతోను సణఁగులు చూపఁగాను

భారము గాదుగదా పంతగాఁడవు

కూరిమి గలిగి నేను గొణఁగుచుఁ దిట్టఁగాను

వైరముగాదుగదా వాసికాఁడవు

చ 2: కప్పినట్టి నీమోవిగంట్లిట్టె రేఁచఁగాను

నొప్పులు గావుగదా నుడికారివి

చిప్పిల నింటికి నీవు చేయివట్టి తియ్యగాను

దప్పులు గొనవుగదా తమకపుదొరవు

చ 3: కాలుమీఁద గాలువేసి కరఁగించి కూడఁగాను

నాలితో మొక్కవుగదా నాఁటకీఁడవు

యీలీల శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి

వేళలు గావవుగదా వేడుకకాఁడవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1103-3 రామక్రియ సం: 21-015

పల్లవి: ఏది వాటి నీగుణాన కేమి చెప్పేము

పోదిగొన్న వద్దివారిపుణ్యము నీచేతిది

చ 1: సలిగెలు రేఁచుకొని సణఁగులురాలిచేటి-

చెలులకే నీవు కడుఁజిక్కుదువు

వలచి పైకొనియేటి వనితలఁ గంటేను

పెలుచుఁదనాన నట్టె బిగుతువు

చ 2: చనవులు సేసుకొని సారె సారె దిట్టేటి-

వనితలకే నీవు వలతువు

పెనఁగి ప్రియముచెప్పేప్రియురాండ్లఁ గంటేను

కొనగొనలనే నీవు గుట్టుసేసుకొందువు

చ 3: తరితీపుసేసుకొని తమకాలు రేఁచేటి-

తరుణులనే నీవు దగ్గరుదువు

అరుదై శ్రీవేంకటేశ అంతలో నన్నుఁ గూడితిః

విరవై అంతటిలోనే యిందరి మన్నింతువు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1103-4 గౌళ సం: 21-016

పల్లవి: ఇంతకంట జెలులాన యేమిచెప్పే రతనికి

మంతుకెక్కి తన్నుదానె మంచిదయ్యీఁగాక

చ 1: బుద్దులు నేఁ జెప్పనా పొందులు నేఁ జూపనా

బద్దులకాంతల నట్టె పాయఁడుగాక

గద్దించి నేఁ జూడనా కన్నుల జంకించనా

పెద్దరికపువారితోఁ బెనఁగీఁగాక

చ 2: పొంకానకు దిద్దుకోనా పొంచి పరాకుసేయనా

మంకుఁజీఁకటి తప్పులు మానఁడుగాక

లంకెసేసుక వుండనా లావులెల్లఁ జూపనా

బింకపువారిమాటలు ప్రియపడీఁగాక

చ 3: కందువ నేఁ గూడనా కాఁగిలించుకొననా

చెంది వారిగుణా లీడఁ జెప్పీఁగాక

అందపుశ్రీవేంకటేశుఁ డాతఁడే నేఁ గానా

మందెమేళాలేలో తొట్టి మరిగీఁగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1103-5 లలిత సం: 21-017

పల్లవి: వనిత లిట్టయితేను వలచివత్తురు నీకు

ఘనుఁడవు మేలు మేలు కంటిమిగా గుణము

చ 1: వంచినశిరసుతోడ వాలినట్టితురుముతో

కుంచె నీకు విసరేటికోమలిఁ జూచి

మంచముమీఁదికిఁ దీసి మన్నించితి వన్నిటాను

అంచె నాఁటదానిగోడు ఆలించితిగా

చ 2: కమ్మర నాసలతోడ కారేటి చెమటతోను

చమ్మాళిగెలు వట్టినసతిఁ జూచి

కమ్మి పచ్చడము గప్పి కరుణించితి వన్నిటా

నెమ్మి నింతులపయ్యెద నీకుఁ గద్దుగా

చ 3: వాలుకచూపులతోడ వడి నిట్టూరుపులతో

కాళాఁజి వట్టినసతిఁ గలసితివి

మేలిమి శ్రీవేంకటేశ మించ నన్నుఁ గూడితివి

యీలీల సతులవలపియ్యకొంటిగా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1103-6 బౌళి సం: 21-018

పల్లవి: ఓపనన్నవారినేల వొడివట్టేవు నీపై
చూపునాటించినవారిఁ జూడరాదా

చ 1: తలవంచుకుండఁగాను తగ పంతమియ్యఁగాను
వొలిసి నన్నేల నీవు నొడివట్టేవు
చెలఁగి నీమేననున్నచేఁత సేసియాపెతో
సొలసి నీబలిమెల్లాఁ జూపరాదా

చ 2: చెక్కుచేత నుండఁగాను చేరి నీకు మొక్కఁగాను
వొక్కటొక్కటాడి యేల వొడివట్టేవు
నిక్కి నిక్కి తామెరల నిన్ను వేసినవారితో
పెక్కుచందముల నీవు పెనఁగరాదా

చ 3: వొద్ద గాచుకుండఁగాను వూడిగాలు సేయఁగాను
వుద్దండానఁ గూడి యేల వొడివట్టేవు
చద్దికిని వేఁడికిని జమళినుండినవారి
అద్దుక శ్రీవేంకటేశ అలమరాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1104-1 కేదారగౌళ సం: 21-019

పల్లవి: పూవకపూచె వీరికి పొదిగొని వలపులు

చేవదేర మాతోనే చెప్పేరు యీసుద్దులు

చ 1: చన్నుల నొత్తితేఁ దనజంటమేను గందెనట

కన్నులచూపులే ఆపెఁ గాఁడెనట

యెన్నివేసాలు సేసేరు యేమిచెప్పేమమ్మ నీతో

విన్నప్పటనుండి మాకు వెరగయ్యీ సుద్దులు

చ 2: మోవి సోఁకితే నాతని మొనలెల్లా రాఁగెనట

కావిజంకెన లాపెఁ గదిమెనట

యేవంక చూచిన వీరియెమ్మెలే వెగ్గళమాయ

నూవుగింజ నానదిదె నోటిలో నీసుద్దులు

చ 3: చేయిచాఁచితే ననిచె శ్రీవేంకటేశ్వరుకట

కాయము చెమరించె నాకాంతకునట

యీయెడ నన్నిటు గూడె యెవ్వరి నేమనవచ్చు

బాయిలిపందిలులాయ పంతపు యీసుద్దులు





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1104-2 బౌళి సం: 21-020**

**పల్లవి: నేననగ నెంతదాన నీపాలికి**

**చేనిపంట కొయ్యేలే చెప్పీ చెప్పవయ్య బుద్దులు**

**చ 1: మచ్చిక నే జల్లఁగానే మాటలాడ వచ్చేవు**

**ఇచ్చకుఁడ ఇందాఁక నెందువోతివి**

**తచ్చనకాఁడవు నీవు తగులువిరులాడేవు**

**నచ్చులగొల్లెత లెట్టు నమ్మిరయ్య నిన్నును**

**చ 2: పైకొని నేఁ బిలువఁగ పలుకఁగ వచ్చేవు**

**చాకలవాఁడవు ముంచవద్దా నీవు**

**కాకరివాఁడవు మాతో గాలి ముడియగట్టేవు**

**చేకొని నీచెలి మెట్టు చేసిరయ్య సతులు**

**చ 3: మించి నేఁ గూడఁగానే మెచ్చులెల్లా మెచ్చేవు**

**మంచముపై నుండి యేల మరచుంటివి**

**చంచులశ్రీవేంకటేశ సందుసుడి మెలఁగేవు**

**యెంచ నిన్నెట్టు గెలిచి రిన్నాళ్లు నింతులు**




# అన్నమయ్య  సంకీర్తనలు


**శృ.రేకు: 1104-3 పాడి సం: 21-021**

**పల్లవి: కలమాట చెప్పే నీతో కల్లలాడనేరఁగాని**

**చెలఁగి కడపలోన చిత్తగించవయ్యా**

**చ 1: కపట మించుకలేదు కాఁతాళమే వుండీఁగాని**

**వుపమల నన్నేల వొరసేవయ్యా**

**నెపములు వేయ నీపై నిందలే మోచీఁగాని**

**చపలచిత్తము మాని చక్కవినవయ్యా**

**చ 2: జగడ మింతాఁ దీరె చనవు మెరసేఁగాని**

**నగుతానే నన్నేల నమ్మించేవయ్యా**

**పగటులు చూప నీతో పంతమే నెరపేఁగాని**

**మొగము చూతువుగాని ముందట నుండవయ్యా**

**చ 3: కోపములెల్లాఁ బాసె కొనగోరే నాఁటేఁగాని**

**తీపులు నీవేఁటికి సాదించేవయ్యా**

**యేపున నిన్ను శ్రీవేంకటేశ నేఁ గూడితిఁగాని**

**చేపట్టితి విదె నీవు సిగ్గువడవయ్యా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1104-4 కురంజి సం: 21-022

పల్లవి: ఆతఁడిదె నీవిదు అన్నిటాను జాణలు

యేతుల నింకానేలే యెడమాఁటలు

చ 1: అంకెకు రానేరిచితే అలుకలైనా సుఖమే

మంకుఁదనాలుడిగినమానినులకు

సంకెదీరితే మరునిశరములెల్లా విరులే

యింకనైనా మామాఁట లియ్యకొనరే

చ 2: విననేరిచినఁజాలు విరహమైన సుఖమే

మనసుదెలిసినట్టి మగువలకు

చెనకి లాలించితేను చిలుకలు మాఁటలాడు

చలములు మాని యిఁక సమ్మతించరే

చ 3: సరసము నేరిచితే జంకెనలైనా సుఖమే

తరితీపులెఱిగిన తరుణులకు

యిరవై శ్రీవేంకటేశుఁడిదివో నిన్నిటు గూడె

యెరవులు మరియేల యెనశుండరే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1104-5 ముఖారి సం: 21-023

పల్లవి: సంకెలెల్లాఁ దీరె చనవు లీడేరెను

వంక లొత్తకువే మాఁట వాఁటమయ్యా సిగ్గులు

చ 1: నగినదాఁకా నింతే నాతీ నీనిష్టూరమెల్ల

తెగనాడి ఇంతలోనే తిట్టనేఁటికే

మొగము చూచినప్పుడే ముచ్చటలు తుదకెక్కె

పగచాటకువే నీపయ్యద జారీని

చ 2: దగ్గరుదాఁకా నింతే తలపోఁతలన్నియును

కగ్గి ఇందుకుఁగాను వట్టికపటాలేలే

బగ్గనఁ బలికితేనే పంతమెల్లా నీడేరె

నిగ్గులఁ బెనఁగకువే నిండీఁ జెమటలు

చ 3: పొందినదాఁకా నింతే పొరపొచ్చెములెల్లాను

సందుసుడి నీకేలే జంకెనలు

ముందే శ్రీవేంకటేశుఁడ మొక్కఁగానే కూడితివి

పందెములు వేయకువే వచ్చీ దోఁచీఁ బనులు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1104-6 రామక్రియ సం: 21-024

పల్లవి: ఒద్దనే నే నున్నదాన వున్నది నీవెఱఁగవు

గద్దించి చూడవైతివి కామాంధకారానను

చ 1: హత్తి నీతోఁ బొందుసేసి ఆయములు గరఁగించి

బిత్తరిమాటలాడెఁగా ప్రియురాలు

లత్తుకరసాలతోడిలలితంపుఁగొనగోర-

నొత్తి నిన్ను సన్న సేసి వొరసెఁగా అపుడు

చ 2: పెనఁగి కాఁకలు చల్లి బిరుదులెల్లా నెరపి

చనవు మెరసెఁగా జవరాలు

తనివోనిముచ్చటల తమకము రేఁచిరేఁచి

పనిగొనెఁగా ఆపె పంతమున నపుడు

చ 3: గక్కనఁ గాఁగిలించి కన్నులు దేలగింపుచు

మొక్కి వూరకె వుండెఁగా ముద్దరాలు

అక్కడ శ్రీవేంకటేశ ఆవేళ నన్నుఁ గూడితి

తెక్కులనీతమకము తెలిసెఁగా అపుడు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శ్రృ.రేకు: 1106-1 గౌళ సం: 21-025

పల్లవి: ఇంతవాఁడవు నీబలి మిందుమీఁదనా

పంతపునీమనసెల్లఁ బట్టి తెచ్చీనా

చ 1: పిక్కటిల్లఁ దమకానఁ బెరిగెనింతె చన్నులు

కిక్కిరియ నీవు పెనఁగేపాటివా

పెక్కుమారు లింతయేల పిసికేవు ఇవి నిన్ను

జక్కవపులుగు లిట్టె సాదించీనా

చ 2: నిండినకోరికలచే నిక్కెనింతె యీతురుము

బండుబండుగా నీవు పట్టేపాటిదా

చండిసేయక విడువు సమయముసేసీ నీపై

గండుఁదుమ్మిదలు ఇవి ఘాతసేసీనా

చ 3: అట్టె చూడఁగా వెలసె అడుగులనడవులు

పట్టేవేల కూడుమంటా బలిమా యిది

గట్టిగా శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను

జట్టిగొన్నహంస లివి చండిసేసీనా



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1106-2 సాళంగనాట సం: 21-026

పల్లవి: కన్నవే అన్నియును నీఘనతలెల్లా

నిన్న మొన్న నివియెల్లా నేరుచుకవచ్చేవా

చ 1: చూపులోనే కానరాదా సూటియైననీవలపు

ఆపొద్దుననుండి పెట్టేఆనలేలా

చేపట్టితి వల్లనాఁడే చేరి నీవారమైతిమి

తీపులు పైఁబూసేవు దీనికీఁ గడమలా

చ 2: మాటలోనే కానరాదా మనసులో మర్మాలు

యేఁటికి మాతోఁ జెప్పే వెందాఁకను

మేఁటిఁ జేసితివి నన్ను మేనదాన నే నీకు

యేఁటికి వేఁడుకొనేవు యిదిగొంత వలెనా

చ 3: కూడినందే కానరాదా గుణములు నీవెల్లా

ఆడుకొననేమిటికి అంత మాతోను

యాడులేక శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

వేడుకపడేవు వీవిధము లెఱఁగనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1106-3 ఆహిరి సం: 21-027

పల్లవి: ఆతఁ డీడనే వున్నాఁడు అడుగరే

నీతితోడ నన్నునేల నేరమెంచేరే

చ 1: మొగము చూచినఁగాక మోహమెట్టు గానవచ్చు

నగినఁగా కెటు లామన్నన దెలుసు

తగులనాడినఁగాక దగ్గర నెట్లవచ్చు

నిగుడి మీరేల నన్ను నేరమెంచేరే

చ 2: మచ్చిక చల్లినఁగాక మాఁటలెట్లా నాడవచ్చు

ముచ్చటలాడక యెట్లు మొక్కవచ్చును

మెచ్చకతొలుతనే మేలమెట్లా నాడవచ్చు

నెచ్చెలు లిందరునేల నేరమెంచేరే

చ 3: చెలిమి సేసినఁగాక చెనకఁగ నెట్టువచ్చు

పిలువకతొల్లే యెట్టు పెనఁగవచ్చు

అలమి శ్రీవేంకటేశుఁ డంతలోనే నన్నుఁ గూడె

నెలకొని యిప్పుడేల నేరమెంచేరే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1106-4 దేసాళం సం: 21-028

పల్లవి: నీయంతవారమా నీవార మింతేకాక

నాయమాడేవారమా నమ్మేవారముగాక

చ 1: మారుకొని నేము నీతో మాటలాడేవారమా

వైరము లేకుండఁ దిట్టేవారముగాక

చేరి నీమేను నొవ్వ చెనకేటివారమా

నారుకొన గోరుసోఁక నవ్వేవారముగాక

చ 2: సరికిబేసికి నీతో జగడాలవారమా

వరుసెరిఁగి జంకించేవారముగాక

పరిపరివిధముల పగచాటేవారమా

గొరబుగా కొంగువట్టుకొనేవారముగాక

చ 3: బలిమిఁ గాఁగిట నన్నుఁ బట్టుకొనేవారమా

వలపించి లోలోఁ గూడేవారముగాక

కలసితి వీడ శ్రీవేంకటేశ్వరుఁడ నన్ను

పిలిచేటివారమా ప్రేమవారముగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1106-5 పాడి సం: 21-029

పల్లవి: చెప్పక నే మెఱఁగము చిత్తము నీదెట్లానో

చెప్పి సేయించుకోవయ్య చేరి వూడిగాలు

చ 1: గుఱితాఁకులవలపు కొమ్మ చూపుల నున్నది

చిఱునవ్వులవలపు చెక్కుల నదె

తఱచయిన వలపు తగ మోవినున్నది

నెఱయ నేవలపులు నేరిచితివో

చ 2: చలమఱివలపులు చనుమొనల నున్నవి

కులుకువలపు గోరికొన నదె

పెలుచువలపులెల్ల పిరుఁదుననే వున్నవి

యెలమి నీ కేవలపు యితవయ్యానో

చ 3: తమకపువలపెల్ల తగుకాఁగిట నున్నవి

గుమురువలపు పెద్దకొప్పున నదె

చెమటతోఁ గూడితివి శ్రీవేంకటేశ్వర చెలి

అమరిన దేవలపు అంటీనో నీకు




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1106-6 సామంతం సం: 21-030

పల్లవి: నేరుపరివౌదు వన్నిటా నీవు

యీరీతి మమ్ముఁజూచి నీవేల నవ్వేవయ్యా

చ 1: మచ్చికసేసిననీమాటలకు లోనై

రచ్చలకు నెక్కితిమి రవ్వయితిమి

పచ్చినీసతులచేతి పలుకులకు లోనైతి-

మిచ్చల మమ్ముఁజూచి నీవేల నవ్వేవయ్యా

చ 2: సోగకన్నులఁ జూచేనీచూపులకు లోఁగి లోఁగి

జాగులకు లోనైతిమి సరియైతిమి

బాగులై ననీవద్దిపడఁతులఁ జూచితిమి

యీగతి నీవింతలోనేల నవ్వేవయ్యా

చ 3: చేవలు దేరిన నీచేఁతలకు జొక్కి చొక్కి

వావులు దెలుపుకొంటి వనితనైతి

దేవ శ్రీవేంకటేశ నీదేవి నలమేల్మంగను

యీవేళఁ గూడితివి నీవేల నవ్వేవయ్యా





# అన్నమయ్య



# సంకీర్తనలు



**శృ.రేకు: 1107-1 దేశాక్షి సం: 21-031**

**పల్లవి: కాంతమీఁద నిష్టూరము కట్టకువయ్యా**

**వింతలేదఁ జేసీని విచారించవయ్యా**

**చ 1: తలఁపు నీమీదఁనే తలవంచుకున్నదింతే**

**అలుకేడ నున్నదో అంగనకును**

**వలపు నీమీఁదిదే వాడుదేరీ నింతే మోము**

**చలము లేదనున్నవి సటలు వద్దయ్యా**

**చ 2: తగులు నీమీఁదిదే తక్కి సిగ్గువడీ నింతే**

**యెగసక్కె మేడనుందో ఇందులోనను**

**నగవు నీమీఁదిదే నానఁబెఁట్టీ నిదె యింతే**

**పగటు లెక్కడఁ జూపె పచారించవయ్యా**

**చ 3: చేతులు నీమీఁదిదే చిత్తము తెలిసీ నింతే**

**ఘాత యాడనున్నాడో కలది యిది**

**యీతల శ్రీ వేంకటేశ యింతి నిట్టె కూడితివి**

**నీతి యెక్కడ నున్నది నీవు జాణవయ్యా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1107-2 తోండి సం: 21-032

పల్లవి: నీవు నేనుఁ జాలదా నేరుపులే కలితేను

వేవేలుగ వలపులు వెదచల్లేటందుకు

చ 1: నగవులేమిటికి నాలిసేసి నీవు నన్ను

పొగరులఁ గాఁగిలించి పొందేయందుకు

తగవులేమిటికి తరుణలఁ గూడపెట్టి

మొగిఁ గంకణదారము ముంచి కట్టేయందుకు

చ 2: చెనకులేమిటికి చేసన్నలకు లోనై

తనివంద నీవు నాకు దక్కేయందుకు

ననుపులేమిటికి నమ్మించి నీవు నాపై

పెనఁగి నిండుసేసలు పెట్టేయందుకు

చ 3: పంతములేమిటికి పైపై నిందరిలోన

యింతేసిచనువు నాకిచ్చేయందుకు

కాంతుఁడ శ్రీవేంకటేశ గక్కునఁ గూడితి నన్ను

బంతిబాసలేమిటికి బతికించేయందుకు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1107-3 శుద్ధవసంతం సం: 21-033

పల్లవి: వెలుపల బెట్టి మాతో వేసాలేల సేసేవు

కలపితే కదుపున గలసి యిట్టుండుగా

చ 1: యింతలో నీవాపెను యింటికి తెచ్చుకొంటేను

వంతులకు వాసులకు వచ్చుఁగా మాతో

చింతదీర నొక్కఁ టే సేసవెట్టి పెండ్లాడితే

పంతములుమీరక మాపనులకు వచ్చుఁగా

చ 2: చలివాపి ఆపెను మాసవతిఁగా జేసితేను

నిలువుఁ గొలువులను నిలుచుండుఁగా

కొలము తెలిపి మాతో కూటికి లోనుచేసితే

నెలకొని మావలె నిన్ను సంతోసించుఁగా

చ 3: గద్దెపీఁటమీఁద నాపెఁ గడఁ గూచుండఁబెట్టితే

సుద్దులెల్లఁ జెప్పుతాను సుకియించుఁగా

వొద్దిక నాపెను మమ్ము నొక్కటిగాఁ గూడితివి

వద్దనే శ్రీవేంకటేశా వాదులెల్లాఁ దీర్చుఁగా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1107-4 కుంతలవరాళి సం: 21-034

పల్లవి: ఎన్నాళ్ల కెన్నాళ్లు యిదేమే నీవు

విన్నపము లాలకించి విచారించేవు

చ 1: యిన్నిటాను నీవు నన్ను నేలవలె ననుచును

నిన్ను నొడఁబరచుట నేఁడా నేను

కన్నెలు పదారువేలు కలరంటానుండి వచ్చి

చన్నులంటే విది లెస్ససరవాయఁగా

చ 2: చేచేత నాచెప్పినట్టు సేయవలె ననుచును

నీచేత బాస గొంట నేఁడా నేను

యేచి నీవు వేగలేచి యెనమండ్రఁ జక్కఁబెట్టి

కూచుండేవు నావద్ద గుఱుతాయఁగా

చ 3: కైకొని నీవునాతో కాఁపిరము సేతువంటా

నీకుఁ జేతులు చాఁచుట నేఁడా నేను

యీకడ శ్రీవేంకటేశ యిందరినీఁ బొందివచ్చి

మేకొని నన్నుఁ గూడితి మెచ్చాయఁగా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1107-5 రామక్రియ సం: 21-035

పల్లవి: ఆపె మెచ్చవలె నీవు అట్టే మెచ్చఁగవలె

వోపిక గలిగి యిట్టే వుండవయ్య యిపుడు

చ 1: అంగన నీతోఁ జెప్పఁగ నట్టే నీవు మాటలాడే-

వెంగిలిమాఁటల మాఁటలేల మాకు

పొంగుచు నేనే మీఁదువోనిమాఁట లాడించేను

వుంగిటి గొనక యిట్టే వుండవయ్య ఇపుడు

చ 2: అప్పుడే నిన్నింతి నవ్వుమనఁగా నవ్వే-

వప్పణనవ్వులు నవ్వు టవేల మాకు

ముప్పిరి నేనే నిన్ను మెసులుగా నవ్వించే

వొప్పుగాని నావొద్ద నుండవయ్య యిపుడు

చ 3: రవ్వగా నింతి చెప్పఁగా రతి నన్నుఁ గూడితివి

యెవ్వరిపంగెనకూటాలేల మాకు

మవ్వపుశ్రీవేంకటేశ మరి నే నిన్నుఁ గూడితి

వువ్విళ్లూరుచు నిట్టే వుండవయ్య ఇపుడు





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1107-6 సాళంగనాట సం: 21-036**

**పల్లవి: మమ్మేమడిగేవు నీమతకములు**

**నెమ్మది నుండేవారము నెపాలు నేరుతుమా**

**చ 1: నీచిత్త మాపె యెఱుఁగు నీవెఱుఁగుదువు గాక**

**యేచి నీదేవరహస్యా లెవ్వఁ డెఱుగు**

**వాచవులకు నేము వద్దనుండి మాటలాడి**

**చూచేవార మింతేకాక సోదించఁగలమా**

**చ 2: నీతో నాపె నవ్వఁ జెల్లు నీకుఁ జెల్లు నింతేకాక**

**యేతుల మీవీడుదోళ్లు యెవ్వఁ డెఱుగు**

**చేతులార నేము నీకు సేవలేమయినాఁ జేసి**

**పోతరించే మింతేకాక బుద్ది చెప్పఁగలమా**

**చ 3: కోరినట్టే నిన్నుఁ గూడె కొమ్మఁ గూడితివి నీవు**

**యీరీతి మీ వూహపోహ లెవ్వఁ డెఱుగు**

**చేరి నన్నుఁ గలసితి శ్రీవేంకటేశ్వర నేఁడు**

**నేరుపుమిమ్మెంతుఁగాక నీటు చూపఁగలమా**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1108-1 ధన్నాసి సం: 21-037

పల్లవి: చెప్పిన ట్టిద్దరమునుఁ జేసేమయ్యా

ఇప్పుడు గాఁగిలించే మియ్యకొంటిమయ్యా

చ 1: వరుసఇచ్చేవాఁడవు వాదు మాన్పనేరవా

వెరసి యిద్దరిమాట వినవయ్యా

తెరలోనున్నవాఁడవు తెలియదా నీకిన్నియు

అరసి వెనకముందు లడుగనేలయ్యా

చ 2: తగవు దిద్దేవాఁడవు తప్పు దీర్చనేరవా

సొగసి నేమున్న జాడ చూడవయ్యా

నగినవాఁడవు నీవే నయములు నేరిపేమా

మొగమిచ్చలను నీవే మొక్కించవయ్యా

చ 3: ఇద్దరిఁ గూడినవాఁడ వెక్కుడు సేయనేరవా

చద్దికి వేఁడికి మోవి చవిగోవయ్య

గద్దరిశ్రీవేంకటేశ కలిగితివి మాపాల

పొద్దువొద్దున నిట్టె భోదించవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1108-2 బౌళి సం: 21-038**

**పల్లవి: బాపు బాపు మెచ్చితినే బలుదానవు**

**యేపుతోడ నుండేవార మింతేసి కోసరమే**

**చ 1: వాసనకస్తూరి వూసి వలపుచవులు చూప**

**వేసరవుగదే నీవు విభునితోను**

**మూసినముత్తెమువలె ముంగిటనే నిలుచుండి**

**ఆసపడేవారము నే మంతేసి కోపమే**

**చ 2: మోవితేనె లంచమిచ్చి మొకమోడింపించుకొన**

**దేవరవుగదే నీవు దేవునితోను**

**హావభావములతోడ ఆయమంటి మన్ననలే**

**ఆవటించుకొనేవార మందు కొడిగట్టము**

**చ 3: గందవొడి మీఁదఁజల్లి కాఁగిలించి కూడికూడి**

**విందవైతిగదే శ్రీవేంకటేశుతో**

**అందమై ఆతఁడే కూడె అలమేలుమంగనేను**

**చందమైనవార మింత సాదించనెఱఁగము**



 అన్నమయ్య  సంకీర్తనలు 

**శృ.రేకు: 1108-3 రామక్రియ సం: 21-039**

**పల్లవి: ఇంకనేలే మాటలు యెఱుఁగుదు నేనన్నియు**

**కంకిగా నీతోఁ దారుకాణించితిఁ జాలదా**

**చ 1: సెలవి నీవు నవ్వఁగా సిగ్గువడి ఇంతి నిన్ను**

**కలువపూవున వేసెఁ గద్దో లేదో**

**నిలువుటద్దములో నీ నీడ నీవు చూచుకోఁగా**

**కలికి కాఁగిటఁబట్టె కద్దో లేదో**

**చ 2: అందముగా నీవు దన్ను ఆయములు చెనకఁగా**

**గందము నీపైఁ బూసె కద్దో లేదో**

**సందడిఁ గొలువలోన సరిఁ బరాకై యుండఁగా**

**కందువలు నిన్ను నంటెఁ గద్దో లేదో**

**చ 3: నిక్కి నీవు చూడఁగాను నిన్నుఁజేయివట్టి తీసి**

**గక్కున రతులఁ గూడె కద్దో లేదో**

**యిక్కడ శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి**

**కక్కసించి జంకించెఁ గద్దో లేదో**





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1108-4 లలిత సం: 21-040**

**పల్లవి: సోబాన బాడేము మేము సుదతులము**

**యీబుద్ధులు మీకుఁ జెల్లు నిద్దరికి నయ్యా**

**చ 1: చూపులనే వుంకువలు సుదతికిఁ బెట్టితివి**

**పూపనవ్వులు మించేకప్పువిడేలు**

**యేపుమీరి నవ్వులనే యెదురుతెర వేసితి-**

**వీపొద్దే పెండ్లాయను మీకిద్దరికినయ్యా**

**చ 2: తరితీపుమాటనే తలఁబాలు వోసితి**

**గరిమ సరసములే కంకణాలు**

**గొరబైనవలపుల కొంగులు ముళ్లువేసితి-**

**విరవాయ వేడుకలు ఇద్దరికినయ్యా**

**చ 3: పొంచినకెమ్మోవినే బువ్వపువిందు వెట్టితి**

**మంచముపై కాఁగిలే మంచిచవికె**

**అంచలశ్రీవేంకటేశ అలమేలుమంగ నీవు**

**యెంచి కూడితిరి తగు నిద్దరికినయ్యా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1108-5 ఆహిరి సం: 21-041

పల్లవి: ఇన్నియు నీవే నేరుతు నిఁక నెన్నఁడు

పన్నినసటలెల్లాఁ జేసి పాలార్చవయ్యా

చ 1: కాంతకు నీబుజమురేకలు చూచినంతనుండి

చింతతోడ చెక్కులెల్లాఁ జెమరించెను

మంతనానకుఁ బిలిచి మనసుమర్మము సోఁక

పొంతనే నీవానవెట్టి బొంకఁగదవయ్యా

చ 2: కొమ్మ నీతురుము చూచి కొత్తపూవులెల్లాఁ జూచి

తమి మోము వంచుకొని తడఁబడీని

నెమ్మనమలర నీవు నేరుపులెల్లా మెరసి

సమ్మతించేయట్టుగాను సత్యాతు చూపవయ్యా

చ 3: అలమేలు మంగ నీవాడేటిప్రియాలు చూచి

కలసి మోవిచ్చె శ్రీవేంకటేశ్వరుఁడా

వెలయ నింకా నీవు వేవేలుచందముల

పలుసాకిరులు చెప్పి భ్రమయించవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1108-6 భైరవి సం: 21-042**

**పల్లవి: ఏల నన్ను సోదించె వెందాఁకాను**

**నీలాగులు నాలాగులు నీకే తెలుసును**

**చ 1: తక్కించి నీవు నన్నుఁ దప్పులువట్టేవు గాక**

**యెక్కువనామనసు నీవెఱఁగనిదా**

**చెక్కు చేతఁబట్టుకొని సిగ్గువడి వున్నదాన**

**నిక్కి నావిన్నపాలెల్లా నీకే తెలుసును**

**చ 2: మంతనాన నాతోను మాఁటలు దీసేవుగాక**

**యింతట నాగుణము నీవెఱఁగనిదా**

**బంతి నిందరిలో మానాపతినై నేనున్నదాన**

**దొంతునాయాస నీకు తొల్లే తెలుసును**

**చ 3: నవ్వుతానే నీవు నన్ను నంటునఁ గూడితిగాక**

**యివ్వల నానేరువు నీవెఱఁగనిదా**

**జవ్వనపు శ్రీవేంకటేశ్వర యలమేల్ మంగను**

**పువ్వువంటిపొందు నీకుఁ బూఁచితేఁ దెలుసును**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1109-1 నట్టనారాయణి సం: 21-043

పల్లవి: ఏల సాకిరి గోరేవు యింతలో నన్ను

ఆలరిసతులకు నీ కమరుఁగాక

చ 1: నిగ్గులమాట లాడ నీతో నే నేరుతునా

సిగ్గువడియుండేటిచెలి నేను

కగ్గి నీవలెనే నేను కల్లలాడ నేరుతునా

మొగ్గులేనియటువంటి ముద్దరాల నేను

చ 2: నీవునేరనిచేఁతలు నే నేరుపఁగలనా

వావితో లోనుండేరాణివాసమ నేను

వోవరిలో నీసుద్దులు వూఁకొన నేఁ గలనా

కోవిలకూఁత కుత్తిక కోమలిని నేను

చ 3: జంకించి కాఁగిటఁ గూడేచలమరిదాననా

వంకలాడ నేరిచినవనిత నేను

అంకెల శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను

పొంకమై కలసితివి పొందనేర్తు నేను





# అన్నమయ్య సంకీర్తనలు





శృ.రేకు: 1109-2 పళవంజరం సం: 21-044

పల్లవి: ఎంత కెంత మన్నించేవు యేమయ్య నీవు

అంతలోనే మెచ్చేవు నీయంతదాననా

చ 1: చెక్కులు నే నొక్కఁగాను చేతుల మొక్కవచ్చేవు

వొక్కటఁ బతికిపతి వుపకారమా

మొక్కలపుదాన నేను ముందెంచేవాఁడవు నీవు

చక్కఁగ చేయి వట్టేవు సరిదాననా

చ 2: కందువ నే నవ్వితేను కడుసరసమాడేవు

వొందిలి నందుకునిందు కుపకారమా

మందెమేళపుదానను మంచినేర్పరివి నీవు

పందేలువేసేవు నీపాటిదాననా

చ 3: చేరి కాగిలించుకొంటే సిగ్గులు చేతఁబట్టేవు

వూరట మారుకుమారు వుపకారమా

ఆరీతి శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను

మేరలు రేవు నిన్ను మించేదాననా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1109-3 వరాళి సం: 21-045

పల్లవి: తీరుచవయ్య తగవు దీనికి నీవు

నేరుపరితనమెల్లా నీచేత నున్నది

చ 1: పందేలువేసి నీతోఁ బలుమారు జూజమాడి

దిందుపడ నుంగరము దీసుకొన్నది

అందుకుఁగా వేరొకతె అది దనసొమ్మనుచు

అంది తలపిడివట్టి అడుగుతానున్నది

చ 2: సరి బేసి వట్టి యొక్కసతి నిన్ను నోడించి

గొరబుగా నచ్చుటాసె కోకకొంగున

సిరుల నీదట్టి తనచీరంటా వేరొకతె

అరసి పట్టి యందుకు నాపె మారుకొనెను

చ 3: వానగుంటలాడి వొకవనిత నీచేయి వట్టి

ఆనవెట్టి వేలొకతె ఆచేయిఁ బట్టె

ఆనుక శ్రీవేంకటేశ అలమేల్ మంగ నే వచ్చి

మేనంతి వురమెక్కితే మెచ్చిరి యిందరును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1109-4 గౌళ సం: 21-046

పల్లవి: వద్దనుండే చెనులతో వట్టిబీరము లేఁటికి

పొద్దువోనిజంకెనలు బొమ్మలలో నున్నవి.

చ 1: మొనలుచూపకువే ముంచిననీచన్నులు

కొనలు సాగీ యాతనిగోరు వాఁడి

పెనఁగితే మీరిద్దరు బిరుదుల దొడ్డవారు

తనువులు సోఁకితేనే తారుకాణ వచ్చునే

చ 2: కాటుకకన్నులనేల కారములు చల్లేవే

తేటమాటల నాతనితిట్లున్నవి

యీటుతో నీసరసాన నిద్దరును దొడ్డవారే

కూటములలోనే మీగురుతులయ్యీనే

చ 3: కందువకాఁగిటనేల ఘాతలెల్లాఁ జూపేవే

అందుకు శ్రీవేంకటేశుఁ డాణికాఁడు

పొందితిరి మీరిద్దరు భోగముల దొడ్డవారే

సందడి జాణతనా చవివుట్టీనే



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1109-5 శంకరాభరణం సం: 21-047

పల్లవి: కొలువూఁ జేయించుకొనీ గోవిందరాజు

చెలులము యీడనుండే చేరి మొక్కరే

చ 1: పవళించి వున్నవాఁడు పాదాలు చాఁచుకున్నాఁడు

జవళిఁ దనయిద్దరుసతులమీఁద

రవళి గోవిందరాజు రవ్వగా నవ్వులు నవ్వీ

తివిరి యీభావము తెలుసుకోరే

చ 2: చేయిచాఁచుకున్నవాఁడు శిరసెత్తుకున్నాఁడు

చాయల గోవిందరాజు సన్నసేసిని

ఆయములు సోఁకించి అంగనలఁ గరఁగించీ

కాయపుటిచ్చల నూడిగము సేయరే

చ 3: సంకుఁజక్రములవాఁడు చల్లుచున్నాఁడు వలపు

కొంకక శ్రీవేంకటాద్రి గోవిందరాజు

వుంకువగా లోలోనే వువిదలఁ గూడినాఁడు

సంకెలేక వారిలో ముచ్చట వినరే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1109-6 భైరవి సం: 21-048

పల్లవి: గుట్టు చేకొందువుగాక కోమలితోను

పట్టి పెనఁగఁగఁబోతే పంతమెక్కీ సుమ్మీ

చ 1: చెక్కులనే నీడ చూచి సిగ్గుల నీరెండ గానె

చిక్కుదీసీ నీనెరులు చెలియ

మొక్కీఁ దనకాలు దాఁకి మోసమున నంటాను

వక్కణ లడుగఁబోతే వాదువచ్చీ సుమ్మీ

చ 2: కన్నుల నివాళ్లిచ్చి కాఁకలనే చొప్పులెత్తి

చన్నులఁ గానుక చూపీ జలజాక్షి

మన్ననల వేఁడుకొని మాటదప్పి వచ్చెనంటా

సన్నలు సేయఁగఁబోతే చలమెక్కీ సుమ్మీ

చ 3: మోవినే విందుచెప్పి మోహమున విడెమిచ్చి

కైవసమై నినుఁ గూడె కలికి

శ్రీ వేంకటేశ్వర నవ్వి చేఁతసేసితి నిన్నంటా

వావాతఁ గొసరఁబోతే వాసులెక్కీ సుమ్మీ





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1110-1 మధ్యమావతి సం: 21-049**

**పల్లవి: ఏమోయా మాతోనే యేల గోరాదిగొనేవు**

**దీమువలె నున్న వారి దీకొనేవు**

**చ 1: మాట మఱఁగుసేసుక మౌనముతో నుండితేను**

**గాఁటమున నన్నేల గర్వమనేవు**

**కాటుకకన్నుల గాఁగా కడుఁదలవంచుకొంటే**

**గోటారించి నన్నేల కోపమనేవు**

**చ 2: సిగ్గుతెర వేసుకొని చెక్కుచేత నుండితేను**

**యెగ్గులువట్టితినంటా యేల లోఁచేవు**

**దగ్గరనోపక నేను తలుపుమాటును నుంటే**

**బగ్గన లోనికి వచ్చి పైకొనేవు**

**చ 3: మానాన మణిఁగి నేను మంచముపై నుండితేను**

**కానుకగా మోము చూచి కాగిలించేవు**

**పూని శ్రీవేంకటేశుఁడ పొదిగి నిన్నుఁ గూడితే**

**సానఁబట్టినగోరేల జళిపించేవు**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1110-2 సామవరాళి సం: 21-050

పల్లవి: మానరాదా యిఁకనేల మతకములు
నాని నాని నవ్వులెల్లా నయములు వచ్చెను

చ 1: నిన్ను నే గొసరఁగాను నీవు నాతోఁ బెనగేవు
యెన్నిక లింకేమున్నవి యేడ సుద్దులు
సన్నల మనమంకులు సరికి బేసికి నాయ
నున్నని చెమట లివె నొసళ్లెల్లా నిండెను

చ 2: పంతాలు నే నాడఁగాను పై పై నురము దట్టేవు
యెంతకెంత సేసే వు యేడ సుద్దులు
మంతనపుమాటలెల్లా మారులు మలయఁజొచ్చె
చెంతల పులకలెల్ల చెక్కులెల్లా నిండెను

చ 3: కొంగు నేనే పట్టఁగాను కుచ్చి కాఁగిలించేవు
యెంగిలాయ మోవులెల్లా నేడ సుద్దులు
కంగక శ్రీవేంకటేశ కలసితి మిద్దరము
సంగడి మనమేనుల సంతోసాలు నిండెను





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1110-3 బౌళి సం: 21-051**

**పల్లవి: నెట్టనఁ బాపపుణ్యాలు నీచేతివి? నీ——**

**వొట్టి చనవియ్యఁగాను వొల్లనంటినా**

**చ 1: చలమేల మాతోను సాదించేవు నీ-**

**పలుకులకు లోనైనపడఁతులము**

**వలపు లేమిటి కింత వడిఁబెట్టేవు నీ——**

**వలసినట్టు సేయఁగా వద్దంటినా**

**చ 2: కడునిష్ఠూరములేల కట్టవచ్చేవు**

**విడువరానినీవెలఁదులము**

**జడిగొన్నమనసేల చండిసేసేవు నీ-**

**వొడివట్టఁగ నీతో వోపనంటినా**

**చ 3: బెట్టుగాఁగిటనేల బిగియించేవు**

**జట్టిగొన్ననీమోహంపుజవరాలను**

**గుట్టున శ్రీవేంకటేశ కూడితి నిన్ను**

**యిట్టె నావొద్దనుంటే యిచ్చగించనా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1110-4 శ్రీరాగం సం: 21-052

పల్లవి: పొంచిననీమన్ననకు పొగడుచుండుదుఁగాక

కంచములోనమృతము కడకుఁ బోఁదోతునా

చ 1: నీవుసేసేచేఁతలలో నే నేరము లెంచేనా

కైవసమై అన్ని యునుఁ గైకొందుఁగాక

పూవులపుప్పొడిలోన పూఁదేనె చిందితేను

వేవేలైనా నందుకు వింతలుగాఁ జూతురా

చ 2: ఆడిననీమాటలలో అందములు వెదకేనా

వేడుకతో మంచివేకా విందుఁగాక

వీడెములోఁ గప్పురము వింతలుగాఁ గలసితే

వీడుపడీనా యందుకు వేరులుగాఁ జూతురా

చ 3: పొందిననీరతులలో పొరపొచ్చా లరసేనా

కందువలు మొరయఁ బొగడుదుఁ గాక

గందములోపల మంచికస్తూరి గలసితే

విందులశ్రీవేంకటేశ వెగటుగాఁ జూతురా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1110-5 లలిత సం: 21-053

పల్లవి: ఇంకా మరి యాసోద మెంతనీకు

సంకెదీర నన్నిటాను చవులు చూచితివి

చ 1: నన్ను నీవు పిలిచేది నవ్వులకో నిజాలకో

కన్నెలు పదారువేలు గలరు నీకు

కన్నుల నీవు చూచేవు కాఁకలకో మేకులకో

మున్నె గొల్లెతలయంగములు చూడవా

చ 2: దగ్గరఁ గూచుండేవు తప్పులకో వొప్పులకో

యెగ్గులేని యెనమండ్రు ఇంతులు నీకు

సిగ్గుదీర నవ్వేవు చింతలకో వంతులకో

నిగ్గులగొల్లెతలతో నీవు నాఁడే నవ్వవా

చ 3: కలసితి విటు నన్ను ఘాతలకో యేతులకో

యెలమి నిరువంకలా ఇద్దరు నీకు

అలరి శ్రీవేంకటేశ అన్నిటా మన్నించితివి

మెలఁగి లోకమువారి మిక్కిలి మన్నించవా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1110-6 అందోళి సం: 21-054

పల్లవి: రమ్మనవే ఇఁకను నీరమణునిని

పమ్మి వలపులు చల్లీఁ బదిమారులు

చ 1: నెలకొ నప్పటనుండి నిన్నే తప్పకచూచీ

తలపోసి తలపోసి తడఁబడీని

మొలకనవ్వులతోడ మూతులు గిరిపీనదె

నలువంక పొంచి పొంచి నవ్వులు నవ్వీని

చ 2: పెనఁగుచుఁ బలుమారు పెచ్చుపెరగీఁ దాను

గునిసి పరులమీఁద కోపగించీని

వెనుకొని నీజాడలే వెదకీ నితఁడు నేఁడు

మనసుమర్మాలు చూడ మచ్చికసేసీని

చ 3: పొరుగుపొంతలనుండి బుద్దులు చెప్పీనదె

గరిమల మించీఁ గలికితనమునను

యిరవై శ్రీవేంకటేశుఁ డిన్నిటా నిన్నుఁ గలసె

సరసములాడుతానే చనవు చూపీని



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1111-1 మంగళకౌసిక సం: 21-055

పల్లవి: చేవట్టితే రానిది చిక్కి సన్నకు వచ్చీనా

వావి దిరుగవేసితే వలపు లేమున్నది

చ 1: మన్నించి నీవు నాతో మాటలాడితివిగాక

నిన్నుఁ బలికించేనంటే నే నెంత దాన

చన్నులు గిలిగించితే సరి నవ్వవచ్చుగాక

కిన్నెరకాయలు గిలిగించితే నేమున్నది

చ 2: దయవుట్టి నీవు నాదండకు వచ్చితిగాక

నయమున నేఁ బిలువ నావశములా

ప్రియమున జౌలెఱఁగ పెద్దనాలికనేకాక

క్రియ యెఱఁగ జేతిలో కీలు మరేమున్నది

చ 3: కందువతో నీవు నన్నుఁగాఁ గిలించితివి గాక

అంది బలిమిసేయఁగ నంతదాననా

పొంది శ్రీవేంకటేశ నీభోగమందే వుందిగాక

అందుకోలు జాణతనా లందులో నేమున్నది









శృ.రేకు: 1111-2 నాట సం: 21-056

పల్లవి: ఏల సాకిరులువెట్టే నేమి మీతోఁ జెప్పేని

జాలిలేక తానే చక్కజాడ నుండరాదా

చ 1: ఆఅడిగా కేకతానే ఆలుమగఁ డుండఁ గాను

వేఱొకతె వచ్చితేనే వీరిడి గాదా

జాఅక తమలోనను జాణతనాలాడఁగాను

తూటి తాను నవ్వఁబోతే దొమ్మి సేయకుందురా

చ 2: పడఁతియుఁ బురుషుఁడు పైకొనొ మాటలాడఁగ

యెడచొచ్చి మాటలాడే దెడ్డగాదా

అడియాలముగ వారు ఆయములు చెనకఁగా

కడనుండి తా నంటితే కడుఁగూళ గాదా

చ 3: శ్రీవేంకటేశుఁడు నన్ను చేకొని కూడుండఁగ

భావించి వింతది చూడఁ బాడియవునా

పూవువలెఁ దొల్లి తాను పొందుగలదిగనక

ఆవేళఁ దా నొరసితే నంగవించకుందురా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1111-3 సామంతం సం: 21-057

పల్లవి: రమణునీకడ కిటు రావమ్మా

జమళిముచ్చటలు చవులై నిలిచె

చ 1: కొత్తకోరికలు కొనలు సాగఁగా

చిత్తము నిండెను సిగ్గెల్లా

పొత్తులవలపులు పోగువోయఁగా

హత్తినపులకలు అంగము నిండె

చ 2: తొక్కినతమకము దొంతుల నుండఁగ

ముక్కున నూర్పుల ముసరుకొనె

చిక్కనినవ్వులు సెలవులఁ దొలఁకఁగ

చొక్కపుచెమటలు సోనలు గురిసె

చ 3: కందువైనరతి కాఁగిట నుండఁగ

విందులనెమ్మోము వికసించె

యిందె శ్రీవేంకటేశుఁడు గలసెను

అంది మోవితేనియలు దయివారె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1111-4 శుద్ధవసంతం సం: 21-058

పల్లవి: ఎన్ని లేవు నేరము లిఁకనేల

నన్ను నిన్ను నెంచుకొని నవ్వఁగదవమ్మా

చ 1: ఆసపడినయప్పుడు అన్నియును చవులౌను

వేసరుకొన్నప్పుడైతే విసుపౌను

రాసికెక్కినవలపు రంటికి వచ్చు నిప్పుడు

యీసులెల్లఁ దీరె నిఁక నింటికి రావయ్యా

చ 2: దగ్గరి యేకతమైతే తమకించు నెందుకైనా

సిగ్గువడి ఇందరిలో చింతపుట్టును

నిగ్గులవయోమదము నీడా నెండావలె నుండు

యెగ్గు లెంచఁబనిలేదు ఇంటికి రావయ్యా

చ 3: కూడఁగఁ గూడఁగ నట్టె కోరికలు కొనసాగు

వీడనాడఁబోతేను వింతపుట్టును

యీడనే నన్ను శ్రీవేంకటేశ కాగిలించితివి

యేడకు నేఁటికిని మా ఇంటికి రావయ్యా




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1111-5 బౌళి సం: 21-059

పల్లవి: ఎంగిలిపొందులు నీకు నింతప్రియమా

జంగిలివలపులేల సానఁబెట్టేవే

చ 1: మంతనమునను నేము మాటలాడుకొనఁగాను

వింతదానవు నీవేల వినవచ్చేవే

బంతి నాతఁడును నేను పాలకూ ళ్లారగించగా

అంతట నుండి నీవేల అట్టె చూచేవే

చ 2: సారెకు నేమిద్దరము సన్నలు సేసుకొనఁగ

తారుకాణ నీవేల అర్తాలు చెప్పేవే

నారువోసినట్టు నేము నవ్వులిట్టె నవ్వుకోఁగా

దూరుగాను నీవేఁటికి తోడు నవ్వేవే

చ 3: ఇక్కువల శ్రీవేంకటేశుఁడు నేఁ గూడఁగాను

గక్కన వాకిట నేల కాచుకుండేవే

నిక్కమై నే మిద్దరము నివ్వెరగుతో నుండఁగ

వొక్కటై కూడితివి నీవును మాతోనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1111-6 పాడి సం: 21-060

పల్లవి: అప్పుడు మనసువచ్చు నన్నిటా నీకు

చెప్పరానిమాటలకు చెవియొగ్గేనయ్యా

చ 1: యేతులకు నీవు నన్ను ఇటు నటుఁ జెనకఁగా

కాతరాన నే నిన్నుఁ గాదందునా

వాతులు మోవఁగ నీకు వలపులు పొంగఁగాను

పోతరించి ఇచ్చకాల పూవుగట్టేనయ్యా

చ 2: నవ్వులకు నీవు నన్ను నయములఁ దిట్టఁగాను

రవ్వలుగా నే నప్పటి రాఁపుసేతునా

మువ్వంక జవ్వనము మొలకలువెళ్లఁగాను

నివ్వటిల్లఁ జెమటల నీరుగట్టేనయ్యా

చ 3: చనవు చేసుక నన్ను సమ్మతించఁ గూడగాను

గునిసి వేరే నిన్నుఁ గొసరుదునా

తనివి శ్రీవేంకటేశ తమకపువిందులకు

చనవులనే వుపచారము చెప్పేనయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1112-1 ధన్నాసి సం: 21-061

పల్లవి: ఇప్పుడిట్టె వింటిమి నీవేల నవ్వేవు

చెప్పితేను దోసమా సిగ్గువడనేఁటికి

చ 1: అంగన విచ్చేసి నేఁడు ఆయమైననీమోవి

యెంగిలిసేసినదట ఇది నిజమా

కుంగకుండేయటు వంటి కుచముల కొనలను

అంగవించి వొత్తెనట అది నిజమా

చ 2: వొక్కమంచముపై నుండి వొడఁబడఁజెప్పి నీ-

యిక్కువ లంటినదట యిది నిజమా

చక్కనితనపాదాలు సారె నీమ్మె సోఁకించి

అక్కర దీరిచేనట అది నిజమా

చ 3: నీవు నేనుఁ గూడుండఁగా నెమ్మది శ్రీవేంకటేశ

యీవేళఁ దా నున్నదట యిది నిజమా

వోవరిలో మిగిలినవూడిగాలెల్లాఁ జేసి

ఆవటించి మొక్కెనట అది నిజమా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1112-2 దేశాక్షి సం: 21-062

పల్లవి: నీవేల నన్ను నింత నేరమెంచేవు

మోవితేనియలు చూచి ముందే భ్రమసితి

చ 1: యేమిసేతు నను నీవు యేల యెగ్గువట్టేవు

నామేను చెమరించీ నవ్వఁబోతేను

కోమలపుమేనిదాన కొండుకపాయపుదాన

నీమీఁది మోహమున నేనింత అలసితి

చ 2: నావంక గడమ యేది నన్నేల లోఁచి చూచేవు

చేవఁ బరవశమయ్యీ చెనకితేను

పూవువంటిమతిదాన భోగపురతులదాన

కావరించి నీకుఁగానే కాఁకలు రేఁగితిని

చ 3: నేనెంత నీవెంత నేఁడేల వేఁడుకొనేవు

కానుకగాఁ బులకించి గదిసితేను

అనుక శ్రీవేంకటేశ అట్టే నన్నుఁ గూడితివి

తానకమై నీకొరకు తమకమందింతిని





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1112-3 ఆహిరి సం: 21-063

పల్లవి: మనలో నెక్కడి వింక మంకుఁదనాలు

చనవులు గలవారు చలపట్టరు

చ 1: వొలిసినవారు తమవోరుపే నెరపుదురు

యెలమి నేమిసేసినా యెగ్గుపట్టరు

కలసినవారు లోలో కరఁగుదురు చిత్తాలు

కొలఁదిమీరివచ్చిన కోపగించరు

చ 2: కూడినట్టివారు మంచిగుణములే నింతురు

వీడ నెంత ఆడినాను వేసారరు

వేడుకగలుగువారు వీడుదోడు లాడుదురు

పాడి దప్పి యించుకంటా పంతమాడరు

చ 3: ననుపులుగలవారు నవ్వులే నవ్వుదురు

తనువులు సోఁకినాను తమకించరు

యెనసితిమి శ్రీవేంకటేశ మనమిద్దరము

ఘనులయినవారిట్లా గతి గూడుకొందురు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1112-4 వరాళి సం: 21-064

పల్లవి: అందుకేమి దోసమా అతనికి నీకు వేరా

సందడి నాతనిరతి సమ్మతించవే

చ 1: మోహముగలుగువారు ముందువెనక లెంచరు

యీహల మొక్కెనంటా నీవేల లోఁగేవే

సాహసములూఁ జేతురు చనవులూఁ జెల్లింతురు

పోహణించి వలపుల భోగించవే

చ 2: తమిగలిగినవారు దండనుండి పాయరు

కొమరెనంటానేల కొంకఁజూచేవే

జమళిఁ జొక్కుదురు ఇచ్చల నవ్వుదురు తాము

చెమట చిత్తడి తోడ చెలరేఁగవే

చ 3: ఆయమెరిఁగినవారు అట్టె కాఁగిలింతురు

చేయివట్టెనంటానేల సిగ్గువడేవే

యీయెడ శ్రీవేంకటేశుఁ డిదె నిన్నుఁ గూడె నేఁడు

చాయలు సేసుక ఇట్టె చనవియ్యవే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1112-5 భైరవి సం: 21-065

పల్లవి: నమ్మితిమి నిన్నును నానారీతుల మేము
నెమ్మనపు మన్ననలు నీచేతి దింకను

చ 1: మొక్కితిఁగా అల్లనాఁడే మోపులకొలఁదులు
మిక్కిలి యెంచుకో నీమీఁద నున్నవి
నిక్కి చూచితి నిందాఁకా నీకు నెదురై నేను
చిక్కినపుణ్యములు నీచేతిదే ఇఁకను

చ 2: పంపితింగా కానికలు బండులకొలఁదులు
ముంపున బండారించి ముడుపైనది
సంపదల నీపేరు జపియించుకొంటా నుంటి
ఇంపులఁ గీర్తులు నీ కెక్కినవే ఇఁకను

చ 3: చెప్పితిఁగా ప్రియములు సేనాసేనలు నేఁడు
కుప్పలుగా నీయందు గొనకొన్నవి
చిప్పలఁ గూడితి నిదె శ్రీవేంకటేశ్వర నిన్ను
చెప్పరానిమెచ్చులెల్లా చెల్లు నీకు నిఁకను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1112-6 శ్రీరాగం సం: 21-066

పల్లవి: ఏఁటికి అనుమానము లిద్దరును నిలుచుండి

కూటములు గూడితే మీగుణమే సుఖము

చ 1: నేరుపు గలిగితేను నెపము లెంచకుండితే

ఆరితేరకుండినా మోహము సుఖము

చీరములు నెరపక ప్రియములే ఆడితేను

వారించరానియట్టివయసే సుఖము

చ 2: యెరవులులేక మరి యియ్యకోళ్లే కలితేను

గొరబుగానియట్టిసిగ్గులే సుఖము

కరఁగినమనసులై కైవశము లయితేను

సిరులమించినయట్టి చెనకులే సుఖము

చ 3: చనవులు మెరిసితే జగడాలు దీరితేను

తవివోనిరతులే సంతతసుఖము

యెనసితిరి శ్రీవేంకటేశ మీరిద్దరును

ననుపులతోడిమీలో నగవులే సుఖము



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1113-1 పాడి సం: 21-067

పల్లవి: అత్తఁగారు వచ్చుదాఁకా నణఁగుంటిని
యెత్తినకోపముతోడ యేమందునే

చ 1: యేకతమాడినదాఁకా నిద్దరివేళ గాచుక
వాకునిష్ఠూర మాడక వాకిట నుంటి
మేకులన్నియుఁ జూచి మెచ్చులు మెచ్చుతా నుంటి
యీకడ మంచితనము లెందాఁకనే

చ 2: నవ్వు ముగిసిన దాకా నణుపుసేసుక వుంటి
పవ్వళించుండఁగా నెగ్గుపట్టక వుంటి
పువ్వులు లోని కంపిత భోగించుమని యంటి
యెవ్వరిబుద్ధులు వినే దెందాఁకనే

చ 3: తానే విచ్చేసినదాఁక నణుపుసేసుక వుంటి
ఆనెలఁత మొక్కఁగాను ఆవునంటిని
వూని శ్రీవెంకటేశుఁడు పొందె నింతలో నన్ను
యేనేరమి లేదు చల మెందాఁకనే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1113-2 బౌళి సం: 21-068

పల్లవి: చాలుఁజాలు నిఁకనేల సాదింపులు

మీలోనిదాన నేను మీరే నేను

చ 1: కతలు నేరుచుఁ దాను కపటా లెరుఁగుఁ దాను

అతనితో నే మాటలాడఁగలనా

ఇతవరులైనవారు ఇచ్చకాలాడరే మీరు

మితిమీరితేఁజాలు మీరే నేను

చ 2: తప్పులు లేవు దనకు తగవ లిన్నిటాఁ దాను

దెప్పరమై తనతోను దీకొనేనా

చెప్పరానిచుట్టాలు సేవలు సేయరే మీరు

మెప్పించితేఁ జాలు మీరే నేను

చ 3: అన్నిటా జాణఁడు దాను అందాలకు వచ్చుఁ దాను

చన్నుల నొత్తితి నిఁక చలపట్టేనా

వున్నతి శ్రీవేంకటేశు నొనగూర్చితిరి మీరు

మిన్నక నవ్వఁగఁ దేరె మీరే నేను



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1113-3 గౌళ సం: 21-069

పల్లవి: మేలే జాణతనాలు మిక్కిలి లాబగాఁడౌను

కీలు చెప్పఁబోటే నాపై కేలు చాఁచీనే

చ 1: తగవులు చెప్పఁబోతే తమలోని మాటలకు

తగులనాడె నన్నుఁ దగునే తాను

మొగములు చూచి నేను మొక్కులు మొక్కఁగఁబోతే

చిగురుఁజేతులు వట్టి చెనకులు నించీనే

చ 2: ఇతవులు సేయఁబోతే ఇద్దరునుఁ గూచుండి

రతులకుఁ బెనఁగీనే రాజసానను

మితిమీరి మెచ్చితేను మేనరికములు చూపి

తతి నేకతములకు దగ్గరఁ దీసీనే

చ 3: తోడు గాచుకుండితేను తొడిఁబడఁ గాఁగిలించి

వేడుకఁ గూడెను శ్రీవేంకటేశుఁడు

పాడిపంతములతోడ పలుమారు నవ్వితేను

జాడల మమ్మిద్దరిని జంటలు సేసీనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1113-4 ముఖారి సం: 21-070

పల్లవి: నాతో నేమి చెప్పేవు నమ్మించిన విభుఁడవు

చేతికి లోనయి పంపుసేయవలెఁగాక

చ 1: చలముగల మగువ సాదించకేల మాను

అలిగినది దిట్టక అదేల మాను

పిలిపించుకొన్న యాపె బిగియక యేల మాను

చెలరేఁగి చనవెల్లాఁ జెల్లింతువుగాక

చ 2: కన్నులు గలిగినాపె కదుఁజూడకేల మాను

అన్నిటా మించిన దాఁగ కదేల మాను

చన్నులుగట్టైనయాపె చలపట్టకేల మాను

యిన్నిటా నాపెకు లోనై యెనతువుగాక

చ 3: కందువఁ గూడినయాపె కరఁగించకేల మాను

అందినాపె గో రంటించి కదేల మాను

ముందె శ్రీవేంకటేశ మొక్కక ఆపేల మాను

విందువలె మోవిచ్చ వెలతువుగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1113-5 వరాళి సం: 21-071

పల్లవి: తరుణి, నీతో వీఁడు తానేమనీనే

గెరసు దాఁటక మరి కిందుపడు టరుదా

చ 1: నేరుపే వలెఁగాని నెలఁతకు, విభుఁడు

యేరీతి నీవు చెప్పినట్టెల్లాఁ జేయఁడా

గారవించవలెఁగాని, కనుసన్నలనె వారి-

తీరుకు దిద్దుకు లోనై తిరమవు టరుగా

చ 2: అండ నుండవలెఁగాని ఆఁడుజాతికి; విభుఁడు

వుండనుండ యెందుకైనా వొడిఁగట్టడా

మెండుకోనవలెఁ గాని, మించి వారివలలకు

తండుమోఁడై చిక్కుకొని తలవంచు టరుదా

చ 3: చేయి చాఁచవలెఁగాని శ్రీవేంకటేశుఁడు, నాకు

పాయపురతులఁ గూడి పంతమియ్యఁడా

యీాయెడ నన్ను నేలె యింతేసి కావలెగాని

దాయిదండై నాపాలిదైవమౌటరుదా



www.annamayya.net


# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1113-6 ఆహిరి సం: 21-072

పల్లవి: ఆరమణి వుండఁగాను అంతేకాదా

బారలు చాఁచే వప్పటి పఇకొసరా నేను

చ 1: నీసతి వెంట వచ్చిననెలతఁనంటానా

ఆసపడి జాణతనాలాడేవు నీవు

సేసవెట్టి పెండ్లాడిన చెలియనుఁ గూడితివి

బాసయిచ్చి చెనకేవు పయికొసరా నేను

చ 2: నీ కాపెమాట చెప్పిననేస్తకతైనంటానా

కైకొన నాకు సన్నలు గావించేవు

లోకమెల్లా నెఱఁగఁగా లోనఁబెట్టుకొంటి వాపెఁ

బైకొని నాతో నవ్వేవు పఇకొసరా నేను

చ 3: ప్రియరాలి వొద్ది తోడఁబెండ్లి కూఁతురనంటానా

నయమై శ్రీవేంకటేశ నన్నుఁ గూడితి

దయతో నాపె నేలి మంతనమాడితి విందాఁకా

భయము దీర్చితి విట్టె పయికొసరా నేను





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1114-1 సౌరాష్ట్రం సం: 21-073**

**పల్లవి: మంచిదాయ దానికేమి మాటలు పోట్లయ్యీనా**

**పెంచి యెంతసేసినా నీపెద్దరిక మింతేకా**

**చ 1: మెల్లనే నే మాటాడితే మించి ఇందరితోడాను**

**తెల్లమిగా నాడేవు తిట్టితినంటా**

**బల్లిదుఁడ వౌదువయ్య పని ఇందే కానవచ్చె**

**కల్లలాడేవా నీవు కలుగఁగఁబోలును**

**చ 2: పూవులచెం డిచ్చితేను పూఁచి ఇందరితోడాను**

**వేవేలుగాఁ జెప్పేవు వేసితినంటా**

**దేవరవుగావా నీవు తెలిసె నిన్నియు మాకు**

**నీవల్ల నేరమున్నదా నిజము గాఁబోలును**

**చ 3: పాదాలు సేవసేసితే పై పై నిందరితోడాను**

**గోదానఁ జెప్పేవు బెట్టి గుద్దితినంటా**

**యీదెస శ్రీవేంకటేశ యెనసితి విఁక మీర**

**సాదవుగావా ఇవే చవులు గాఁబోలును**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1114-2 ఆరబి సం: 21-074

పల్లవి: ఆ పెఱఁగదా నీయంతరంగము

చూపి చూపి అంతేసి చొప్పులెత్తవలెనా

చ 1: సిగ్గువడ్డభావానకు చిఱునవ్వులే యెఱుక

యెగ్గులెంచనియందుకు ఇంపు లెఱక

వొగ్గినరతులకును వూరకుండుటే యెఱుక

అగ్గలమై విచ్చి విచ్చి ఆనతియ్యవలెనా

చ 2: చెప్పరాని మాటలకు చేసన్నలే యెఱుక

ముప్పిరివలపులకు మొక్కు లెఱుక

అప్పసమై ఆసలకు ఆయములంటు టెఱుక

అప్పటిని పేరుకొని ఆనతియ్యవలెనా

చ 3: చేతికి లోనైనందుకు చెలరేఁగుటే యెఱుక

కాతరముగలందులకు ఘాత లెఱుక

యేతులశ్రీవేంకటేశ ఇద్దరునుఁ గూడితిరి

ఆతలీతలిమాకెల్లా నానతియ్యవలెనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1114-3 గౌళ సం: 21-075

పల్లవి: ఎప్పుడయ్యా ఆమేలు యెఱిఁగే నేను

కొప్పు దువ్వి నిన్ను జేకొనదా యింకా

చ 1: కాలమెల్ల నాపె నీతో కన్నులారుచనే పట్టె

నాలి మాని కొఁత్తైనా నవ్వదా యింకా

వేలఁ జూపి మగఁడంటా విఱ్ఱవీఁగనే పట్టె

చేలకొంగు గప్పి బుద్ది చెప్పదా యింకా

చ 2: కొలువు సేయుచు నిన్నుఁ గూరిమి గొసరఁబట్టె

చలివాయ వలవులు చల్లదా యింకా

కలిమి మెఱసి నీకుఁ గానుక లియ్యనే పట్టె

ములువాఁడి కొనగోర మోపదా యింకా

చ 3: చనవు మెరసి నీకు చవులుచూపనె పట్టె

చెనకి రతుల సేవసేయదా యింకా

ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను

యెనసి మరీ నెలయించదా యింకా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1114-4 లలిత సం: 21-076

పల్లవి: నీ వొక్కటొక్కటే సేసి నెరసు లెంచేవుగాక

వోపలేని ఆపె మంచివోజదే కాదా

చ 1: చిప్పిలుమాఁట లాడఁగా సిగ్గులువడీఁగాక

కప్పి నీ కెప్పుడు నూడిగము సేయదా

దప్పికి మోవడుగఁగాఁ దలవంచుకోనిఁగాక

ముప్పిరి నిందాఁక నీమోము చూడదా

చ 2: పచ్చిగాం జెనకఁగా నప్పటి నొడ్డుకొనెఁగాక

కచ్చుపెట్టి నీపై బత్తి కలదే కాదా

రచ్చలోఁ బిలువఁగాను రమణి జంకించెఁగాక

యిచ్చకురాలు నీకు నెప్పుడుఁ గాదా

చ 3: చేయివట్టి తియ్యఁగాను చెక్కు నిన్ను నొత్తెఁగాక

ఆయాలు నీవెటిఁగిన ఆపె కాదా

యీయెడ శ్రీవేంకటేశ యెనసితి వింతలోనె

పాయరాని వేడుకలపాలిదే కాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1114-5 శ్రీరాగం సం: 21-077

పల్లవి: నమ్మఁగలవార మింతే నాకు నీవిచ్చినబాస

యిమ్ములఁ జెలుల నీకు యేమి చెప్పే రిఁకను

చ 1: నిలువెల్లా నిజమే నీవొళ్లిదే తగవు

తెలిసె నీగుణాలెల్ల తేటతెల్లమి

కలిగినసాజమే కల్లలాడేవా నీవు

బలువుఁడవు నీతోడి పంతములవారమా

చ 2: నీ వాడినదు మాఁట నెరసు నీయందు లేదు

దేవరవనేరు నిన్ను దేవుళ్లెల్లా

చేవదేరేనడకలు చెల్లు నీకు నన్నియును

వేవేలు వచ్చెను నీతో విరసాలవారమా

చ 3: నిన్నుఁ గాదన రెవ్వరు నీ వటువంటి వాడఁవా

విన్న కన్న వే నీవిద్యలెల్లాను

యిన్నిటా శ్రీవేంకటేశ యిదె నన్ను నేలితివి

మన్నించనేర్తువు నీతో మండాడేవారమా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1114-6 నాదనామక్రియ సం: 21-078

పల్లవి: నీకు నంకెవచ్చితే నీవు మానేవా

యేకడఁజూచినసరే యిద్దరికి నెపుడు

చ 1: పతుల మోహింపించేది పంతములు మెరసేది

సతుల కెప్పుడు నివి సహజములే

రతికిఁ బెనఁగుదురు రాకుండితే జంకింతురు

హితవై కైకొంటగాక యేలయ్య కోపము

చ 2: చలివాసి నవ్వేది సరసములాడేది

కలికికాంతలకుఁ గలగుణమే

పిలుతురు బిగుతురు ప్రియములు చెప్పుదురు

నెలకొని యిందుకుఁగా నీకేల చలము

చ 3: మొక్కి మొక్కి కూడేది మోవి గంటిసేసేది

చక్కనిసతుల కివి చందములే

యెక్కువ శ్రీవేంకటేశ యిటు నీవే కూడితివి

మక్కళించి మక్కళించి మఱి యాల కొసరు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1115-1 కాంబోది సం: 21-079

పల్లవి: ఏఁటికిఁ బాట్లఁ బడే వేమే నీవు

కూటసాక్షులకే నీవు గురియైతివో

చ 1: వొద్దనుం డాతనికిఁగా వొలపక్షమాడేవు

గద్దించేవు నీకుఁ గొంత గలదో పొందు

అద్దుక సన్నలుసేసి ఆతనిచే మొక్కించేవు

బుద్ధితో వలపులపొత్తు నీకు నబ్బెనో

చ 2: వూరకైనాఁ బతికిఁగా వొడఁబరచవచ్చేవు

నేరము లేమైనను నిన్ను సోఁకేనో

తీరిచి ఆనేరములు తిద్ది తిద్ది చెప్పేవు

పోరచితనాన నీకు పూఁటలంటెనో

చ 3: గక్కన శ్రీవేంకటేశుఁ గాఁగిలింపించేవు నన్ను

చక్కనిరతులు నీకుఁ జవిపుట్టేనో

చొక్కేవు ఆకుమడిచి సోఁక నీవు అందిచ్చి

నిక్కి నిక్కి సంతోసాలు నీమీఁద జారెనో



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1115-2 శ్రీరాగం సం: 21-080

పల్లవి: నావల నింతే శాయ నాథుఁడ నీవంకఁ గాదు

చేవలుదేరి తేరి చిగురాయను

చ 1: తెగనాడఁజాలక తేరి యిచ్చలాడఁగాను

పగటునీవోజలెల్లాఁ బలచనాయ

నగి నగి నీతోను నను పు నటించఁగాను

అగడై కరుకుపడె అదిగో నీచిత్తము

చ 2: వూరకే మొగమోట నొదిగి నే నుండఁగాను

కూరిమినవ్వులు పైకొసరాయను

నీరువంకతుంగవలె నిన్ను నిట్టె భోగించఁగా

సారపుతరితీపులు చప్పనాయను

చ 3: కందువకాఁగిట నిన్ను కడుదిద్దకుండఁగాను

విందుల వంటి నీరతులు వింతలాయను

అందపు శ్రీవేంకటేశ అంతలో నన్నుఁ గూడితి

ముందువెనకలెల్లాను ముదమాయను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1115-3 దేసాళం సం: 21-081

పల్లవి: ఇంతేసిమతకాలు నే నెఱఁగనివా

పొంతనుండి నవ్వేవు పొద్దువోదా నీకు

చ 1: తారుకాణ లంతేనేల తగవు నడపరాదా

గారాపునీవెఱఁగనికల్ల వున్నదా

కూరిమిసతులమూఁక కూరిచి తలవంచేవు

పోరులేల పెట్టేవు పొద్దువోదా నీకు

చ 2: వొడఁబరచఁగనేల వూరకే వుండఁగరాదా

తడవితిమా నీ వింతయు నేరవా

కడగడ లటు దొక్కి కమ్మి నన్ను వేఁడుకొంటాఁ

బుడికేవు నన్నునీవు పొద్దువోదా నీకు

చ 3: నివ్వెర గందఁగనేల నిచ్చలాన నుండరాదా

జవ్వనపునాచేఁత నీసలిగె కాదా

యివ్వల శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి

పువ్వులనేల వేసేవు పొద్దువోదా నీకు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1115-4 సామంతం సం: 21-082

పల్లవి: ఎందరు లేరు నీకు నెగసక్యాలు సేయఁగ

మందలిఁచే ఆడనుండే మన్నించవయ్యా

చ 1: మొక్కలపుచేఁతలకు మొదలివాఁడవు నీవు

తక్కరివిద్యలకెల్లా దాఁపిరమవు

నెక్కొని చయ్యాటాలకు నేమా నీకు నెదురు

మక్కళించి మొక్కేము మన్నించవయ్యా

చ 2: తీపులు వుట్టించి పొంద దేవర విన్నిటాను

రాఁపుచేసి నవ్వు నవ్వ రాజవు నీవు

యీపనులకెల్లా నీతో నియ్యకొనఁగలమా

మాపు రేపు సేవసేసే మన్నించవయ్యా

చ 3: వట్టివలపులు రేఁచ వగకాఁడ వన్నిటాను

పట్టినచలములకు బలువాఁడవు

ఇట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు

మట్టులేనివేసాలేల మన్నించవయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1115-5 లలిత సం: 21-083

పల్లవి: నీవే ఇంత సేయఁగాను నేఁ డిదిగో బాలకృష్ణ

వావులు యెవ్వరికైనా వాడలోన నున్నవా

చ 1: చలివాసె గొల్లెతలు సారె నిన్ను నెత్తుకోఁగా

వొలుగులువారె మోహ మూఁచి పాడఁగా

పలుకులకొంకు దీరె పక్కన నిన్నుఁ దిట్టఁగా

బలుమొగలకు నాండ్లు పంపుసేతురా

చ 2: వింత దేరెఁ గొమరెలు వీదుల నిన్నాడించఁగా

సంతలాయ నిండ్లు నీసంగాతాలను

జంతలైరి లోలోనే సారె నిన్ను ముద్దాడఁగా

కొంతయినా నత్తలకు కోటరాలు సేతురా

చ 3: సిగ్గెడలెఁ గన్నెలు నీచెలుములు సేయఁగాను

నిగ్గులఁ గళలు మించె నీతో నవ్వఁగా

అగ్గమై శ్రీవేంకటాద్రి నందరినిఁ గూడితివి

వొగ్గి చుట్టాలలోనెల్లా వోజలు నేరుతురా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1115-6 గౌళ సం: 21-084

పల్లవి: ఆతఁడే నన్నందుకుఁగా అట్టె కూరిమి గొసరీ

యీతలనాతల నీవే యెడమాఁట లాడేవా

చ 1: మాట మాటగా విభుని మంతనాన నాడుకొంటే

చీటికిమాటికిఁ బోయి చెప్పుదురటే

నీటున నాతనికి నే నీవంటిదాననేకానా

యేఁటికే నీవొకతెవే యితవరివటవే

చ 2: అక్కవంటా నీతో నాతనిగుట్టు చెప్పితే

కక్కసించి నీవు తారుకాణింతురా

చక్కనిఇద్దరము సరివారమే కామా

వెక్కసాన నాకంటె విశ్వాసివా

చ 3: నిగ్గులశ్రీవేంకటేశునేరుపు నీతో మెచ్చితే

సిగ్గువడ నెఱుకలు సేసుకొందురా

అగ్గమై నిన్నుఁ గూడినట్టె నన్నుఁ గూడితేను

వెగ్గళించేవు నీవంటివేడుకే నాకును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1116-1 అమరసింధు సం: 21-085

పల్లవి: చలువకు వేఁడికి సంగతయ్యీనా

నెలఁతలఁ గంటే నిట్టే నీ వేమి సేతువు

చ 1: పెక్కుమారులు నేనైతే ప్రియములు చెప్పఁగాను

పక్కన నీవాడేవు పాడిపంతాలు

వక్కణతో వేఁడుకొనేవారిఁ గంటే బిగుతురు

నిక్కినవారిసాజాలు నీ వేమి సేతువు

చ 2: ననువుగా నే నీతో నవ్వు లిట్టే నవ్వఁగాను

చనవిచ్చి నీవైతే జంకింతువు

వొనరినవారిఁ గంటే వొత్తుకొత్తుక వత్తురు

నినుపై లోకులజాడే నీ వేమిసేతువు

చ 3: కందువ నే నిన్నుఁ గూడి కాఁగిలించుకోఁగాను

చెంది నీవు మోవి గంటిసేయఁజూచేవు

ముందే శ్రీవేంకటేశ్వర మొక్కితే దీవింతురు

నిందలేని వారినేర్పు నీ వేమి సేతువు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1116-2 వరాళి సం: 21-086

పల్లవి: కూచుండవే ఇంకా వట్టిగట్టు లేఁటికి

వాచవులు మరిగిన వలపులు మానీనా

చ 1: చనుఁగవ గప్పకువే సకియా మన-

మనసులలోనికి మఱఁగున్నదా

తనిసి నీనవ్వేల దాఁచేవే

కనుగొన నెమ్మోముకళలు దాగీనా

చ 2: మాటలేల మొఱఁగేవే మగువా మన-

మూఁటల ఆసలలోన మొఱఁగున్నదా

చీటికిమాఁటికి నేల చేయి దీసేవే

కూటపురతిఁ జేయి దీసుకొనవచ్చునటవే

చ 3: కూడితివేల నించేవే గుఱుతులు మన-

కోడె వయసులకును గుఱియున్నదా

యీడుగల శ్రీవేంకటేశుఁడఁ గదే

యీడుజోడు మనకంటే నింక మఱి వున్నదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1116-3 మాళవిగౌళ సం: 21-087

పల్లవి: ఇంతులు నీకు బాతా యెంతసేసేవు

దొంతిఁబెట్టెవు ప్రియము దొడ్డికట్టుదాననా

చ 1: నెట్టుకొన్నలకిమమ్మ నీవురము పై నుండఁగా

పట్టేవు మాచన్నులు పై కొసరా

అట్టడితనాన మీఱక నీతో రానన్నాను

పెట్టేవు నీసొమ్మెల్లా పెట్టెవంటిదాననా

చ 2: చింతదీరఁ దొళశమ్మ శిరసుపై నుండఁగాను

వంతుకు నన్నలమేవు వడ్డిబేరమా

వింతలుగా నిన్నంత వేసరించఁజాలనన్నా

పంతానఁ దమ్మ వెట్టేవు పడిగెపుదాననా

చ 3: బూమిదేవులమ్మ నీబుజముపై నుండఁగాను

వేమారు నాతో నవ్వేవు వింతొకచవే

ఆమని శ్రీవేంకటేశ ఆయాలు సోఁకీనన్నా

కామించి కూడితివి నీకాఁపురపుదాననా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1116-4 రామక్రియ సం: 21-088

పల్లవి: ఎదిరి నెఱఁగవు నీయితవే చూచేవుగాని

యెదఁబెట్టున్నారము యేము నేము నేము

చ 1: గడుసునిన్నుఁ జూచితే కాఁకరేఁగీ నాకైతే

నడుమ నీవూరకే నవ్వేవు గాని

వుడికినందుమీఁదట వుప్పలు చల్లినట్టాయ

యెడనెడ నీచేఁతల కేమనేము నేము

చ 2: కుచ్చితపునిన్నుఁ జేరుకొనఁ గొలుపదు నాకు

అచ్చువలె నీవు మాటలాడేవుగాని

ముచ్చటదీర నీవేళ మోము గప్పినట్లాయ

హెచ్చిననీసుద్దులకు నేమనేము నేము

చ 3: దిమ్మరిని న్నంటుకొన సమ్మతించదు నాకైతే

లెమ్మని నీవే కాఁగిలించేవుగాని

చిమ్ముచు శ్రీవేంకటేశ చేఁదే తీపైనట్లాయ

యెమ్మెలనీమన్ననకు యేమనేము నేము



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1116-5 గుజ్జరి సం: 21-089

పల్లవి: ఎక్కి నంతలోననే యేనిగ గుజ్జా

అక్కరై మాయింటికి రాకాతఁ డట్టె వుండీనా

చ 1: ఆతనిచనవు వట్టు కట్టె విఱ్ఱవీఁగేవు

యేతులకు వాఁడికత్తులేల మింగేవే

కాతరాన నీకింత కపటాలు నెరపితే

ఆతల నీకేకాక అండవారి కేమే

చ 2: రమణుఁడు నవ్వేనంటా రవ్వశాయ వచ్చేవు

తిమిరి యిసుక మీఁదై తిరుగకువే

భ్రమసి నీకాతఁడు బాస లెంత ఇచ్చినాను

అమర బతుకవే నే మాండ్లము గామా

చ 3: శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జెందెనని మెరసేవు

దోవఁ బెసరు విత్తితే తుదకెక్కీనా

కావరిం చాతనిమేను కాఁగిటఁ జిక్కితే

యీవల మారతిఁ దొల్లి టెంగిలేకదే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1116-6 తెలుఁగుఁగాంబోది సం: 21-090

పల్లవి: చాలునయ్య వేయిటిపై జవ్వాదికొమ్ము

యేలిననీపై నుండనియ్యవయ్యా మాట

చ 1: కూరిమి చూపి నిన్నుఁ గొసరఁగఁ గొసరఁగ

యేరీతి నుండునో చిత్త మేవేళను

బీరపువారము నేము బిరుదువాఁడవు నీవు

తారుకాణించఁగఁబోతే దైలువారుఁ గోపము

చ 2: ప్రేమతోడుత నిన్నుఁ బిలువఁగఁ బిలువఁగ

యేమని వేసరుదువో యేవేళను

నేమపువారము నేము నీయిచ్చవాఁడవు నీవు

చేముట్టి పెనఁగఁబోతే చిమ్మిరేఁగుఁ జలము

చ 3: తతిగొని నిన్ను రతిఁ దగులఁగఁ దగులఁగ

యితవై వుండునో కాదో యేవేళను

సతి నేను శ్రీవేంకటపతివి నాకు నీవు

సతమై యిట్టె కూడితే చక్కనౌను పనులు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1117-1 హిందోళం సం: 21-091

పల్లవి: పెద్దలు మీ రంతేసి పెనఁగనేల

వుద్దండపునీచేతలు వుట్టిఁబెట్టవయ్యా

చ 1: మోవిపండు గానుకిచ్చె మొక్కె నీకుఁ జేతులను

సేవ లింకానేమి యాపె సేసునయ్యా

కావిలించి దగ్గరితే కాలు దాఁకుఁ జేయి దాఁకు

దేవరవంటినీ కంతేసి తగదయ్యా

చ 2: గోరంటపూ వందిఇచ్చె కొలువున నిలుచుండె

పేరి యిచ్చకము లేమి పెంచునయ్యా

వేరెమాట లాడఁబోతే వెంగెమౌనో వెగటౌనో

ఆరీతి దొరవు నీ కవి చెల్లవయ్యా

చ 3: ఆరతిచ్చె నానాంగల నన్నిటికి సమ్మతించె

కూరిమి నిన్నెట్లాను కొసరునయ్యా

యీరీతి శ్రీవేంకటేశ యింపు లేదో సొంపు లేదో

ఆరితేరినట్టినీకు ఆస మానదయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1117-2 హిజ్జిజి సం: 21-092

పల్లవి: మాపుదాఁకా రేపకాడ మాటకు మాటాడఁగాను

యేపునఁ దెగనిపనికేల పెట్టే వాన

చ 1: నవ్వి నవ్వి మానేవు నడుమ నడుమ నీవు

జవ్వని యెవ్వతేమైనా సన్న సేసెనా

వువ్విళ్లూర నీనిజము వొరసి చూచే నింతే

యెవ్వరిందుకు గురయ్యే రేల పెట్టే వాన

చ 2: చెప్పి చెప్పి కొంకేవు సిగ్గులువడుతా నీవు

వుప్పటించ నీడ నెవ్వరున్నారు నీకు

రెప్పలెత్తి చూచి నిన్ను రేఁచి వెదకే నింతే

యెప్పటివాఁడవే నీవు యేల పెట్టే వాన

చ 3: ముట్టి ముట్టి చూచేవు మొరఁగి నాకుచములు

యిట్టె యెవ్వతెవైనా యీడువచ్చెనా

నెట్టన శ్రీవేంకటేశ నిరతి మెచ్చితి నింతే

యెట్టకేల కైనపనికేల పెట్టే వాన



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1117-3 రామక్రియ సం: 21-093

పల్లవి: భామలతోఁ బోరఁగాను ఫలమేమి నీకు వచ్చె

యేమిటికిఁ గాతరించే వింతలోనే నీవు

చ 1: సిగ్గులే మూలధనము చెలులకెల్లా నీవు

బగ్గననేల పట్టేవు పయ్యదకొంగు

నిగ్గులమోనములే నిఁడురాజ్యపదవులు

అగ్గలమై యాల మాటలాడిచేవు నీవు

చ 2: పంతమే పెట్టనికోట పడఁతుల కెల్లాను

వంతుకునేల తీసేవు వారియిండ్లకు

చెంతల గుట్టునవ్వులే సేయనిసింగారాలు

చెంతనుండి యేల గరిసించేవు నీవు

చ 3: చలమే ముందరిపాఁజు సతులకునెల్లాను

చెలఁగి యేల ప్రియముచెప్పేవు నీవు

బలిమి శ్రీవేంకటేశ బాసయిచ్చి కూడితివి

పెలుచుఁగుచములేల పిసికేవు నీవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1117-4 సామంతం సం: 21-094

పల్లవి: ఏకటాన నీవు నీవూ నెరిగినపను లివి

యీకడ మాతోనేల యెరుక సేసేవు

చ 1: ప్రేమమున నాపె నిన్నుఁ బేరుకొని తిట్టితేను

నామోము చూచి యేల నవ్వేవు నీవు

చేముంచి యాపె నిన్నుఁ జెనకి పైకొంటేను

దీమసాన నేఁటి కానతిచ్చేవు నీవు

చ 2: చనవున నాపె నిన్ను సారెకు జంకించితేను

పెనఁగి సాకిరి యేల పెట్టేవు నన్ను

మనసిచ్చి యాపె నీతో మందటలాడితేను

చొనిపి నన్నేల నీవు చుట్టుకొనేవు

చ 3: గారవించి యాపె నిన్నుఁ గాఁగిలించుకొంటేను

చేరి నే నుందాననంటా సిగ్గువడేవు

యీరీతి శ్రీవేంకటేశ యీపె నిన్నుఁ గూడె నేఁడు

మీరతులు నాతోనేల మెచ్చవచ్చేవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1117-5 సాళంగం సం: 21-095

పల్లవి: అందరిని యీమాఁటే అడుగవయ్యా

కందువలు నీకునీకే కానరాదుగానీ

చ 1: వనిత యిప్పుడే నీవద్దికి రాఁగానే

మనసు నీ కొక్కటాయ మాఁటలేఁటికి

చెనకి నే మిందాఁకాఁ జేసినచేఁతలకెల్లా

వొనరి యిటువలెనే వుండుగా నీమొగము

చ 2: చాఁచి చాఁచి నీ కాపె సారె విడెమియ్యఁగానే

పూఁచినపూఁవు లీడేరె బొంకులేఁటికి

తూఁచి వలపు నేమెల్లా తోడగడ్డెము వేయఁగా

పాఁచి సంతోసాలిట్లాఁ బ్రబలెనా నీకు

చ 3: గక్కన నీదేవు లిట్టె కాఁగిలించుకొనఁగానే

చక్కనాయఁ బనులెల్లా సటలేఁటికి

యిక్కువ శ్రీవేంకటేశ యిద్దరూఁ గూడఁగాఁగాక

చిక్కనినవ్వు లిట్లాఁ జేకూడెనా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1117-6 శంకరాభరణం సం: 21-096

పల్లవి: ఇద్దరును గూడితిరి యిక నెన్నఁడు

సుద్దుల మామొగమేమి చూచేరయ్యా

చ 1: సతి చెమటకాఁగిలే చక్కనికేళాకూళి

యితవైనవలపులే యీఁతా మోఁతా

మతకరిసిగ్గులే మంచినీటిచల్లులాట

తతిగొని మీరు వంసతములాడరయ్యా

చ 2: చెలిగోరిచెనుకులే చిమ్మనఁగోవిచిమ్ములు

కులుకునవ్వులే తలకొన్న తెప్పలు

పిలుపులమాఁటలే పెట్టినట్టివొాలలు

కిలకిల నవ్వి జలకేలి సేయరయ్యా

చ 3: ముగుడచన్నులు తమ్మి మొగ్గలవేట్లు నీకు

తగినకూటములే పంతపుముంపులు

అగడై శ్రీవేంకటేశ ఆయాలంటి కూడితిరి

నిగిడిన పెండ్లితోడ నీళ్లాడరయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1118-1 నాగవరాళి సం: 21-097

పల్లవి: చెల్లదా ఆతనికేమి సేసినంతాను

వెల్లవిరైనపనికి వెంగె మింత వలెనా

చ 1: నగనేలె నీకును నాయ మాతఁడు చెప్పితే

తగవులో నేమైనాఁ దప్పులుండెనా

మగువ లబ్బితేఁజాలు మానలేఁ డింతేకాక

పొగరుఁబదారువేలపూఁతకోక గాఁడా

చ 2: తప్పక చూడనేలే తానే సాకిరి చెప్పఁగా

అప్పటి నొలపక్షము లందుండెనా

కప్పురగందులెడల కక్కూరితిపడుఁగాక

కప్పి గొల్లెతలరొంపికంబము దాఁ గాఁడా

చ 3: వెరవుతో నిన్నును శ్రీవేంకటేశుఁడు గూడఁగా

సరవు లందేమైనాఁ జాలకుండెనా

తరుణులైతేఁజాలు తగులు మానఁగలేఁడు

ఇరవై మధురలోఁ బెక్కిండ్లవిందు గాఁడా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1118-2 పాడి సం: 21-098

పల్లవి: మఱి ఇంతేకదవయ్య మనలో మాట

తఱితో సరివచ్చె మీతగవులు చూచి

చ 1: కలసెఁగా ఆపె నిన్ను కాఁగిటిరతులనెల్లా

తెలిసెఁగా నీమహిమ తెల్లమిగాను

వలసలినట్లనయ్యా వారివారి భాగ్యాలు

చలివాసె మాకైతే మీసరితలు చూచి

చ 2: మెచ్చెగా ఆపె నీమేలము లన్నిటికిని

యిచ్చితివిగా చనవు యిందరిలోన

విచ్చనవిడాయ నిఁక వెలఁదులవలపులు

ముచ్చట వాసె మాను నీ మోహములు చూచి

చ 3: పండెఁగా ఆపెతపము పక్కన నీకూటమిని

నిండెఁగా సంతోసాలు నీమతిలోన

అండగా శ్రీవేంకటేశ అందరి కివే చాళ్లు

దండేయ మాకు మీలోనితరితీపు చూచి




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1118-3 బౌళి సం: 21-099

పల్లవి: ఒక్కమనసున నీవొద్ద నిట్టె వున్నారము

నిక్కెము మాసేవలెల్లా నీమీఁద నుండఁగా

చ 1: తత్తరము నేమిటికి తాలిమీ నేమిటికి

హత్తిన కూరిమిగలఆఁడువారికి

బత్తి చెప్పుకోనేల పాసి కోపగించనేల

నిత్తెమై మాభారమెల్లా నీమీఁద నుండఁగా

చ 2: చేరి పైకొన నేఁటికి సిగ్గువడనేమిటికి

వూరకే యిచ్చకురాండ్లై వుండేవారికి

కోరి కొంగువట్టనేల కొంచి కొంచి అలయనేల

నేరుపులమాచేఁతలు నీమీఁద నుండఁగా

చ 3: మెచ్చుమెచ్చ నేమిటికి మేలమాడ నేమిటికి

హెచ్చి నిన్నుఁ గూడినట్టి ఇంటివారికి

రచ్చలశ్రీవేంకటేశ రంతులేల రాఁపులేల

నిచ్చ నీవిచ్చనబాస నీమీఁద నుండఁగా





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1118-4 సాళంగనాట సం: 21-100

పల్లవి: ఎక్కడ నున్నా నీకు నేమాయను

పక్కన నవే యిందు భావించుకోవయ్యా

చ 1: అతివలుండినచోటు అదె నీకు రేపల్లె

అతిశయపువలపు యమునానది

రతులకాఁగిళ్లే రాసక్రీడలు నీకు

తతి వచ్చె నిందు నవి తలఁచుకోవయ్యా

చ 2: కొమ్మలపోఁకముడులు కొలనిదరికోకలు

కుమ్మరించు మోవితేనె గొల్లదోమటి

పమ్మి వారితో నవ్వులు పాలుఁబెరుగువుట్లు

తమ్మిచూపులే రేతిరి తలఁచుకోవయ్యా

చ 3: చెలులజవ్వనమెల్లా చేరువబృందావనము

కులుకుఁజన్నులు పెక్కుగోవర్ధనాలు

కలసితి మాచెలిని గక్కన శ్రీవేంకటేశ

తలఁపున నిఁకనిన్నీఁ దలఁచుకోవయ్యా





# అన్నమయ్య



# సంకీర్తనలు



**శృ.రేకు: 1118-5 ముఖారి సం: 21-101**

**పల్లవి: చవి చార మెఱఁగవా జాణనందువు**

**యివి యెల్ల నాపెకు నీవిచ్చినచనవులే**

**చ 1: చెప్పరాని మాటలకు చెవులొగ్గే వేమయ్య**

**వొప్పులెల్లా చెలినగవుల నున్నవి**

**కప్పురపునోఁటిమాఁట కమ్మి బరణిఁ బెట్టేవు**

**యెప్పు డాపె యేమనిన నేమాయ నీకు**

**చ 2: సేయరాని చేఁతలకు సిగ్గవడే వేమయ్య**

**తోయరాదు అంగనచేతుల నున్నవి**

**పాయపుఁగళలకును బారలు చాఁచేవు నీవు**

**యీయెడ నేమిసేసిన నేమాయ నీకు**

**చ 3: పట్టరాని వయసులు పచ్చిసేసే వేమయ్యా**

**నెట్టనఁ గాఁగిట నింతి నిన్నుఁ గూడెను**

**ముట్టితే శ్రీవేంకటేశ మోవితేనెఁ గొలిచేవు**

**యిట్టివి; మీసరసాల కేమాయ నీకు**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1118-6 సౌరాష్ట్రం సం: 21-102

పల్లవి: ఏమనేము నిన్ను నిఁక నింతా మేలే
వేమారుఁ జవిగొంటేను వేమే తీపు

చ 1: యెమ్మెలకు నిజమేది యెడమాట గురియేది
ముమ్మారు నూఁకొంటే ములుకే వంగ
సమ్మతించుకొంటి నేను చనవిచ్చితివి నీవు
పమ్మి పేరఁబెట్టితేను పాలే పెరుగు

చ 2: ఆసలకుఁ దనివేది ఆనలకు మితియేది
వేసర కడుగిడితే వెనకే ముందు
సేసవెట్టితిని నేను చేతికి లోనైతివి
చేసూటి ముదిరితేను చిగురే చేఁగ

చ 3: కూటమికి అడ్డమేది కొసరులకు లెక్కేది
గాఁటమై గోర గీరితే కాలువే యేరు
యీటువెట్టి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
నీటునఁ దెలుసుకొంటే నీవే నేను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1119-1 రీతిగౌళ సం: 21-103

పల్లవి: విచ్చి చెప్పరాదు వింతలు యీభావాలు

రచ్చలకెక్కెను అంత రవ్వసేయనేఁటికి

చ 1: వలపులలోనివే వడిగొన్న యాసలెల్ల

సెలవులలోనివే సిగ్గులేల్లాను

పిలుపులలోనివే ప్రియములుగలవెల్లా

కులికి కులికి యేలే కొసరేవు వతిని

చ 2: చనవులలోనివే సరసములెల్లాను

నసుపులలోనివే నయములెల్లా

మనసులలోనివే మచ్చికలుగలవెల్లా

వొనర నింకానేలే వొరసేవు పతిని

చ 3: నమ్మికలలోనివే నానాఁటివొడఁబాటు

వుమ్మడివయసులోనే వొద్దికలెల్లా

నెమ్మదిఁ గూడె నతఁడు నిన్ను నట్టె బుజ్జగించి

చిమ్మకువే గోళ్లను శ్రీవేంకటపతిని





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1119-2 గుండక్రియ సం: 21-104

పల్లవి: నేరుపరి వౌదువే నెలఁత నీ విన్నిటాను

యీరీతుల రమణుని నెంత సేసేవే

చ 1: పనిలేనిమాటలను బయలు పందిలివెట్టి

మనసేమి సోదించేవే మగనిని

తవివోనిచూపులను తగులువిరులు వేసి

యెనసి పందేలాడేది యెందాఁకనే

చ 2: వాడికనవ్వులు చల్లి వలపువలువ దీసి

యేడదాఁకా మోసపుచ్చే వింత యేఁటికే

కోడెవయసుగరిడీఁ గొంకుదీర సాముసేసి

మేడెపురతుల నెంత మీరేవే యిపుడు

చ 3: వాములైన ప్రియములవడగండ్ల గుళ్లు గట్టి

గోమున శ్రీవేంకటేశుఁ గూడితి వవునే

దోమటి చేఁతలనే దొమ్మిసేసి మొక్కులాడి

దీములొడ్డి వేఁటలాడి తిరమైతివే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1119-3 సౌరాష్ట్రం సం: 21-105

పల్లవి: ఇంతటి మీఁదటిపను లెఱఁగమయ్యా
సంతకూటములే కడుఁజవులాయనయ్యా

చ 1: వొడఁబాటుమాటలు వుప్పనౌనో చప్పనౌనో
వెడఁగునీమాటలు వినేమయ్యా
తడఁబడి నీసుద్దులు దైలువారిఁ జెవులను
అడఁచరాని నవ్వులు అగ్గువాయనయ్యా

చ 2: సంగడి మాచెనకులు చల్లనవునో వేఁడౌనో
వుంగిటినీచెనకులు కోరిచేమయ్యా
చెంగటినీనేరుపులు చిత్తములోఁ బేరుకొనె
కుంగనినివ్వెరగులు కోటికొండలయ్యా

చ 3: మచ్చికమావూడిగాలు మఱపౌనో తలఁపౌనో
కుచ్చి నీమన్నన లియ్యకొనెమయ్యా
తచ్చి శ్రీవేంకటేశ్వర తగ నన్నుఁ యఁ గూడితివి
లచ్చన నీగుఱుతులు లాగవేగాలయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1119-4 పాడి సం: 21-106

పల్లవి: ఏఁటి మాట లాడీనే యెందాఁకా వీఁడు

నటున నేఁ దన కంత నేరుపేటిదాననా

చ 1: కలయనికాఁకలను కడునెంత పొరలినా

వలపు వెంచవచ్చునా వనితలకు

నిలువునఁ దమకము నిండుక యెంతవుండినా

వెలినున్నసిగ్గులెల్లా విడువఁగవచ్చునా

చ 2: రాయడిపడక యంతరాణివాసమై వుండినా

పాయము దాఁచవచ్చునా పడఁతులకు

యేయడఁ దనకు వాసు లెంతగలిగివుండినా

కాయముపైఁ గళలెల్లాఁ గప్పఁగవచ్చునా

చ 3: అనిశము మీఁద మీఁద నతి రాజసమై వుండినా

మనసీకుండవచ్చునా మగువలకు

యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేఁడు

వెనకముందులు మరి వేరే యెంచవచ్చునా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1119-5 లలిత సం: 21-107

పల్లవి: కొమ్మలకు మనోభావకుఁ డందురు

సమ్మతించ మాకు దిష్టము చూపరాదా

చ 1: మగువ కోరికలనే మనసునఁ బాలు దాగె

జిగి నీవెన్నేని లెక్కచెప్పవయ్యా

నగవులకప్పురము నంటున బేరాలాడె

వెగటులేక నీవు వెల దీర్చరాదా

చ 2: జలజాక్షి జవ్వనము చన్నులఁ గుప్పలు వోసె

యెలమిఁ గోరుపా లందునేమయ్యా

కలికి కన్నులనే కలువలఁ బూజసేసె

ఫల మెంత ఇచ్చేవు పచరించరాదా

చ 3: మానిని సిగ్గులనే మర్మములు నిన్నడిగి

ఆనతిచ్చి మెచ్చులు నీవందవయ్యా

పూనిక శ్రీవేంకటేశ పొందులు మీకిట్టె అబ్బె

తేనెలమోవిమఱపు తెలియఁగరాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1119-6 మాళవిశ్రీ సం: 21-108

పల్లవి: కోరినట్టె వున్నవారు కొమ్మలు ముయ్యాడువారు

గారవపుగొల్లజాతి కలిగెఁగా నీ కిందుకే

చ 1: మెరవడికతైలైన మెలుఁతలే నీకు బాఁతి

కరకరిఁబెట్టేటి కాంతలే బాఁతి

సరి నిన్నుఁబనిగొనేజారకాంతలే బాఁతి

గరిమ రేపల్లెనుఁ గలరుగా యిందుకే

చ 2: జిడ్డువలె నంటుకొనేచెలులే నీకుఁ బ్రియము

వొడ్డారపుసతులే నీకొగిఁ బ్రియము

యెడ్డతనపుమాటల ఇంతులే నీకుఁ బ్రియము

దొడ్డిమంద లిందుకే దొరకెఁగా నీకును

చ 3: తామే తేరకువచ్చినతరుణులు నీకు నింపు

కామించి సిగ్గులేని కాంత లింపు

యీమేర శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి

ఆమని రాసక్రీడ లబ్బెఁగా నీకును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1120-1 కేదారగౌళ సం: 21-109

పల్లవి: మాపుదాఁకానేల జోలి మంచివాఁడవే నీవు

రాఁపుసేయకుండరాదా రామ గలసీని

చ 1: నేరుపుల కెంతలేదు నీవు మాటాలాడేనంటే

మారుకొని వూఁకొనఁగ మాతరములా

మేరతోడివాఁడ వౌదు మెచ్చితిమి నిన్నుఁ దొల్లె

రారాదా యెందాఁక రమణి దిట్టీని

చ 2: ననుపులకుఁ గడమా నవ్వు నీవు నవ్వేనంటే

ఘనము మరి పెంచఁగలమా నేము

ఘనుఁడవు నీ వౌదువు కడమ నీయం దెంచము

యెనయరాదా ఇంతి యెగ్గులువట్టీని

చ 3: వేడుకలకు వెలితా వియ్యములందేనంటే

జాడతోడఁ గొసరేమా సారెకు నేము

కూడితివి వనితలను గొబ్బున శ్రీవేంకటేశ

తోడనే మోవియ్యరాదా తొయ్యలి వేఁడీని





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1120-2 బౌళి సం: 21-110

పల్లవి: అందరిముందరా నింతఆగడాలు సేతురా
విందువంటినీరాకకు వేసరుకొనేనా

చ 1: పెనఁగ నీతో నంత పెద్దరికమా నాకు
చెనకితే చెలులకు సిగ్గులు రావా
పనిమాలినపని బలుములు సేతురా
ఘనుఁడ యేకతమైతేఁ గాదనేనా

చ 2: బిగియ నీతో నాకు బిరుదులపంతమా
మగువలు నవ్వితేను మాటకు రారా
తగవెంచి చూచుకోక తమకింతురా నీవు
మొగము చూచితే నీకు మొక్కకుంటినా

చ 3: జంకించ నీయెడకు సారె సారె సూడుఁ బాడా
మంకు గలిగించితే మారుకొనరా
అంకెల శ్రీవేంకటేశ ఆయమంటి కూడితివి
సుంకులనీరతులకు చొక్కకుంటినా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1120-3 తోండి సం: 21-111

పల్లవి: ఇదియే వేళవచ్చె నెచ్చరించితిమి నీకు

వుదుటుఁగోపానవేల వూరకున్న దానవే

చ 1: వన్నెలెల్లా నీసొమ్ము వాసులెల్లా నీఇరవు

సన్నలు సేయఁజెల్లుసే సరసునితో

చన్నులు నీకు గొప్పలు చనవు నీకే కలదు

యెన్ని సేఁతలు చేసినా యియ్యకోలే పతికి

చ 2: చక్కఁదనము నీరూపు జవ్వనము నీకు దాపు

అక్కరతో నవ్వఁజెల్లు నన్నిటా నేఁడు

చిక్కనిమాటలు నీవి చిమ్ముఁజూపు నీధనము

ఇక్కువ లెంతంటినాను ఇయ్యకోలె పతికి

చ 3: పంతమే నీకు గుణము భావమే నీకు బలువు

చెంతల శ్రీవేంకటేశు సేవ సేయవే

యింతలో నాతఁడే నిన్ను నెనసె నీవు జాణవు

యెంతకెంత చొక్కించినాను యియ్యకోలే పతికి



 # అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1120-4 సాళంగం సం: 21-112

పల్లవి: బలిమిసేయఁగఁబోతే పాటివట్ట రెవ్వరును

తలఁపు సరివచ్చితే దగ్గరి రారాదా

చ 1: నను పందరికి సరే నాకు నీకే పాలు గాదు

మనసు లెనసి మరి మరఁగేఁటికి

అనుమానము గలిగితే నందరి నడుగవయ్య

వనితలమాట విని వద్దికి రావయ్యా

చ 2: తమి యిందరికిఁ గద్దు తగ మనలోనే రాదు

అమరఁ బైకొని మరి అడ్డమేఁటికి

భ్రమసితేఁగన వద్దిపడఁతుల విచారించు

క్రమమై వుంటేఁగాన పొంకానకు రావయ్యా

చ 3: కూట మిందరికిఁ గద్దు గురుతు ఇద్దరికే కాదు

వాఁటముఁగా గలసియు వరుసేఁటికి

గాఁటపు శ్రీవేంకటేశ కాంతలకు సమ్మతమే

యీటుదొరశుండితేను ఇంకా రావయ్యా





# అన్నమయ్య సంకీర్తనలు





శృ.రేకు: 1120-5 గౌళ సం: 21-113

పల్లవి: ఏమందుము నే మిందుకు యెదురుమాట

ఆమతకమెల్లా నాకు నానతియ్యవయ్యా

చ 1: వొకమాట మీదఁబెట్టి వొకమాట లాడేవు

వెకలివై కొంతగొంత వేరే నవ్వేవు

మొకము చూచితేనే మోహములు చల్లేవు

యెకసక్కేలో నిజమో యెఱఁగరాదయ్యా

చ 2: కొంత పరాకులుసేసి కొంగువట్టి తీసేవు

చెంతల దగ్గరి నీవే సిగ్గువడేవు

దొంతిఁ బెట్టి వలపులు దోమట్లు దొడికేవు

పంతానకో భక్తి గద్దో భావించరాదయ్యా

చ 3: నయగారములు చూపి నన్ను నిట్టే కూడేవు

ప్రియములు చెప్పి రతిఁ బెదరేఁచేవు

నియతి శ్రీవేంకటేశ నీవే నన్ను మెచ్చేవు

దయనో తరితీపులకో తలఁచరాదయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1120-6 సావేరి సం: 21-114

పల్లవి: ఇంతే నేమెఱుఁగుదు మిద్దరికి సాకిరి

చెంతల మీకే తెలుసు చిత్తములో సుద్దులు

చ 1: సింగారపుఁ గొప్పు వంగి చిమ్మిరేఁగెఁ దమకము

సంగతిగా నీవు చేయి చాఁచఁ◌ఁగాను

వుంగిటిగొని చెక్కుల నుమ్మగిలె బులకలు

చుంగుల కొనగోళ్లు సోఁకఁగాను

చ 2: కప్పురపుమోవి వాడి కసరెత్తెఁ దేనెలు

దప్పిదేర మాటలాడి తగులఁగాను

కుప్పళించఁ జెమరించి గురిగాఁడెఁ జూపులు

వొప్పుగ నొకరొకరు వొకచోనే వుండగా

చ 3: జవ్వనపుమే నుబ్బి చలిదీరె సిగ్గులు

రవ్వలుగాఁ గూడఁగాను దతివేళను

యివ్వల శ్రీవేంకటేశ యింతిరో మీ రెనయఁగా

నవ్వులు మామోములను ననిచీ మీయెదుట



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1121-1 ఆహిరి సం: 21-115

పల్లవి: నీ వెందరికి నౌదువు నీపాపము

వావులఁ గూడవేయఁగా వాములాయ వలపు

చ 1: వంతులకు నొకమాట వాసులకు నొకమాట

కొంతగొంత గొసరేరు కొమ్మలు నిన్ను

బంతివిందులు చెప్పేరు పాలిండ్లు చూపి చూపి

సంతకూటములలోని చవులాయ వలపు

చ 2: కలువల నొకవాటు కప్పురాన నొకవాటు

చలములు సాదించేరు సతులు నిన్ను

వెలలు నీకుఁ బెట్టేరు వేడుకల మోవులకు

కలగూరగంపలె గరుబాయ వలపు

చ 3: కాతరాలన నొకరతి కాఁకలనే వొకరతి

పైతరవు వెట్టేరు భామలు నిన్ను

నీతితో శ్రీవేంకటేశ నీవు మమ్మిట్టె కూడగ

రేతిరిఁ బగలు పెరరేఁపులాయ వలపు





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1121-2 సామంతం సం: 21-116

పల్లవి: వేడుక మదనునివిద్యలివి

వాడలఁ గతలివి వాఁటములాయె

చ 1: చలములు సతితో సాదించరాఁగా

వలపులు రేఁగెను వడిఁబడెను

చెలువుఁడ మఱియును చెక్కులు నొక్కఁగ

అలరినయాసలు అవుఁదున జిక్కె

చ 2: కాయపుమదములు కాఁకలఁ బెనఁగంగ

పాయపుటురు లివి పైఁ దవిలె

వోయయ్య తమకపుటోడ లాడఁగా

ఆయపుకుచములు అడిబర వాయె

చ 3: కక్కసించి యిటు కాంగిఁటఁ బెనఁగఁగ

లక్కవంటిమతి లలిఁ గరఁగె

యిక్కువ శ్రీవేంకటేశ కూడితివి

వెక్కస మీపెకు వెల్లవిరాయె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1121-3 హిందోళవసంతం సం: 21-117

పల్లవి: ఏల కరంగఁడే మన సిందాఁకాను

యేలికంటాఁ జూచితినే యిందాఁకాను

చ 1: వచ్చినట్టే వచ్చితిని వాడవారి మెప్పించితి

యిచ్చకమాడితిఁ దన కిందాఁకాను

మచ్చరించనైతి తొంటిఁమాటలు నొప్పగించితి

యెచ్చరికలే సేసితి నిందాఁకాను

చ 2: సన్నలకు లోనైతి చవులెల్లాఁ జూపితిని

యిన్నటాఁ జుట్టమనైతి నిందాఁకాను

తన్ను నేమీఁ గోపగించ తప్పులువట్టను నేను

యెన్నుకొని మొక్కితిని ఇందాఁకాను

చ 3: అదను గాచుకుండితి నట్టే కాంగిటఁ గూడితి

ఇదివో శ్రీవేంకటేశ ఇందాఁకాను

పదరఁ డీతఁడే చేపట్టి నన్ను మన్నించె

యెదుట నవ్వులు నవ్వె యిందాఁకాను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1121-4 వరాళి సం: 21-118

పల్లవి: వివరించి చెప్పరాదు వేరే నీకు దాఁచరాదు

జవకట్టి వున్నవి మీజాణతనాలు

చ 1: చిడుముడి మాటలలోఁ జిందీ నిన్న మొన్నటి-

కడువిరహములోనికాఁతాళలు

గుడిగొన్ననిట్టూర్పులఁ గుమ్మరించీ నీమీఁద

తడఁబడ్డతనలోనితలపోఁతలు

చ 2: సొలపుఁ జూపులవెంట జొబ్బిలీని యేకతపు-

టలుకలఁ గొసరేటియందచందాలు

కులికి చెమటనీటఁ గురిసీ నీయెదుటను

చలివేఁడి వలపుల జడివానలు

చ 3: మొలకనవ్వులలోనే ముంచీ నీవు గూడిన-

పలురతులలోపలి భావ భేదాలు

యెలమి శ్రీవేంకటేశ యేలిననీకే తెలుసు

తలకొన్న జవ్వనపుతమకములు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1121-5 కాంబోది సం: 21-119

పల్లవి: మరిగి మరిగి తాను మగనాలి వలెనే

సరని దెలిసి లోలో సన్నసేయరే

చ 1: మెలుపునఁ బిలువఁగ మెత్తఁగానే పలికీని

వెలి నెవ్వరైనా నది వినేరంటానో

చెలులు వొద్దనుండఁగా సిగ్గులు రేఁగఁగఁబోలు

తలఁపు దెలిసి యేకతానఁ జెప్పరే

చ 2: కానుక చేతికివ్వఁగా కానకుండా నందుకొనీ

కానీలేవే యెవ్వరైనాఁ గనేరంటానో

తానెవ్వతెకైనా మాట తగులఁగ నియ్యఁబోలు

యేనెపములైనాఁ జూపి యింటికిఁ దేరే

చ 3: పలుమారు మొక్కఁగాను పరాకువలెనే వచ్చె

బలిమి గుట్టు బయటఁ బడీనంటానో

యెలమి శ్రీవేంకటేశుఁ డీడగాఁగా నన్నుఁ గూడె

వలపుకోలఁదినే రవ్వలు సేయరే





# అన్నమయ్య సంకీర్తనలు





శృ.రేకు: 1121-6 నాగవరాళి సం: 21-120

పల్లవి: తగులాయ నీకనేలే తడఁబాట్లు

మొగిగొనె వలపుల మొగమోఁటలు

చ 1: పెనఁగేరమణునికిఁ బ్రియమే సేతువుగాక

కనుచూపులలోనేలే కసుఁగాట్లు

ననిచినవేళను నవ్వు నవ్వుదువుగాక

మొనచేతులలోనేలే ములవాండ్లు

చ 2: మక్కువ మగనితోడ మంచిమాటాడుదువుగాక

చక్కెరమోవి నేలే చప్పుచారులు

చెక్కులు నీకు నొక్కఁగా సేదదేరుదువుగాక

ముక్కుల చన్నులనేలే మొనపోట్లు

చ 3: కలసి శ్రీవేంకటేశుఁ గాఁగిలించుకొందుగాక

నిలుగులమేననేలే నిండుసిగ్గులు

తలకొన్నరతులలోఁ దమితో నుందువుగాక

అలవి మీరి యేలే అసురుసురు





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1122-1 ధన్నాసి సం: 21-121**

**పల్లవి: నీ కేల భయము నీకునీకే అలికేవు**

**చేకొన్న నీచేఁతలందుఁ జెరిగున్నవా**

**చ 1: చనవుసేసుక ఆపె సారె నీమోము చూచితే**

**చెనకఁ జాలక యేల సిగ్గువడేవు**

**కనుఁగొనఁబోతే నందు కళ లింతే వుండీ నవి**

**వెనుకొని కాంతలెల్లా వేలు కాడేరా**

**చ 2: మచ్చికచేసుక ఆపె మాటలు నిన్నడించితే**

**కొచ్చి కొచ్చి నీవేల కొంకంజూచేవు**

**కచ్చుపెట్టి తోఁచేవి కల్లనిజములేకాక**

**అచ్చమై పొందినసతు లంటుకున్నారా**

**చ 3: చుట్టము సేసుక యింతి సొరిది నిన్నుఁ గూడితే**

**యిట్టె శ్రీ వేంకటశ నీవేల మొక్కేవు**

**గుట్టునను కొనగోళ్ల గురుతు లుండీఁగాక**

**ముట్టిన కాంతలు మేన మూఁగుకున్నారా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1122-2 కన్నడగౌళ సం: 21-122

పల్లవి: సేయవయ్య నీవు సేసేచేఁత లెల్లాను మా-

పాయపువయసేపో భ్రమయించేది

చ 1: పక్కన నీవు మాతో బలిమి చూపిన మా-

జక్కవకుచములేపో సాదించేవి

చక్కఁగా నీవెంతేసి సాములు సేసి వచ్చినా

వెక్కసపుమాఁటలే పో వేటువేసేవి

చ 2: చెలరేఁగి నీవు మాపై చేతు లెంత చాఁచినాను

సొలపుఁజూపులేపో సూడువట్టేవి

తొలఁగక సరసాన దొమ్మి యెంతసేసినా మా-

మొలకనవ్వులేపో ముంచుకొనేవి

చ 3: చిత్తగించి కాఁగిటను చేపట్టులకుఁ జొచ్చితే

తత్తరపు సిగ్గులే పంతము గోనేవి

యిత్తల శ్రీవేంకటేశ యెనసితి విట్లానే

లత్తుక గోరివన్నెలే లావుచూపేవి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1122-3 నాగవరాళి సం: 21-123

పల్లవి: తానే సిగ్గువడఁగ తప్పు లెందుఁ బట్టుదునె

కానీవే అన్నిటా తారుకాణకు గురెవ్వరే

చ 1: చిక్కనినవ్వులతోడ శిరసు దా వంచఁగాను

యెక్కువమదనముద్ర లెందువోవునే

ముక్కుమీఁది వేలితోడ మోసముతో నుండఁగాను

మక్కువ నామాఁటకు మాటాడేవారెవ్వరే

చ 2: చిరుగుఁగెమ్మోవితోడ చెక్కునఁ జేయిడుకోఁగా

అగడుగా నాతోఁ బెండ్లాడే దెప్పుడే

మొగము చూచి తాను మొక్కులు దా మొక్కఁగాను

మొగమాట తిట్లెల్ల మోఁచే దెక్కడనే

చ 3: నంటుసేసుకొని తాను నన్నుఁ గాగిలించుకోఁగా

వుంటనింట మరువా ట్లొడ్డేదెపుడే

దంట శ్రీవేంకటేశుడు తానే వచ్చి నన్నుఁ గూడె

బంట పంతములెల్లానుఁ బచరించే దెప్పుడే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1122-4 పళవంజరం సం: 21-124

పల్లవి: వలపించఁబోయి నీవే వలచితి వతనికి

పలుకించేనంటా నీవే పలికేవే కరఁగి

చ 1: కన్నుల నీవు చూచితే కాంతుఁడు గుటియౌఁగాక

చన్నుమీఁదిపయ్యద జాఱనేఁటికే

సన్నలు నీవు సేసితే సమ్మతించుఁగా కతఁడు

చిన్ని చెమటలు నీమెయిఁ జిందనేఁటికే

చ 2: నీవు చేయి చాఁచితే నీవిభుఁడు లోనౌఁగాక

వేవేలకు నీకొప్పు వీడనేఁటికే

మోవి నీవు చూపితేను మొక్కి తాఁ జేకొనుఁగాక

ఆవేళను నీవు వెరగందనేఁటికే

చ 3: అంటితే శ్రీవేంకటేశుఁ డట్టె నిన్నుఁ గూడుఁగాక

పెంటపులకుల నీకుఁ బెరుగునేలే

జంటయై కూడితివి నీచన వాతఁ డిచ్చుఁగాక

వెంటవెంట వచ్చి వచ్చి వేఁడుకొననేఁటికే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1122-5 సాళంగం సం: 21-125

పల్లవి: ఎంతమాయకాఁడవో యేమని చెప్పుదు నిను

పొంతల నవ్వేవేల బూమెటవలెను

చ 1: చెప్పగానే నూరూరీ చిన్ననాటివలపు

కప్పము వట్టినచింత కాయవలెను

దప్పి నాఁకలీఁ దీరీని తగ నీమోవి చూచితే

విప్పుచును పెక్కిండ్లవిందువలెను

చ 2: వింటే మేను గరుపారీ వినోదపు నీసుద్దులు

ముంటివాఁడిజాజిననమొగ్గలవలె

చంటికొనలజవ్వనమే జడిసీ నీవద్దనుంటే

పంటవండినరాసులభాగ్యముల వలెను

చ 3: కూడఁగానే ఆసలెక్కీ కోరిననీరతులను

వాడికెఁ గూడివచ్చినవడ్డివలెను

యీడన శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె

నీడలనిలిచిననిధానము వలెను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1122-6 రీతిగౌళ సం: 21-126

పల్లవి: ఆయనాయ నూరకుండు ఆసోదమా నాకు

ఆయమై నీనేసపాలు అఱచేత నున్నవి

చ 1: అంతేసి నాతో నీవు ఆనవెట్టుకోనేలయ్య

దొంతిఁ బెట్టుకుందాన నీతొల్లిటిబాస

వింతగా వేరె నాకు విడె మియ్యవలెనా

పొంత నీతమ్ముల మిదె పుక్కిటిలో నున్నది

చ 2: వెడ్డువెట్టి యింత నన్ను వేఁడుకొననేలయ్య

దొడ్డిఁ బెట్టుకుందాన నీతొంటి మొక్కులు

వొడ్డుకోఁగా నప్పటిం బూవుల వేయవలెనా

వొడ్డిననీ కొప్పు విరు లోడి నిండి వున్నవి

చ 3: ఆసచూపి జవ్వాదివం కిట్టె నాకీనేలయ్య

దోసిటఁ బట్టుకుందాన తొంటికానికె

వాసి నలమేల్మంగను వడి శ్రీవేంకటేశుఁడ-

వీసుదీరఁ గూడితివి యింతబలు వున్నదా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1123-1 ముఖారి సం: 21-127**

**పల్లవి: కాకుండితే రమణుఁడ కాఁతాళములు రేఁగు**

**పైకొన్నమాటతోడ పంతమెల్లా దక్కెను**

**చ 1: వుల్లసముగా నాడినవొడ్డారపునీమాట**

**చల్లనినవ్వుమాటతో శాంతమాయను**

**కల్లలుగా నాడినకారపువెంగెపుమాట**

**తెల్లమై ఆసమాటతో తియ్యనాయను**

**చ 2: వూరకె నీవాడిన వుప్పనైననీమాట**

**సారపుముద్దుమాటతో చవి వుట్టెను**

**జారువడ నాడినట్టిచప్పనైననీమాట**

**పేరుకొన్న మాటతోడఁ బ్రియమాయను**

**చ 3: కప్పురపు వెసురుకాఁగిటిలో తిట్టుమాఁట**

**వొప్పినసమ్మతి మాఁట నొచ్చెము దీరె**

**యిప్పుడే శ్రీవేంకటేశ యెనసినపచ్చిమాఁట**

**తప్పినినీమాఁటతోడ తనివి నాకాయను**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1123-2 వరాళి సం: 21-128

పల్లవి: కొంకనేల నీవింత కోరి సిగ్గువడనేల

సంకెదీరె నీతోడ చలము లేదయ్యా

చ 1: మనసొక్కటైతేఁ జాలు మాఁటలు వేరు తోఁచవు

అనుమానమేల మాతో నానతీవయ్యా

యెనయికలు గలిగితే నెరవు లించుకా లేవు

కొనమొద లెంచనేల కూచుండవయ్యా

చ 2: యితవులైన చోట నెగ్గులుసిగ్గు లుండవు

చతురతల వలపు చల్లవయ్యా

పతి తారుకాణలైతే పట్టినదెల్లా నిజము

రతికెక్కెఁ బనులెల్లా రావయ్యా లోనికి

చ 3: సమ్మతించినందుకెల్లా సరసములే మించు

నమ్మించితి విట్టే మాతో నవ్వవయ్యా

యిమ్ముల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె

యెమ్మెలేల నీమోవి యియ్యవయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1123-3 దేశాక్షి సం: 21-129

పల్లవి: వెట్టిచెలులము నేము వేడుకేకాదా

నట్టుకొని నీవింతేసి నవ్వవద్దా నేఁడు

చ 1: రాతిరెల్లాఁ బాదాలు రాసి గుద్దించుకొంటివి

నాతోడి పొందు నీకు నయమేకాదా

యేతులకు నాకు మడిచిప్పించుకొంటి విందాఁకా

లాతుగా నిది గొంతలాభమేకాదా

చ 2: కొంగుపట్టు కిందాఁకా కొప్పు దూవించుకొంటివి

చెంగట నీగజరుకు సెలవేకాదా

వుంగరాలవే ళ్లిందాఁకా వూరకే పిసికించితి

వెంగలిమావూడిగాలు వినోదాలుగావా

చ 3: కూరిమి గొసరుకొంటా కుంచవేయించుకొంటివి

సారెకుఁ గరఁగ నీకు చవులేకావా

ఆరయ శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి

దారకుఁడ వింతసేయఁ దగవే కాదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1123-4 సాళంగనాట సం: 21-130

పల్లవి: ఎంతైనా నీయలవాట్లేల మానేవు

వింతలు సేయవుగా వెలఁదులయెడను

చ 1: వాసికిఁ గొంగువట్టేవు వడి నీవు గొల్లెతల

సేసినట్టెల్లా ముందు చెల్లెనంటాను

ఆసలఁ జేయిచాఁచేవు అల్లనాఁడు రుక్మిణిని

వేసుకొంటి నిఁకలేదు వేసరంటాను

చ 2: యింటికి రప్పించుకొంటి విట్లాఁ బదారువేల

యింటఁ బెట్టుకొంటి రతికెక్కెనంటాను

జంట సాము నెరపేవు సత్యభామకు విల్లిచ్చి

వెంటఁబెట్టుకొన్నసుద్ది వెలసెనంటాను

చ 3: శిరసు వంచి మొక్కేవు శ్రీవేంకటేశ నీ-

శిరసుపైఁ దొళశమ్మ చేరెనంటాను

యిరవై నన్ను నేలితి విందిరను భూసతిని

యిరుమేలా నిడుకొని యేలితినంటాను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1123-5 భైరవి సం: 21-131

పల్లవి: వినవే నామాటలు వివేకించుకొనవే

పనులేమి గలిగినా పతిఁ గొసరుదమే

చ 1: మగువలెల్లా నొక్కటి మనలో విరహమేలే

తగుసవతులమైతే తప్పు వచ్చెనా

మగనికాఁగిలే గతి మఱి యెంత చుట్టినాను

పగలు రేతిరి నొక్కబయటనే కూడీనే

చ 2: అక్కయేమే చెల్లెలేమే అందులో భేదమున్నదా

నిక్కి యేరాండ్లమైతే నేరమాయనా

చిక్కేటి దాతనిమోవే చేరి యిద్దరినోళ్లకు

చుక్కలూఁ జంద్రుఁడూ నొక్కచూపులోనే కూడునే

చ 3: నీవు నేను సమమే నేరిచి నడచితేను

దేవుళ్ల మిద్దరమైతే తెలివిలేదా

శ్రీవేంకటేశుఁడు గూడె చెలఁగి నిన్నును నన్నూ

పూవులెల్లా వనమునఁ బూచేవేకదవే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1123-6 కన్నడగౌళ సం: 21-132

పల్లవి: కాగిలించుకొనవే గక్కన నీరమణుని

కాఁగి కరఁగినమేలు గట్టాయఁ జాలదా

చ 1: బిగువు నీచన్నులందు బెరసీని చాలదా

బిగియఁగావలెనా ప్రియునితోడ

వొగరు చిగురుమోవి నుట్టిపడీఁ జాలదా

వొగరుమాఁటలు వేరె వొలుకగవలెనా

చ 2: పెనగొని నీనెరులు పెక్కులయ్యీఁ జాలదా

పెనఁగఁగవలెనా పిలువఁగానే

మొనసెఁ బులకలు కమ్ముక మేనఁ జాలదా

మొనలగోళ్లఁ జూపి మోప నింకా వలెనా

చ 3: నాఁటుకొనె నీప్రియము నగవులఁ జాలదా

నాఁటఁజూడవలెనా నయములనె

మీఁటె వలమేల్మంగవు మీఁదఁ గప్ప మిట్టె కూడి

మీఁటె వేలు శ్రీవేంకటమేఁటి నీపైఁ జాలదా





# అన్నమయ్య



# సంకీర్తనలు



**శృ.రేకు: 1124-1 ఆహిరి సం: 21-133**

**పల్లవి: విన్నవించితిమి నీకు వేడుకవేళ**

**కన్నెను నీవు దయఁ గాచేటివేళ**

**చ 1: మచ్చికలు దయివారె మనసెల్ల జైవారె**

**వచ్చె జవ్వనానకు వసంతవేళ**

**చొచ్చి నిన్నుఁ బాసి తాపసూర్యుఁ డెండగాయఁగా**

**విచ్చనవిడిగాఁ దోఁచె వేసగివేళ**

**చ 2: సిగ్గులు మొలవఁజొచ్చె చెమటలేరులు హెచ్చె**

**కగ్గులేక మించె వానకాలపువేళ**

**వెగ్గళించి సెలవుల వెన్నెలలు చూపట్టి**

**వొగ్గి శరత్కాలము వొదిగె నీవేళ**

**చ 3: తత్తరపుచలి పొంచె తలపోఁతమంచు మించె**

**యెత్తి యలమేల్మంగకు హేమంతవేళ**

**బత్తితో శ్రీవేంకటేశ పైకొని కూడితి విట్టె**

**చిత్తజుకాఁకలు దేరె సిసిరవేళ**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1124-2 నాదనామక్రియ సం: 21-134

పల్లవి: నీకే పంపుసేసుఁగాక నేమేమన్నాఁ గైకొనీనా

యేకడా నీమఱఁగున నిటుండేవారము

చ 1: చెలియ నీచెప్పినట్టు సేసుఁగాక అతఁడు

మలసి మాకెల్లాను మట్టుపడీనా

పిలిచినీపిలుపే ప్రియములై వుండుఁగాక

బలిమి నేము రమ్మంటేఁ బలికీనా అతడు

చ 2: వినవే నీకన్నులకే వెఱచుఁగా కాతఁడు

చెనకి నేము చెప్పితే చెవులొగ్గీనా

చనవిచ్చి నీమొక్కులే చవులై యుండుఁగాక

యెనసి మావినయాల కింటికి వచ్చీనా

చ 3: పై పై నీకూటమికే భ్రమసుఁగా కాతఁడు

తీపులు నేము చూపితే తెమలీనా

యేపున నీయప్పణను యిటు మమ్ము నేలెఁగాక

వోపి శ్రీవేంకటేశుఁడు వొడఁబడీనా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1124-3 బౌళి సం: 21-135

పల్లవి: చేంతకుం జేత సేసెను చెల్లుఁగదవే

యీఁతా మోఁతా నొక్కటాయ నిఁకనేమనేరే

చ 1: కన్నుల మొక్కేరు మీరు కాఁకలు చల్లేరు మీరు

యెన్నఁగ రెండూ నడపేరేమే వొక్కంటే

కిన్నెరకాయచన్నుల కేలినవ్వేటిచెక్కుల

సన్నపుగోర నొత్తెను సరసుఁడే అతఁడు

చ 2: చేతులుచాఁచేరు మీరు సిగ్గులూఁ బడేరు మీరు

యేతులకు రెండూ నడపే లిదె మీయందే

ఘాతలఁ గొప్ప విరులు కప్పినపయ్యదకొంగు

రీతి నొక్కమాఁటే జారించెఁగదే ఘనుఁడు

చ 3: కందువఁ గూడేరు మీరు కడుభ్రమసేరు మీరు

అందాలు రెండూఁ జూపే రంగాలందునే

ముందే శ్రీవేంకటేశుఁడు మోవి ఇచ్చి ముచ్చటాడె

విందులుగా మొహింపించె వేడుకకాఁడే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1124-4 గౌళ సం: 21-136

పల్లవి: ఇందుకేకా విభుఁడు నీయింట నెలకొన్నాఁడు

కందు వెలుఁగుదువు యీకత నీవే నేర్తువే

చ 1: నయమెంత గలిగినా ననుపులకే మేలు

ప్రియమెంత గలిగినా పెనపులకే మేలు

జయమెంత గలిగినా చనవులకే మేలు

క్రియ లెలుఁగుదువు యీకీలు నీవే నేర్తువే

చ 2: మొగమెంత చూచినా మొహానకే మూలము

తగవెంత నెరపినా తగులుకే మూలము

నగవెంట గలిగినాను నమ్మికలకు మూలము

పగ టెరుఁగుదువు యీపాడి నీవే నేర్తువే

చ 3: వూడిగ మెంతసేసినా వొద్దికలకే దాపు

వేడు కెంతనిలిపినా విట్టువీఁగుటకే దాపు

కూడితి విన్నిచందాల కోరిక శ్రీవేంకటేశు

జాడెఱుఁగుదువు సరసము సరసము నీవే నేర్తువు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1124-5 సామంతం సం: 21-137

పల్లవి: చూగఁ బిన్నగాని సుద్దులు పెద్దలు

కూడి పట్టఁబట్ట గొట్టీ గోవిందుడు

చ 1: పాలవుట్టిఁ గొట్టి పరువునఁ బోయి

వేలాడఁగాఁ గొట్టె వెన్నవుట్టి

కేలు చాఁచి కొట్టె కిందితేనెవుట్టి

యేలాగు దాఁతమే యేమందమే

చ 2: చక్కిలాలవుట్టి సరుగనఁ గొట్టి

నిక్కి నిక్కి కొట్టె నేతివుట్టి

పక్క దిక్కు గొట్టె పంచదారవుట్టి

యెక్కడ దాఁతమే యేమందమే

చ 3: వారవట్టి కొట్టె వంచి పెరుగువుట్టి

చారపప్పువుట్టి జారఁగొట్టె

కోరి శ్రీవేంకటగోవిందకృష్ణుని-

కేరీతి దాఁతమే యేమందమే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1124-6 బౌళి సం: 21-138

పల్లవి: ఆయలేవే యేమి చెప్పే వాతనిపొందులు

పాయములకొలఁదివే పైకొనెడియాసలు

చ 1: పిలుపులకొలఁదివే బిగువులు

బలిమి కొలఁదివే పంతాలు

చలము కొలఁదివే సాదింపులు

కలసిన కొలఁదివే కరగులు

చ 2: చనవుల కొలఁదివే సరసాలు

ననుపు కొలఁదివే నగవులు

వినికి కొలఁదివే విన్నపాలు

తనిసిన కొఁలదివే తమకములు

చ 3: వేడుక కొలఁదివే వేసాలు

వాడిక కొలఁదివే వలపులు

యీడనె శ్రీవేంకటేశుఁ డెనసె నిన్ను యీ-

కూడిన కొలఁదివే గుఱుతులు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1124-7 రామక్రియ సం: 21-139

పల్లవి: సారెనేలే జగడము సారెనేలే సణఁగులు

సారెనేలే పతితోఁ బంతము సారెనేలే

చ 1: పెదవుల గొణఁగుచు బీరములాడుచు

కొదలుఁదిట్లనే కొసరుచును

చ 2:

సెలవుల నవ్వేవు చేతులు చాఁచేవు

సళుపుఁజూపులనె చల్లేవు చ 3:

చిదుముడిపడకువె శ్రీవేంకటపతి

కడపరాయఁడయి కయికొనెను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1125-1 కాంబోది సం: 21-140

పల్లవి: ఇటమీఁద నీచిత్తము యెఱుకగలవాఁడవు

తటుకన నింకానేమి దండమువెట్టేను

చ 1: కోరినకోరిక నీవు గుఱి నీచక్కఁదనము

వేరే నీకు నిఁకనేమి విన్నవించేను

జారె నాపయ్యద నీకు చన్నులివి కానుకాయ

గారవాన నిఁకనేమి కప్పమిచ్చేను

చ 2: అంగము నీవద్దనుండి ఆయము నీచేతిది

అంగవించి యెందాఁకాఁ బ్రియము చెప్పేనే

ముంగిట వెరగందితి ముట్టితివి నీవు నన్ను

యెంగిలిమోవివిందు లేమి చెప్పేను

చ 3: గక్కనఁ గూడితి నిన్ను కాఁగిలి నీసొమ్మాయ

చిక్కించు కెంతతడవు సేసవెట్టేను

అక్కున శ్రీవేంకటేశ ఆలను నీవు పతివి

పక్కన మరేమి నిన్ను బాసగొనేను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1125-2 బౌళి సం: 21-141

పల్లవి: ఈకె యెంతచనవరో యేకతాన నింతసేసె

లాకలుగా వారు నవ్వి లలి నొక్కటైరి

చ 1: అలిగా వొక్కరొక్కరు అటుమోములై వుండఁగా

వెలయఁజెప్పె బుద్ధులు వినకుండఁగా

చెలివలువలు దీసి సిగ్గునఁ దలుపులు మూసి

వెలి నిలుచుండీతేను వింతతిట్టు దిట్టిరి

చ 2: బాగాలు నోళ్లఁబోసి బలిమి నాకు మడిచి

ఆగతి నిడీ నప్పటి నట్టె వుండఁగా

చేఁగదేరఁ గాఁగిళ్లకు చేతులు చక్కఁగా దొబ్బి

బాగుగఁ దెరవేసితేఁ బచ్చితిట్టు దిట్టిరి

చ 3: శ్రీవేంకటేశ్వరు నింతిఁ జేరి మర్మా లంటించి

ఆవేళవారివలువ లట్టె కప్పఁగా

దేవుఁడు దేవులుఁ గూడి తెఱవను మెచ్చి మెచ్చి

వేవేలిచ్చి మన్నించి వేరేతిట్టు దిట్టిరి





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1125-3 లలిత సం: 21-142

పల్లవి: ఎవ్వరెవ్వరిపంతాలు యెటు వచ్చునో

ఇవ్వల వీరినేరుపు లేమి చెప్పేమే

చ 1: మాటలాడమని లోలో మరి వొట్టువెట్టుకొని

యీటునఁ గొంతవ డూర కిద్దరు నుండి

పాటించి ఇంతిచెల్లెలిఁ బట్టితెచ్చి నాయకుఁడు

గోటారించి భంగించఁగా కొమ్మ వేఁడుకొనెను

చ 2: మోములు చూడమనుచు ముంచి వొట్లువెట్టుక

వోముచుఁ గొంతవడి తామూరకే వుండి

నేమమున నద్దములో నీడలు దెచ్చి విభుఁడు

భామినికిఁ జూపితేను పై పై జంకించెను

చ 3: కూడమంటాఁ గోపమునఁ గోరి వొట్టువెట్టుకొని

వోడక కొంతవడిదాఁ కూరకే వుండి

వేడుకాపె కాఁజ శ్రీవేంకటేశుఁ డంటఁబోఁగా

గాఢల వద్దంటా సతి కాఁగిలించి పట్టెను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1125-4 మంగళకౌసిక సం: 21-143

పల్లవి: మించి ఇన్నిటికి మీకుమీరే జోడు

మంచముపై రతులకు మంతనాలే జోడు

చ 1: తీరని యాసలకు తియ్యనిమోవులు జోడు

మేరమీరేచిత్తాలకు మేనులే జోడు

ఆరనికాఁకలకును అంటినకాఁగిళ్లు జోడు

నేరిచిననేర్పులకు నెయ్యమే జోడు

చ 2: చెనకుల కన్నిటికి చిమ్ముఁదమకము జోడు

ననుపులకును లేఁతనగవే జోడు

చనువుమనవులకు సన్నలు చాయలు జోడు

వొనగూడి వుండుటకు వోరుపులే జోడు

చ 3: కలయికలకు సారెఁ గనుఁగొనుటే జోడు

అలపులకును మాటలాడుటే జోడు

అలమేల్మంగ శ్రీవేంకటాద్రీశ నిన్నుఁ గూడె

తలపోఁతలకు మీమీతారుకాణే జోడు



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1125-5 హిందోళం సం: 21-144

పల్లవి: ఆతఁ డాడుమనఁగానే ఆడితి నే నీమాట

కాతరాన లోన వాఁడే కైకొనఁగరాదా

చ 1: పయ్యదేల మూసేవే పడఁతి నీచన్ను లవి

వొయ్యన జక్కవలంత వుబ్బ కోర్చునా

వుయ్యాలమంచముమీఁద వొరసేనీనాయకుని

కొయ్యరతుల కాఁగిటి గూఁటఁ బెట్టరాదా

చ 2: రెప్పలేల వేసేవే రేసుల నీకనుచూపు-

ముప్పిరిచకోరాలు మూలనుండునా

కప్పరపుమేడలోనఁ గదిసేనీరమణుని-

దెప్పరపు మేననే దండెన వేయరాదా

చ 3: తురుమేల ముడిచేవే తుమ్మిదలఁ బిసికితే

మరుగునా అలమేలుమంగవు నీవు

పరపుపై శ్రీవేంకటపతిఁ గాఁగిటఁ గూడితి-

వరయఁగ నాతనిపై నాట నేర్పరాదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1125-6 శంకరాభరణం సం: 21-145

పల్లవి: అందరిముందరనైతే నను వు రాదు

కందువకు నీవు రమ్మా కత చెప్పేను

చ 1: చనవు లొకతె కిచ్చి చలము రేఁచే వొకతె

వనితకు వనితలు వట్టపెట్టేరా

ఘనుఁడవు నీకింత గలితే లోనికి రమ్మా

వొనర నీమనసురా నొప్పఁజెప్పేను

చ 2: నవ్వే నాపెతో నీకె నమ్మించి దీకొలిపేవు

జవ్వనికి జవ్వని సరిదూఁగదా

అవ్వల నీకింత ప్రియమైతే దగ్గరిరమ్మా

చివ్వన నీవేడుకలు చెల్లించేను

చ 3: రతిసేసి చెలియను రమణిఁ బురికొల్పేవు

అతివపై నతివ రా నాస మానీనా

తతి నలమేల్మంగను తగు శ్రీవేంకటాచలా

పతి కూడితివి రమ్మా బాగులు సేసేను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1126-1 దేసాళం సం: 21-146

పల్లవి: జాము వోయ నింకాను సటలేఁటికే

నీమతక మింతయు నే మెఱఁగమా

చ 1: సిగ్గులెందాఁకానే చెఱఁగు వట్టెను పతి

యెగ్గు లెందాఁకనే యిదె మొక్కీని

నిగ్గుఁజల మెందాఁకానే ని న్నాతఁడు వేఁడుకొనీ

వొగ్గి విడె మిమ్మంటే వోపనందురా

చ 2: పెనగు లెందాఁకానే ప్రియపడీ రమణుఁడు

కినుక లెందాఁకానే కిందుపడీని

జనుగు లెందాంకానే చోటిచ్చీఁ గూడుమంటా

నిను గుంచ వేయుమంటా నేరనందురా

చ 3: చిఱునవ్వం లెందాఁకానే శ్రీవేంకటేశుఁడు గూడె

నెఱి నలమేల్మంగవు నిన్ను నిప్పుడే

వెఱగు లెందాఁకనే విచ్చనవిళ్లాయ నీకు

మఱియుఁ గొసరితేను మచ్చరింతురా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1126-2 పాడి సం: 21-147

పల్లవి: ఇద్దరి మీతలపోంత లెఱఁగఁగాక

కొద్దిమీరితే నగవే కోటి కొండగాదా

చ 1: వాడికెవిభునితోడ వాదైతే నెఱఁగఁగాక

చూడనేరిచితే చూపే సూడిదెగాదా

పాడిపంతాలకు నెగ్గుపట్టితే నెఱఁగఁగాక

ఆడనేరిచితే మాట అమృతము గాదా

చ 2: సవతిపో రితనిపైఁ జల్లితే నెఱఁగఁగాక

చవిగొంటే వలపులే చక్కెర గాదా

తివిరి చలములే సాదించితే నెఱఁగఁగాక

వివేకించితే మనసే వింతసొమ్ముగాదా

చ 3: మతకపుసిగ్గులు నేమరితే నెఱఁగఁగాక

రతిసేసితేఁ గాఁగిలే రాజ్యము గాదా

తతి నలమేల్మంగవు దక్కె శ్రీవేంకటేశుఁడు

సతమైనచనవులే సంపదలుగావా





# అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1126-3 శుద్ధవసంతం సం: 21-148

పల్లవి: ఏమి సేసినా నీయిచ్చకొలఁదే కాక

కామినులము నిన్నెట్లు కాదనఁగవచ్చును

చ 1: తళుకునఁ బొలసేవు తలయెత్తి చూచేవు

చలపట్టితే వలపు చప్పరించేవు

చెలి దగ్గరివచ్చితే చేతి లోనయ్యేవు

బలిమి నీమనసెట్టు పట్టేమనవచ్చును

చ 2: కడుఁబెచ్చుపెరిగేవు గక్కన సూడువట్టేవు

విడువలేక సతిని వెంటఁ దిప్పేవు

వొడివట్టి తీసేవు వూరివారి నెల్లాను

చిడుముడి నిన్ను నెట్టు చెనకఁగవచ్చును

చ 3: కమ్మి సిగ్గువడవు తొక్కనిచోట్లు తొక్కేవు

పమ్మి యలమేల్మంగకుఁ బతివి నీవు

చిమ్ముచు మేకులకే శ్రీవేంకటేశ మొక్కితి

నెమ్మది నిన్నిఁక నెట్టు నేరమెంచవచ్చును





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1126-4 రామక్రియ సం: 21-149

పల్లవి: వట్టిపంతములు మాతో వద్దు వద్దయ్యా

పట్టుపుదేవులకును భ్రమయఁగవలదా

చ 1: ఆయాలుసోఁకినమాట ఆపె నీతో నాడఁగాను

యీయెడ నీవు గరఁగ కెట్టు మానేవు

పాయపుఁజెలియ నీకు బత్తులెల్లాఁ జేయఁగాను

సోయగాన నీవెట్లఁ జొక్కకుండేవు

చ 2: ముంచి యాపె నీకు చనుమొనలు చూపఁగాను

యెంచి యిట్టే పంపుసేయ కేల మానేవు

పొంచి నీరమణి నిన్నుఁ బొత్తుకుఁ బిలువఁగాను

కొంచించి నిలిచి ఇట్టె గుండె వట్టేవు

చ 3: అలమేలుమంగ వురమందు నీకు నెక్కఁగాను

యెలమి నానందించ కెట్టు మానేవు

అలరి శ్రీవేంకటేశ ఆపె సరసమాడఁగ

పెలుచవై నీవెట్టు పెనఁగాడేవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1126-5 వరాళి సం: 21-150

పల్లవి: ఏమయ నీతోడిపొందు లిటువంటివి
దోమటి దొడికితేను తొడిఁబడ నెట్లో

చ 1: నవ్వఁగానే నీతోను నాటుకొనెఁ బ్రియములు
దవ్వులనుండి చూచితేఁ దగిలె మతి
మువ్వంకల మొక్కఁగానే ముదిరె మిక్కిలియాస
యివ్వలఁ జేయంటితేను యిఁక నెంతేశౌనో

చ 2: మాట లూరవే యాడితే మర్మములు గడురేఁగె
పాటించి కానుకియ్యఁగా పట్టెను తమి
చాటువమొగమోటు నమ్మతులాయ నన్నియు
యీటు సరసాలాడితే నిఁక నెంతేశౌనో

చ 3: యేకాంతము జరపఁగా నిట్టె మేను చెమరించె
దికొని పెనఁగంగాను తేరెఁ బనులు
చేకొనె నలమేల్మంగ శ్రీవేంకటేశ్వర నిన్ను
యీకడఁ గాఁగిలించెను ఇఁక నెంతేశౌనో



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1126-6 ముఖారి సం: 21-151

పల్లవి: ఇన్నిటికి నోపుదు విటువంటినీకును

యెన్నఁగ వలచివచ్చే దేమిబాఁతి సతులు

చ 1: చుట్టపువరసకుఁగాఁ జొచ్చి బండి రొప్పితివి

గుట్టున గొల్లలకుఁగా కొండ యెత్తితి

బిట్టువాగెలఁ బెండ్లిపేరటము వోతివి

యిట్టిపూసగొండివి నీకేమిబాఁతి సతులు

చ 2: మామపంచ వేఁడుకొని మనికియై వున్నాఁడవు

చూ; మరల నింటఁ బసులఁ గాచితి

దోమటి దోడివితివి దొడ్డివారి యిండ్లను

యీమంచి యిచ్చకుని కేమిబాఁతి సతులు

చ 3: అంకెల యజ్ఞసత్నుల నడిగి బోంసేసితివి

కంకిగాఁ గోకలు మోచి కాచుకుండితి

వుంకువ నలమేల్మంగ నురమెక్కించుకొంటివి

యింక శ్రీవేంకటేశ నీకేమిబాఁతి సతులు




# అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1127-1 సాళంగనాట సం: 21-152

పల్లవి: పట్టము గట్టితి వింక బ్రతుకరయ్యా

చిట్టకాలు లేవు మీకు శ్రీవేంకటేశుఁడా

చ 1: అలమేలుమంగకు సింహాసనము నీవురము

కలితహారములే సింగారపుదండలు

తొలఁకునీహస్తములే తోరణగంభములు

చెలిరాజ్యమే నీవు శ్రీవేంకటేశుఁడా

చ 2: పరగుతులసిదండ పచ్చతోరణ మాపెకు

మెరుఁగుఁ గౌస్తుభమణి మించుటద్దము

గరిమ నీసొబగులు కప్పములుఁ గానికలు

సిరులు నీకూరిములు శ్రీవేంకటేశుఁడా

చ 3: సంతతమైనవిందులు సారె నీమోవితేనెలు

వింతరతిభోగములు వినోదాలు

కొంత నియ్యారును బొడ్డు కుంచెయుఁ గాళాఁజి

చెంతల నన్నీ నమరె శ్రీవేంకటేశుఁడా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1127-2 పాడి సం: 21-153

పల్లవి: వేళగాదు సిగ్గులకు విచ్చనవిడింతే కాని

గోలతన మిపుడేలే కొంగువట్టీ నతఁడు

చ 1: తమకించినపుడే తతియాయ రతులకు

సుముఖుఁడైనపుడే సూటి మాటకు

చెమరించినపుడే చేఁతలకెల్లా లోను

కొమరెవేల లోఁగేవే కొంగువట్టీ నతఁడు

చ 2: అంటఁజూచినపుడే అద నట్టే నవ్వులకు

వెంటవచ్చినపుడే విందు మోవికి

నంటు సేసుకొన్నపుడే నయము కోరికలకు

దంటవు యేల కొంకేవే దక్కఁగొనీ నతఁడు

చ 3: ఆయములంటినప్పుడే అనువు నీపంతాలకు

చాయసేసుకొన్నపుడే చవి కాఁగిలి

యీయెడ నలమేల్మంగ ఇదిగో శ్రీవేంకటేశు-

నోయమ్మ కూడితివి నీవొడివట్టె నతఁడు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1127-3 బౌళి సం: 21-154

పల్లవి: ఏల యింతచలము యింతి నేను

తాలిమితో నుండఁగాను తమకించేనా

చ 1: మునుప నే నీకును మొక్కితి నే ననఁగానే

చెనకి చెనకి మరిఁ జేయివట్టేవా

పనివడి యిప్పుడిట్టె పంతమిచ్చితి ననఁగా

పెనఁగి చెలులచేతఁ బిలిపించేవా

చ 2: ఇదివో నే నీకును ఇచ్చకములాడఁగానే

పదిరి నావొడివట్టి పచ్చిసేసేవా

సదరాన నన్నిటికి సమ్మతించి వుండఁగానే

వెదకి నన్నిందరిలో వింతసేసేవా

చ 3: తలవంచుకొని నీదగ్గర నే నుండఁగానే

నలినలిగా నన్ను నవ్వించేవా

కలసి నే నుండఁగానే గక్కన శ్రీవేంకటేశ

తళుకుఁజూపుసన్నల తమి రేఁచేవా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1127-4 ఆహిరి సం: 21-155

పల్లవి: ఊరకుండుమనవే వువిదలాల విభుని

నేరనివాఁడా తాను నేనే యెఱుఁగుదునే

చ 1: చిగురుఁజేతులఁ గావా చేవకొనగోళ్లున్నవి

మొగిచి యందులకేల మొక్కీనే నాకు

మొగమోటమునఁ గాదా మునుకొనె వలపులు

నగవులు నగి యేల నయాలు చూపీనే

చ 2: మాఁటలలోనే కావా మర్మములెల్లా నుండేవి

మాఁటపట్టు సారె నేల మరీ నిచ్చీనే

గాఁటపుఁజూపులఁ గావా కంతునివాఁడిములెల్లా

ఆఁటదాన నాపైనేల అల్లార్చి చూచీనే

చ 3: చిక్కనిసిగ్గులే కావి చిత్తములఁ గరఁచేవి

పెక్కుమారు లవియేల పెడరేఁచీనే

ఇక్కువ శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్నుఁ గూడె

వక్కణతో నివి యేల వర్ణించీనే





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1127-5 మాళవి సం: 21-156**

**పల్లవి: కాంతలమనసులోని కఱవు వాసె**

**అంతటా జవ్వనమనేఆమని కాలమున**

**చ 1: వేవేలు గొల్లెతలపై వెరవెట్టి వలపులు**

**నీవు లూడ్చి కొలనిలో నీరుగట్టెను**

**వేవేలు దొడ్లకాడ వెలుఁగులు వెట్టి పెట్టి**

**కేవల మితనికి నాఁగేలూ వొకటే**

**చ 2: దుండగపుగోళ్లను దోమటిఁ గలుపుదీసి**

**బండిగట్టె రుకుమిణిభామపెండ్లికి**

**కొండలంతలుచన్నులఁ గొటారుకుప్పలు వేసె**

**పండెఁ గట్టుకొమ్మనవ పైఁడి చీర వరచి**

**చ 3: పచ్చిమోవికణఁజాల బండారించి ముద్రవెట్టె**

**రచ్చలఁ గాఁగిళ్లఁ గాఁపురాలు సేసెను**

**యిచ్చట శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నేరుపరి**

**కుచ్చి కుచ్చి రతిసేయఁ గొండవేలూ నాయను**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1127-6 హిందోళం సం: 21-157

పల్లవి: ఏఁటికి దోసాలుగట్టే వింతలో మాకు

పాటించి నాకుఁగా నేలో భ్రమసేవుగాక

చ 1: నచ్చి నీమాటలకెల్ల నాఁడే నే లోఁగాన

ముచ్చట దీరక నీవే మొక్కేవుగాక

యిచ్చకురాలనై నీకు నే నేమయినాఁ జేయనా

పచ్చిగా వలచి వొడఁబరచేవుగాక

చ 2: కన్నులఁ జూచినప్పుడే కరఁగదా నామనసు

చన్నులంటి చొక్కుఁజూపు చల్లేవుగాక

సన్న సేసినంతలోనే సరసములాడనా

చిన్నికొనగోరు నాపైఁ జిమ్మేవుగాక

చ 3: కందువకు రాఁగానే కాఁగిలించనా నిన్ను

చెంది ప్రియా లప్పటినిఁ జెప్పేవుగాక

విందువలె నన్నిటా శ్రీవేంకటేశ కూడితివి

మందెమేళాలు మీరేనా మన్నించేవుగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1128-1 లలిత సం: 21-158

పల్లవి: సిగ్గువడి యిందాఁకా చెలవుఁడు నన్ను దూరె

బగ్గన మమ్మింతేసి పచ్చిసేతురా

చ 1: అలవోకగా నీతో నాడుకొన్నమాటలెల్ల

వెలయఁగ నాతనితో విన్నవింతురా

చెలివంటా నాతనిచేఁత లిటువంటివంటే

చలపట్టి యంతలోనే సాదింతురా

చ 2: నగుతా నాతనిరచనలు నే సందేహించితే

సొగసి యాతనిమేను సోదింతురా

పగటున నావేళ పంతాలు నే మెరసితే

తగవు విడిచి మీరు తమకింతురా

చ 3: వద్దనుండి నే నాతనివలపులు వొగడితే

కొద్దిమీరి వెంగెములు కొనవేతురా

వొద్దికై శ్రీవేంకటేశుఁ డున్నతి నన్నుఁ గూడె

సుద్దులు తొల్లితి వింతే సూడువట్టుదురా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1128-2 భైరవి సం: 21-159

పల్లవి: ఎవ్వరు నేమి చెప్పేరు ఇంటికి రావయ్యా నీవు

పువ్వుఁను బిందెయువలె పొసఁగివున్నారము

చ 1: మనసునఁబట్టితే మరి దేహము గరఁగు

తనువు సోఁకితేనే చిత్తము గరఁగు

వొనరి తలఁచుకొంటే వొకటొకటికి లంకె

మనలోన నట్లానేకా మరిగివున్నారము

చ 2: మొగము చూచితేనే మొలకనవ్వులు వుట్టు

నగవుఁజూపులనే మొగమోడును

తగి యారెంటికి సరిదాఁకి యుండునట్లానే

బిగువుఁగాఁగిళ్ల నిట్టె బెరసివున్నారము

చ 3: సేసచేయి చాఁచితేనే చిమ్మిరేఁగుఁ దమకము

ఆసఁ దమకము చేతికందిచ్చు రతి

తాసువంటి వివి రెండు దక్కెను శ్రీవేంకటేశ

వాసితోఁ గూడితి మింత వలచివున్నారము





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1128-3 ఆహిరి సం: 21-160**

**పల్లవి: ఎప్పుడును దమవార మేడనున్నాను**

**తప్పులు వట్టక మమ్ము దయఁ జూడుమనవే**

**చ 1: పేటలైనగొల్లెతలు పిప్పిసేసి కొసరిన-**

**నాటివాఁడే కాఁడా తననవ్వు లేఁటివే**

**పాటించి యెనమండ్రు వట్టపుదేవుళ్లకింది-**

**మాటువాడు తానాడేమాట లేఁటివే**

**చ 2: జంగిలి పదారువేలఁ జప్పుచారు సేసినట్టి-**

**యెంగిలిపొత్తులవాఁడు యేమి చూచీనే**

**అంగడి గందపుసతి అనుభవించి వేసిన-**

**సింగారము తానేమి చేయివట్టీనే**

**చ 3: చయ్యన మధురలోని సతులచన్నుల మీఁది-**

**పయ్యద తా మమునేల భ్రమఇంచీనే**

**వొయ్యనే శ్రీవేంకటేశుఁడుద మెక్కించుక నాకు-**

**నియ్యరానిచన విచ్చె నెదురేడదే**




# అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1128-4 దేసాళం సం: 21-161

పల్లవి: ఊరకున్న వారితోడ వూరు నోప దెలుఁగవా
చేరి నాతో సుద్దులెల్లాఁ జెప్పేవుగాక

చ 1: వద్దని నీతో నేను వాదులడిచేనా
గద్దించి యప్పటి నిన్నుఁ గాదనేనా
తిద్ది నీగుణాలు నేఁడు తీరుచవచ్చేనా
వొద్దనే నీ వెట్టుండినా నుండివిగాక

చ 2: చలపట్టి నిను నేను సాదించవచ్చేనా
కలవి లేనివి తారుకాణించేనా
నిలువుకునిలువే నిన్ను నేరాలెంచేనా
వెలి నెంతనవ్వినా నవ్వితివిగాక

చ 3: పంతమాడి సారె సారెఁ బంగించదొరకొనేనా
వంతులకు నంతేసి వాసిపట్టేనా
యింతలో శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను
యెంత చనవిచ్చినాను ఇచ్చేవుగాక





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1128-5 రామక్రియ సం: 21-162

పల్లవి: కన్నదే కంటి గురుతుగాఁ గైకొనేవు

యిన్నిటాఁ గలపుకోలు ఇది నీకే కలదు

చ 1: పొరుగాపె నీతోను పోరచి మాటాడితేను

పరగ నంతలోఁ గొంగువట్టేవు నీవు

సరుగ వేరొకసతి సాకిరి చెప్పవచ్చితే

సరసమాడుతా నాపెచన్ను లంటేవు

చ 2: వాడవనిత నీతోను వట్టినవ్వు నవ్వితేను

జీడివలె నంటుకొని చేయివట్టేవు

ఆడనుండి వేరొక్కతె పాడా దిద్దవచ్చితేను

మేడెపుగాగిట నించి మెచ్చు మెచ్చేవు

చ 3: అంగడినున్న కాంత అట్టె నిన్నుఁ జూచితేను

యెంగిలిసేసి మోవి యెలయించేవు

చెంగట నుండి నేను శ్రీవేంకటేశ్వర నీది

సంగతి గాదంటేను సరిగాఁ గూడి మొక్కేవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1128-6 నాదనామక్రియ సం: 21-163

పల్లవి: నే మేమిసేతుమే నీవలనే యింతేశాయ

దోమటి వే సింగారాలు దొమ్మిసేసెఁ గదవే

చ 1: కూరిమిగొసరఁబోతే కొప్పు గడువెడజారె

సారెఁ గొప్పు వెట్టఁబోతే చన్నులు గానఁగవచ్చె

కోరి పయ్యదిడఁబోతే కుచ్చల వదలె నిదె

దారదప్పి జవ్వనమే తడఁబడీఁ గదవే

చ 2: సిగ్గులువడఁగఁబోతే సెలవినవ్వుల రేఁగె

సిగ్గులనవ్వు దాఁచితే నిట్టూర్పు రేఁగె

అగ్గపుటూర్పు లాఁగితే అలపులు గడునిండె

తగ్గన నీవలపులే తడఁబడీఁగదవే

చ 3: చేయి చాఁచఁబోతేను శ్రీవేంకటేశ్వరుఁ దాఁకె

కాయమంటి కాఁగిటనే కళలు రేఁగె

తోయపుటాకళలకు దొరకొనె వేడుకలు

చాయల నీచెనకులే సందడించీఁ గదవే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1129-1 గౌళ సం: 21-164

పల్లవి: తెలిసినదే నేము తేటతెల్లమిగా నిది

అలవాటు సేసేవు అందుకేమిలేవయ్యా

చ 1: మంతనాన నతులకు మాయింటికాడనే

బంతిఁ బెట్టి వలపులు పంచిపెట్టేవు

యింతకోపినాఁటదైతే యియ్యకొనీఁగాక మమ్ము

అంత యేల లోఁచేవు అందుకేమిలేవయ్యా

చ 2: యిక్కువ నాపానుపుపై యేడవారిఁ దెచ్చి పెట్టి

వెక్కపుటాసలెల్ల వెదవెట్టేవు

అక్కరగలదియైతే నందుకొనీ యీచేఁత

అక్కుమీఁదికిఁ దీసే వందుకేమిలేవయ్యా

చ 3: వాసులనీకాఁగిటిలో వారివీరిరతులెల్లా

బేసబెల్లితనానను పేరుకొనేవు

వేసరక నన్నిట్టె శ్రీవేంకటేశ కూడితివి

ఆసుద్దులే యీసుద్దులు అందుకేమిలేవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1129-2 లలిత సం: 21-165

పల్లవి: నన్ను నేల సొలసేవు నగితి నింతే యిందుకు

అన్నిటా నీలాగులకు నడ్డము రాఁగలనా

చ 1: కంచము మోవి పొత్తుల కాంతనే యిందరు నీకు

మంచముపై కెక్కినట్టు మందెమేళాలు

యెంచి నేఁడు మానుమంటే యేలమానునిఁక నిన్ను

వంచుక యేమి సేసినా వారివారి పుణ్యము

చ 2: పిడికిటిసేసతోడి పేరంటాండ్లే ఇందరును

వొడలుసోఁకినయట్టి వుద్దండములు

జడియ నీమొగమోట సారె నీకు నేల మాను

వడిబెట్టి నిన్నుఁ బొందే వారివారి పుణ్యము

చ 3: చలములరతికేలిసవతులే ఇందరును

ములుగోరిసరసాలమొగమోటాలు

యెలమి శ్రీవేంకటేశ యెనసితి విదె నన్ను

వలపించి చొక్కించినవారివారి పుణ్యము



 **అన్నమయ్య**  **సంకీర్తనలు** 

**శృ.రేకు: 1129-3 నాట సం: 21-166**

**పల్లవి: ఇందుకేపో నీపైఁ గోప మేడనుండైనా వచ్చు**

**యెందుండి విచ్చేసితి వేమోయి నీవు**

**చ 1: చెంత మోము చూడఁగానే చేయివట్టి తీసేవు**

**యెంతదయలేనివాఁడ వేమోయి నీవు**

**చింతతో నే నుండఁగాను చిమ్మేవు నీవేడుకలు**

**యెంతకక్కూర్తి కాఁడ వేమోయి నీవు**

**చ 2: ముంచి కన్నీరు జాఱఁగ ముట్టేవు నాచనుదోయి**

**ఇచుంక తగవెఱఁగ వేమోయి నీవు**

**మించె నాకైతేఁ జలము మెరసీ నీకైతే నవ్వు**

**యెంచవు కూళతనము యేమోయి నీవు**

**చ 3: అవ్వలిమోమై వుండఁగా అట్టె కాఁగిటఁ గూడేవు**

**యెవ్వతె నీకు నేర్పె నేమోయి నీవు**

**రవ్వగా శ్రీవేంకటేశ రతి నన్నుఁ జొక్కించి**

**యివ్వలిమోము సేసితి వేమోయి నీవు**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1129-4 దేసాళం సం: 21-167

పల్లవి: కోరి నిన్ను దెఱఁగక కోపగించుకొంటిఁగాక

నేరు పెంతలేకుండితే నీవు నన్నంటుదువా

చ 1: అంది వాదులకు రావు ఆఱడిఁబెట్టుకొనవు

యెందుకైనా నౌదువు ఇది మేలయ్యా

అందగాఁడ విటువంటిఆతఁడవుగాకుండితే

చెంది మున్ను సేసినట్టిచేఁతలెల్లఁ జెల్లునా

చ 2: వోపనన వేమిటికి వొద్ద నెవ్వరుండినాను

యేపనైనాఁ జేసేవు ఇది మేలయ్య

వైపరివి ఇటువంటివాఁడవు గాకుండితేను

రాపుల నిన్నిందరును రసికుఁడవందురా

చ 3: వట్టిసిగ్గులు వడవు వాసులెంచవు నాయెడ

యిట్టె కాఁగిటఁ గూడితి విది మేలయ్య

ముట్టి శ్రీవేంకటేశుఁడ మోహ మింత లేకుండితే

జట్టిగొని నీమేలు సతులెల్ల మెత్తురా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1129-5 పాడి సం: 21-168

పల్లవి: ఎప్పుడు నీవారమే యేడనుండినా

నెప్పునఁగట్టినపుస్తె నీకుఁగానే కాదా

చ 1: పిప్పిగట్ట నేవేల ప్రియములు చెప్పేవు

అప్పుడే నే జెప్పెంపనా ఆకెతోను

చిప్పిల నీవంతయేల చేయివట్టి పెనఁగేవు

చప్పనాయ వలపులు చాలునని యననా

చ 2: జిడ్డుదేర నీవేల చేతులు పైఁజాఁచేవు

గడ్డెము వొద్దని నీకుఁ గమ్మ లంపనా

వొడ్డుకోఁగా నీవేల వూరకే కాఁగిలించేవు

జడ్డుపడెఁ దమకము సటలేఁటికననా

చ 3: పచ్చిగా నీవింత యేల పైపై నన్నుఁ గూడితివి

కచ్చుపెట్టి వుంకువ వుంగర మంపనా

మెచ్చి శ్రీవేంకటేశుఁడ మీరి నన్నుఁ బొగడేవు

విచ్చనవిడాయ నీకు వెఱపేఁటికననా



శృ.రేకు: 1129-6 హిందోళవసంతం సం: 21-169

పల్లవి: వద్దువద్దు అంతేసి వైతాళాలు

వుద్దండాలు సేయఁబోతే వుట్టిలేక వూఁగవా

చ 1: సిగ్గువడి నే నీచేతికి లోనైతినంటా

వెగ్గళించి యెమ్మెలేల వెదచల్లేవు

అగ్గలమైన నే నిన్ను అందుకు మీఱఁజూచితే

బెగ్గలి మచ్చరములే పెరుగుతానుండవే

చ 2: మొగమోటతోడ నే నీముందర నుందాననంటా

నగుతా నీసుద్దులేల నారువోసేవు

మగటిమి నే నీకు మారుకు మారు సేసితే

చిగిరించి పంతములే చిమ్మిరేఁగవా

చ 3: ఆసపడి నేను నీయాలనై వుందాననంటా

వాసులకు నన్నునేల వలఁబెట్టేవు

వేసరక నేనే శ్రీవేంకటేశ కూడితిని

తాసువంటివలపులు తారుమారు గావా

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1130-1 సామంతం సం: 21-170

పల్లవి: మీరు నేరుతురు మీఁద మిక్కిలి గలితే

వారివీరి నడిగితే వంకలొత్తేరా

చ 1: చెప్పరాని చేఁతకు మీచిత్తములే గురిగాక

ఇప్పుడు మాకేల పెట్టి రింతేశానలు

తప్పులు దిద్దేమా మిమ్ము దండనుండేచెలులము

ముప్పిరి వేఁడుకొంటానే మొక్కేవారము

చ 2: గుట్టుతో మీపంతాలకు కొనగోళ్లే గురిగాక

బెట్టి మమ్మేల తోడుగాఁ బిలిచేరు

రట్టుసేసేమా మిమ్ము రచ్చల నిచ్చకులము

చుట్టపువరుసలే చూపేవారము

చ 3: నిండుమీకాఁగిళ్లకు నేరుపులే గురిగాక

దండివూడిగేలమాతోఁ దలపోఁతురా

కొండలశ్రీవేంకటేశ కోమలిఁ గూడితి విట్టె

మెండుతీసేయా మిమ్ము మెచ్చేవారము





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1130-2 భైరవి సం: 21-171**

**పల్లవి: ఏఁటికి నెగ్గులువట్టే విందుకు నీవు**

**కూటముగలుగుచోట గుటు మేలుగాదా**

**చ 1: తెగనాడరాదు గాక తెలిసిన ప లకు**

**నగరాదా నిన్నుఁజూచి నాకుఁ గోఁత్రైనా**

**జగడించవద్దుగాక చనవుగలుగుచోట**

**సగముచూపులు చూచి సాదించరాదా**

**చ 2: పదరఁగరాదుగాక పాయరానిచోటికి**

**వొదిగి నివ్వెరగుతో నుండఁగరాదా**

**అదలించవద్దుగాక ఆసలెల్లఁ బెట్టుకోఁగ**

**వదలక అంతేశాల వద్దనఁగరాదా**

**చ 3: గుఱి సేయరాదుగాక కూడినకూటములకు**

**చెఱఁగువట్టి బలిమి సేయఁగరాదా**

**యెఱిఁగి శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను**

**తఱి దూరవద్దుగాక తలపించరాదా**





# అన్నమయ్య



# సంకీర్తనలు



**శృ.రేకు: 1130-3 ముఖారి సం: 21-172**

**పల్లవి: ఆయనాయఁ బదపద అట్టె తన్ను రమ్మనవే**

**దాయగాఁ డెట్టైన నాడు తనకేమి యనవే**

**చ 1: పడఁతులనెల్లఁ గూడి బమ్మచారి ననుకొనె**

**జడియక తాను సత్యసందుఁడుగదె**

**బడి బడి మాతోను బాసలు సేయక తాను**

**విడిచినా అటువంటివియే కాదా ఇఁకను**

**చ 2: పనులన్నిటేఁ గాచి పట్టపురాజాయ తాను**

**దెసల నీపనులకు దేవరగదే**

**యెసఁగి మమ్మెల్ల నిట్టె యేలక తా మానీనా**

**కొసరితే ఇక్కడా నాగుణమేకదే**

**చ 3: వెన్నలెల్లా దొంగిలి శ్రీవేంకటేశుఁడైనాడు**

**వున్నతి దనకుఁ గలవోజేకదే**

**మన్నించి నన్నిట్టె కూడె మనసు తాఁబట్టైనా**

**యెన్నికలు మాయెడకు యిట్టి వేకదవే**





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1130-4 కాంబోది సం: 21-173**

**పల్లవి: కానీవయ్య అందుకేమి కనుకొనే మన్నియును**

**తేనెలమామోవితీపు దిమ్ము రేఁచును**

**చ 1: నగినట్లనె వుండు నాతోడి పొందులు**

**చిగురించఁ జిగురించ చేఁగలెక్కును**

**యెగసక్యాలై యుండు ఇప్పుడు నేనన్నమాట**

**తెగరాని ఆసలతో తీగెసాగును**

**చ 2: దక్కినట్లనే వుండు తతి నాతో చేఁతలెల్ల**

**చిక్కినప్పుడు చేతికి జిడ్డుదేరును**

**లెక్కసేయనట్లుండ్లు లేఁతమాసరసాలు**

**వక్కణతో వలపు పూవక పూచును**

**చ 3: పట్టినట్లనే వుండు పై పై మాతో పంతములు**

**మట్టుపెట్టి ముయికి ముయి మళ్లించును**

**ఇట్టె శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను**

**పట్టినచలములెల్లా పంటవండును**





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1130-5 కేదారగౌళ సం: 21-174**

**పల్లవి: అన్నియుఁ జక్కనయ్యని అందుకేమిలేవయ్య**

**నున్ననివలసే కాదా నూఁగులెక్కెఁగాక**

**చ 1: సారె నీవాడె వెల్లా చల్లనిమాటనే కావా**

**వేరేసతులఁ గూడఁగ వేఁడాయఁ గాక**

**మేరతో నవ్వేదెల్లా మించువెన్నెలలే కావా**

**యీరనపువారివల్ల యెండలాయ గాక**

**చ 2: మక్కువ నీనిలువెల్లా మంచితనమే కాదా**

**వెక్కసానఁ దిరుగఁగ వెట్టాయఁగాక**

**పక్కున నీమోవెల్లాఁ బచ్చితేనెలే కావా**

**వుక్కపలుసోఁకులను వొగరాయఁగాక**

**చ 3: కందువ నీకాఁగిలెల్లా కామనిధానమే కాదా**

**అందునిందు నంటుముట్టు లాయఁగాక**

**విందువలె నన్ను శ్రీవేంకటేశ కూడితివి**

**సందడి నన్నిటివల్లాఁ జవులాయఁగాక**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1130-6 దేశి సం: 21-175

పల్లవి: ఆఱడిఁ బెట్టక మాతో నానతీవయ్యా

మీఱరాదు ఇచ్చకపుమీవారమే నేము

చ 1: చుట్టరికముసేసుక సుద్దులెల్లఁ జెప్పేవు

నెట్టన నీరచలు నిజమా యిది

చెట్టాపట్టు వట్టుక సిగ్గులు విడిపించేవు

నట్టపడుమ నివెల్లా నమ్మవచ్చునా

చ 2: సారె సారె నియ్యరానిచనవులెల్లా నిచ్చేవు

కోరి యివెల్లా నియ్యకోలవునా

పేరడిగా ననుపులే పెనఁచేవు నాతోను

సారెకు విలువలెనే సతములయ్యవా

చ 3: పరపుపైఁ బవళించి బాసలెల్లాఁ జేసేవు

అరనే నింకొక్కమాఁటు అవునా యిది

యిరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె

మురిపెముతోడుతను మొక్కుదునా యిందుకు



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1131-1 శ్రీరాగం సం: 21-176

పల్లవి: ఇంకనేల రావమ్మ ఇన్నియుఁ జెల్లెను నీకు

సుంకునీమతకములు చూపి చెప్పఁగలనా

చ 1: గొందినున్న నీమేని గురుతులు చూచేనంటే

గందము వూసినమీఁదఁ గానరాదుగా

కందువ నీమోములోనికళలు దెలిసేనంటే

సందడినవ్వులలోన చక్కఁగా నణఁగెఁగా

చ 2: నిట్టూరుపులోనైన నిన్ను నేర్పరచేనంటే

జట్టిగొని నాముందర సాముసేసేవు

చిట్టకపుఁబులకలు చెక్కుల నరసేనంటే

గట్టిగా నన్నిట్టె బిగ్గఁ గాఁగిలించుకొంటివి

చ 3: దిట్టనై నీకనుచూపుతేటలు దెలిసేనంటే

గుట్టున నన్ను రతులఁ గూడితి విట్టె

నెట్టన శ్రీవేంకటేశ నిన్ను నే నడిగేనంటే

రట్టడితనాల నింత రచ్చలకెక్కితివి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1131-2 ముఖారి సం: 21-177

పల్లవి: ఇందుకుఁగా నీవేల యెమ్మెలాడేవు

అందరిముందర నాపె నాఅడిఁబెట్టెదరా

చ 1: పడఁతికి వయసనేబలుగర్వ మొకటి

కడుఁజక్కఁదనములగర్వ మొకటి

బెడిదంపునిన్నువలపించినగర్వ మొకటి

జడియఁగ నీతో రాజసము చూపఁదగదా

చ 2: సరిఁ గొండలంతేసిచన్నులసంపదొకటి

సరవిఁ గళలునిండుసంప దొకటి

గరిమతో మేనిసింగారపునంప దొకటి

దొరతనమే నీవద్ద తోడుచూపఁదగదా

చ 3: చనవునీవిచ్చినట్టి సామ్రాజ్య మొకటి

మనికై నమదనసామ్రాజ్య మొకటి

యెనసితివి శ్రీవేంకటేశ యింతి నింతలోనె

వెనుకొని నీవలెనే విఱ్ఱవీఁగఁదగదా




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1131-3 సామవరాళి సం: 21-178

పల్లవి: ఎట్టున్నదో నీమనసు యెఱఁగ నేను

వెట్టి కొసరులు నీపై వేయఁగవచ్చేనా

చ 1: అప్పుడు నీవాడినట్టి ఆమాఁటపట్టుకే, మోవి

పిప్పిగట్ట సారె సారెఁ బెనఁగేఁగాక

వుప్పతించి వొలసియునొల్లనివల పెప్పుడు

చప్పనే కాదా నిన్ను సాదించవచ్చేనా

చ 2: మచ్చిక నీవు మొదలమన్నించినమన్ననకు

చెచ్చెర నీకొలువు సేసేఁగాక

ముచ్చటదీరఁగ నీకు మొగచాటైనమాఁటలు

తుచ్చములే కావా నీపై దొరలించేనా

చ 3: గక్కున నన్నుఁ గాఁగిట కాఁగిలించినందుకే

లక్కవలె నిన్ను నేఁ గలసితిఁగాక

యిక్కువ శ్రీవేంకటేశ యింతేసి సేసినందుకు

చొక్కపుమేలే యింకా సోదించేనా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1131-4 మంగళకౌసిక సం: 21-179

పల్లవి: ఏలయ్య మా కంతేసియెమ్మెలు నీతో

నాలావుకలిములు నన్ను నీవెఱఁగవా

చ 1: పంతము నీతో నాడేపలుకులవారమా

వంతుకు నీసేవసేసేవారముగాక

జంతలవలెను నిన్ను సాదించేవారమా

దొంతిఁ గొంగువట్టితేను తోసేవారముగాక

చ 2: అచ్చలాన నీతోడ నలిగేటి వారమా

వచ్చి తలవంచుకుండేవారముగాక

కొచ్చి కొచ్చి నీతోడ కొపగించేవారమా

తుచ్చపుగోర నూఁదితే దూరేవారముగాక

చ 3: చేరి నన్నుఁ గూడఁగాను చేయివట్టేవారమా

వారించి సిగ్గులు వడేవారముగాక

యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె

నేరమివట్టేవారమా నీవారముగాక





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1131-5 బౌళి సం: 21-180

పల్లవి: ఊరకే కోపగించకు వోహో నీవు

కారణములేనివాదు కాంతకు లేదు

చ 1: నెపములేక నిన్ను నెలఁత మాటాడీనా

వుపమించుకొనలేక వుసురనేవు

నిపుణతఁ దలఁచుకొని నీవు మఱచితివేమో

కపటము లే దాపె కల్లలాడదు

చ 2: నీవుసేయనిపనులు నింద నీపై మోపీనా

భావించలేక యెగ్గులుపట్టనేఁటికి

చెవదేరఁ బరాకుసేసితివేమో నీవు

వేవేలకు నాపె కవివేకము లేదు

చ 3: చవులు నీవు చూపక చనవులు మెరసీనా

యివల సెలవినవ్వు యేల దాఁచేవు

రవళి శ్రీవేంకటేశ రతి సిగ్గువడేవేమో

కవగూడ నాపె నిన్నేగతిఁ బాయదు









శృ.రేకు: 1131-6 నాదనామక్రియ సం: 21-181

పల్లవి: ఎటువలెఁ జేసితివో యెఱఁగ మెన్నఁడును

ఘటియించవయ్యా మాతో కందము నీసుద్దులు

చ 1: పూసినకస్తూరి పూఁత పొంచినట్టినడురేయి

వోసరించి మాయధర ముట్టిపై పాలు

ఆసపడి గొల్లయిండ్ల నల్లఁవాడు సేసినట్లు

సేసి చూపవయ్య మాకు చిత్రము నీసుద్దులు

చ 2: అదె మాసెలవినవ్వు యమునలోని వెన్నెల

చదురుసరసాలు రాసక్రీడలు

తుదిముట్ట గొల్లెతల తొల్లి నీవు సేసినట్లు

యిదె మాతోఁ జేయవయ్య యెట్టివో నీసుద్దులు

చ 3: ఇక్కువ బృందావనము ఇచ్చట మాజవ్వనము

చక్కనిసతుల పొందుసరి నాపొందు

చిక్కి శ్రీవేంకటేశ్వర చిన్ననాఁడు గొల్లెతల

చొక్కించినట్టె చొక్కించు చూతము నీసుద్దులు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1132-1 దేశాక్షి సం: 21-182

పల్లవి: దేవుఁడు దేవియు వారే తెరవేసితిమి మన-

మీవల నుందము మరి యేమీ ననవలదు

చ 1: మంతనములే సుమ్మీ మనసులలోపలి-

వింతలైనసిగ్గులెల్ల విడిపించేవి

దొంతులైన కోరికలే తోడఁదోడఁ దిరిగాడి

సంతతపువెఱపుల చలివాపేవి

చ 2: పాయపుమదాలే సుమ్మీ పలుకులు వొనగూర్చి

బాయిటనుండే వొడఁబాటు సేసేవి

చాయలసరసములే నందులు గొందులు దూరి

కాయము కాయము నంటఁ గాఁగిలింపించేవి

చ 3: చూపులుఁ జూపులే సుమ్మీ సూడువట్టి మర్మములు

రాపులఁ దలచిఁనట్టు రతులిచ్చేవి

యేపుల శ్రీవేంకటేశుఁ డీకెయుఁ గూడి రిద్దరు

దాపులైనవలపులే తమిరేఁచేవి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1132-2 ధన్నాసి సం: 21-183

పల్లవి: వలచుటే దోసమా వనిత నీ కాతఁడు

నలువంక మరి యేఁటినవ్వులు నవ్వేవే

చ 1: పంతమెల్ల నీమాటపట్టులోననే వున్నది

చింతలెల్ల నీచెక్కుచేత నున్నవి

వింతలిన్నియును నీనివ్వెరుగులలో నున్నవి

యెంతకెంత పతి నింకా యేఁటికి దూరేవే

చ 2: బిగువెల్ల నిపుడు నీపెదవులపై నున్నది

తెగువలు నీకన్నులతేట నున్నవి

అగడింతా నీపాలయలుకలలో నున్నది

యెగసక్కె లాతని నేఁటికి నాడేవే

చ 3: గబ్బితనమెల్లాను నీకాఁగిటిలోనే వున్నది

నిబ్బరము నీవుండేటినీటులో నున్నది

అబ్బురమై శ్రీవేంకటాధీశుఁడు నిన్నుఁ గూడె

వుబ్బున నీతనికెంత వొరటులు చూపేవే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1132-3 కాంబోది సం: 21-184

పల్లవి: ఏమి సేతు నమ్మలాల యిదివో నాకాఁపిరము

కామించి వలపు పతికాఁగిలే కోరీని

చ 1: కాయమే కాఁకలఁ బొందీఁగానీ రమణునిఁ బాసి

పాయమే చిగురించీఁ బైపైనే

చేయి చెక్కిటిమీఁదఁ జింతలు రేఁచీఁగానీ

యేయెడఁ గనుచూపులు యెదురే చూచీని

చ 2: పనివూని పయ్యదే పైపై జారీఁగానీ

ఘనమైన చన్నులైతే గట్టులయ్యీని

గొనకొన్న విరహము కోపము వుట్టించీఁగానీ

ననుపుల సెలవులు నవ్వింపించీని

చ 3: గారవపునాకాఁగిలి కారాలు వుట్టించీఁగానీ

వూరేటిమోవితేనెలు వుట్టిపడీని

యీరీతి శ్రీవేంకటేశు డింతలో నన్నుఁ గలసె

తేరేటిమోముకళలు తెలివిసేసీని





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1132-4 వరాళి సం: 21-185**

**పల్లవి: నీకే తెలుసునయ్య నీవు సేసినచేఁతలు**

**కూకులువత్తులు సేసె గుట్టుతోనే సిగ్గులు**

**చ 1: పంతాలు నీతో నెరపి పఁడతి నిన్నిందరిలో**

**యింతేసిమాట లాడీ నెంతచనవో**

**వంతువరుసలవారు వాకిటఁ గాచుకుండఁగా**

**దొంతివెట్టీ నవ్వులెల్లా దొరతన మెట్టిదో**

**చ 2: అయాలాంటి చదురంగ మాడుదువు రమ్మంటా**

**యీయెడ నీచేయివట్టీ నెంతపగటో**

**బాయిటఁ జెలులతోడ పచారించి నీతోడ**

**దాయిగాఁగఁ బవళించీఁ దన కెంత చెల్లునో**

**చ 3: విచ్చనవిడిని మొక్కి వీడెము వేసుకొమ్మంటా**

**యిచ్చకము సేసీ నీకు నెంతనేరుపో**

**ఇచ్చట శ్రీవేంకటేశ ఇందరిఁ గూడినయట్టె**

**యెచ్చి కూడితివి తన కెంతమేలు చేరెనో**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1132-5 కాంబోది సం: 21-186

పల్లవి: నీ విన్నిటా ఘనుఁడవు నే నెఱఁగనా

యీవల నావల సుద్దులెల్ల నాకుఁ జెప్పేవు

చ 1: మంతనాన నేను నీమనసెల్లఁ గనుఁగొంటి

వింతలై నీమాటలెల్ల వేలుచుకొంటి

వంతులు వెట్టుక నీవలపెల్లఁ దెలిసితి

యెంతకెంత నీగుణము యేల మాకుఁ జెప్పేవు

చ 2: కడల నీవిద్యలు ఇక్కడనే విచారించితి

బడి నుండి నీలాగు భావించితి

వుడుగక నీతో నవ్వి వోరుపు విచారించితి

యెడలేక నీనేరుపు లేల నాకుఁ జెప్పేవు

చ 3: నిన్నుఁ గాఁగిటనే కూడి నెయ్యమెల్లాఁ జేకొంటి

చన్నుల నొత్తి నీమోవి చవిగొంటిని

యిన్నిటా శ్రీవేంకటేశ ఇచ్చకములు మెచ్చితి

యెన్నటి కిది గురుతు యేల నాకుఁ జెప్పేవు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1132-6 గౌళ సం: 21-187

పల్లవి: ఏల భేదాలుసేసేవు యేమి గట్టుకొంటివి

రేలునుఁ బగళ్లు యిద్దరికిఁ బొత్తు గాదా

చ 1: వావియల్లా నొకటే వరుస లెంచిచూచితే

నీవు మేనభావపు నే మఱఁదల

యీవల వలపునూ ఇద్దరి కొక్కటే నీవు

ఆవటించి మొగవాఁడ వాఁటదాన నేను

చ 2: మనసెల్లా నొక్కటే మదనకేలిలోన

వినయము నాది రతివెరగు నీది

ననుపెల్లా నొక్కటే నగవులలోపలి-

చెనకులు నీచేతివి సిగ్గులు నామేనివి

చ 3: కాఁగిలియు నొక్కటే కమ్మినభోగములోన

పాఁగినది నీమోవి ఆపసలు నావి

వీగక యిద్దరము శ్రీవేంకటేశ కూడితిమి

రాఁగినతమకములరచన లిదరివి





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1133-1 భూపాళం సం: 21-188

పల్లవి: కన్నులనే దీపావళి కడుఁజన్నుల యుగాది

యెన్నికలు నీకుఁ జేసె యియ్యకొనవయ్యా

చ 1: అంగన మోముకళల నట్టె పచ్చఁగా నలికి

ముంగిట నవ్వులనే ముద్దులు వెట్టె

ఇంగితపుచూపుననే యదురుకొనెఁ బండుగ

సంగడిఁ గూచుండవయ్య చక్కెరమోవి విందు

చ 2: కప్పినసిగ్గులనెల్లఁ గలవడములు గట్టె

ఇప్పుడె సరసముల నిచ్చె విడేలు

చిప్పిలుఁ జెమటలనే శిరసు మజ్జన మార్చె

కప్పెఁ బయ్యెద కట్నాలు గైకొనవయ్య నీవును

చ 3: అట్టె కాఁగిటఁ గావించె అంగరంగవైభవాలు

ముట్టినమీఁచెనకులు ముయికి ముయి

ఇట్టె శ్రీవేంకటేశ ఇంతి నిన్ను నిట్టె కూడె

గట్టిగాఁ జేకొనవయ్య కందువసోబనాలు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1133-2 దేశాక్షి సం: 21-189

పల్లవి: ఊరకుంటే నెఱఁగవు వొకటొకటాడేవు

నేరుపులమాబీరాలు నీవే యెఱుఁగవా

చ 1: చలము సాదించఁగాక చక్కెరనీ మోవియెల్ల

వులివచ్చి సేయనా వొక్కమాఁటే

బలిమి చూపఁగాక పంతపునీమేనెల్ల

కులికి నాకుచముల కుమ్మెలుగాఁ జేయనా

చ 2: బతిమి చెరుచఁగాక భ్రమయించి నీమనసు

వ్రతము వట్టించనా వలపులను

మితిమీఱఁగాక నీమిక్కు టపురతులలో

తతిగొని పాదమునఁ దాటించి నవ్వంచనా

చ 3: పంగించఁగాక నిన్ను పైకొని కూడి ఇప్పడు

యెంగిలిగాఁ జేయనా ఇన్నిటా నేఁడు

అంగవించి శ్రీవేంకటాధిప నన్నేలితివి

సంగతి నాచెమటల జలకమాడించనా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1133-3 ఆహిరి సం: 21-190

పల్లవి: ఏల సిబ్బితిపడేవు; యేమి సేసేది; నీవు

యేలిక విందరికైతే ఇంతలోనే తప్పెనా

చ 1: చెనకి నీమదిలోని సిగ్గులు వాపేకొరకే

ననుపుసేసుక నీతో నవ్వితి నేను

మనసు రంజిల్లఁజేసి మాటలాడేకొరకే

చనవుసేసుకొని సరుసఁ గూర్చుంటిని

చ 2: ముంచిననీమొగమోటములు దీరిచేకొరకే

వంచనతో నీయింటికి వచ్చితి నేను

కొంచిననీమేనియళుకులు మానిపేకొరకే

అంచెలఁ బైకొంటి నీకంటె ముందు నేను

చ 3: చేసిననీచేతఁలెల్లా జెల్లఁబెట్టేటికొరకే

మూసి దించి కాఁగిలించి మొక్కితి నీకు

వాసుల శ్రీవేంకటేశ వలపుఁరేఁచేకొరకే

రాసికెక్కి నీకిచ్చకురాల నైతి నేను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1133-4 శుద్ధవసంతం సం: 21-191

పల్లవి: నీపాలిటికి నాపె నిధియు నిధానము

చేపట్టి నేఁ డింతగాఁగ సేవసేసె నీకును

చ 1: ఇంతేసి వెంగములాడ నెవ్వతైనా నేర్చునా

పంతమాడి నీకొంగు పట్టనేర్చునా

వంత నిన్ను వలపించి వంచుకొననేర్చునా

ఇంత సేసి యాపెగాఁగా నీడేరించె నిన్నును

చ 2: పచ్చిగా నిన్నెవతైనా భ్రమయించనేర్చునా

రచ్చవేసి ఇందరిలో రవ్వసేసునా

ముచ్చటాడి నీచేతుల మొక్కించుకోనేరుచునా

యెచ్చి యాపెగాఁగా యీడేరించె నిన్నును

చ 3: కలసి నిన్నెవ్వతైనా కళలురేఁచనోపునా

చలివాపి నవ్వింపించి జాణఁ జేసునా

యెలమి శ్రీవేంకటేశ ఇంతలోనే నిన్నుఁ గూడె

బలిమి ని న్నా పెగాఁగా పనిగొనె నిన్నును




# అన్నమయ్య

# సంకీర్తనలు


శృ.రేకు: 1133-5 వేళావళి సం: 21-192

పల్లవి: మిక్కిలి విచ్చి చెప్పితే మేడిపంటిబోన మిది

తొక్కుమెట్టుసందడెల్ల తోదోపులే కావా

చ 1: చాయలకే మాటలాడి చనవులుమెఱసేవు

యీయెడఁ దెలుసునే మీకిద్దరికిని

నాయ మే మడిగేవే నన్ను నీ వింతటిలోనే

మాయదారిసుద్దులెల్ల మఱఁగులేకావా

చ 2: గిలిగింతనవ్వు నవ్వి కిందుమీఁదుఁ జూచేవు

నిలువుల నున్నవే మీనేరుపులెల్లా

మలసి మీసరితలు మాకేమి అప్పగించేరే

కొలఁదిలేనివలపు గుమితమే కాదా

చ 3: భావపురతిఁ గరఁగి పైఁ జేయివేసేవు

వావిరిఁ దేటపడె మీవగలెల్లను

శ్రీవేంకటేశుఁడు నీవు సిగ్గు లిందేల పడేరే

కూవలై వున్నవి మీగుట్లింతే కావా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1133-6 శ్రీరాగం సం: 21-193**

**పల్లవి: జవ్వనము పంటవండి సరి ముంగిటికి వచ్చె**

**యెవ్వరిమాటలు నేల యింతిఁ జేకొనవయ్యా**

**చ 1: తేటతెల్లమిగ నవ్వి తేనెగారేమాట లాడి**

**కాటుకకన్నులఁ జూచీ కాంత నిన్నును**

**వాఁటమాయ వలపులు వడ్డివారీ తమకము**

**యేఁటికి జోలిసేసేవు ఇంతిఁ జేకొనవయ్యా**

**చ 2: సరసము నీపైఁ జల్లి సన్న లిన్నియునుఁ జేసి**

**వరుసవంతులు వేఁడీ వనిత నిన్నును**

**సరవాయ కోరికలు చవులాయ వేడుకలు**

**యెరపు లింకానేల ఇంతిఁ జేకొనవయ్యా**

**చ 3: చెక్కు కొనగోళ్ల నొక్కి చేయివట్టి నినుఁ దీసి**

**గక్కనఁ గాఁగిలించెను కాంత నిన్నును**

**యిక్కువ శ్రీ వేంకటేశ యీకె నిన్నుఁ గూడి మెచ్చె**

**యిక్కడనే మేలుచేరె యింతిఁ జేకొనవయ్యా**





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1134-1 కురంజి సం: 21-194

పల్లవి: చెల్లుబడిగలవేళ సిగ్గువడవే నీవు

యెల్లవారిలో నీకు యెన్నికలు గావా

చ 1: తగవరిమాఁటలు తతిఁ జూపులతేటలు

నిడిడి నీవే లెస్స నేరిచితివే

జగడాలడిచేవేమే సవతులతోనెల్ల

మొగుఁడు చూడఁగ నీకు మురిపెముగాదా

చ 2: సారెఁ జాఁచేచేతులు జంకెనలరీతులు

నీరపమాయఁ గనక నేరిచితివే

బీరము లాడేవేమే పెద్దపెద్దయెలుఁగుల

యీరీతిఁ బతిముందర యెమ్మెలు గావా

చ 3: బచ్చెననీరవ్వలు పకపకనీనవ్వులు

నిచ్చలు నిచ్చలు నీవే నేరిచితివే

యిచ్చట శ్రీవేంకటేశు నెనసితి విఁకనేమే

గచ్చు లాతనివొద్ద ఘనతలు గావా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1134-2 శంకరాభరణం సం: 21-195

పల్లవి: నీవే ఆనతియ్యవయ్య నీచెప్పినట్టు సేసే

భావించి రెంటిఁకి గాక భ్రమసివుందానను

చ 1: కొచ్చి కొచ్చి నే నిన్నుఁ గొసరఁగఁబోతేను

రచ్చలలోని సతులు రట్టడందురు

వొొచ్చెములు నిన్నెంచక వూరకే నే నుండితేను

యిచ్చకురాలు మరేమీ నెఱఁగదందురు

చ 2: జిగి నిన్ను రమ్మంటాఁ జేయివట్టి తీసితేను

మగవాని నింతసేసె మంకుదందురు

వెగటులేక నిన్ను విచ్చనవిడి సేసితే

అగపడె నిది యెంత అధమురాలందురు

చ 3: వేవేలుగా నీకు వినయాలు సేసితేను

చేవదేర మాయదారిచేఁత దందురు

శ్రీవేంకటేశ నన్నుఁ జేకొని కూడితి విట్టె

నీవురముపై నుండఁగ నీవేనందురు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1134-3 ధన్నాసి సం: 21-196

పల్లవి: ఈఁతడు నీవసమాయ నిఁక నెన్నఁడు

చేతులార వూడిగాలు సేయవమ్మ ఇపుడు

చ 1: నిన్నే చూచీ నాఁతడు నీమొకమై యున్నవాఁడు

విన్నపాలు సేయవమ్మ విభునితోను

నున్ననిమాఁట లాడఁగ నొసలెల్లఁ జెమరించె

తిన్ననికస్తూరిబొట్టు తిద్దవమ్మా దగ్గరి

చ 2: పూనిపట్టి నవ్వునవ్వి బుజముపైఁ జేయివేసె

కానిక లియ్యవమ్మా కాంతునికిని

ఆనుక చన్ను లొత్తఁగా నంగమెల్లాఁ జెమరించె

మేనిపైఁ గప్పఁగరాదా మెఱఁగునీపయ్యద

చ 3: గక్కున విడెమువెట్టి కాఁగిట నిన్నుఁ గూడె

యెక్కవమ్మా శ్రీవేంకటేశువురము

మొక్కులు నీవు మొక్కగా ముంచేను నిట్టూర్పులేల్లా

తొక్కవమ్మా పాదమున తోడుతనే పెండ్లి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1134-4 గౌళ సం: 21-197

పల్లవి: ఆతఁడు నీవు నేకమై అనుభవింతువుగాక
రీతిగాని చలములు రేఁచఁగారాదమ్మా

చ 1: మారుమాట లేమిటికి మంతనము లేమిటికి
కూరిమిగలవారికి కొన్నదే కోలు
నేరుపరివిభుఁడు నీవద్దికి వచ్చె
బీరపునీయలుకలు పెంచఁగరాదమ్మా

చ 2: మల్లాడనేమిటికి మాటలాడనేమిటికి
చెల్లుబడి గలితూ సేసినదే చేఁత
కొల్లలుగా నానలు వెట్టుకొని పతి నమ్మించె
పల్లదపు నీవెంగేలు పనికిరాదమ్మా

చ 3: సిగ్గువడనేమిటికి చెక్కుచేయి యేమిటికి
అగ్గమై మీలోనఁ బట్టినదే పంతము
వొగ్గి శ్రీవేంకటేశుఁడు వొనగూడె నిన్ను నిట్టె
వెగ్గళించి నిఁకనేమి వెలితిలేదమ్మా





# అన్నమయ్య



# సంకీర్తనలు



**శృ.రేకు: 1134-5 రామక్రియ సం: 21-198**

**పల్లవి: ఏమిసేయుమనేవయ్య యింకా నన్ను**

**నీమీఁదిప్రేమకు కరుణించఁగవద్దా**

**చ 1: చెప్పిననీ మాఁటలెల్లా చెవియొగ్గి వింటి నేను**

**కప్పురవిడె మియ్యఁగాఁ గైకొంటివి**

**అప్పటి నే నేమిసేతు నాఁటదాన నింతే నేను**

**తప్పునీపట్టుకు దయఁదలఁచవద్దా**

**చ 2: అంగవించి పిలువఁగ నట్టె దగ్గరివచ్చితి**

**కొంగువట్టి తియ్యఁగానే కూచుండితి**

**సంగ తానతియ్యవయ్య నన్నపుగొలదాన**

**చెంగట మొక్కేను కృపసేయఁగవద్దా**

**చ 3: నీవు గాఁగిలించఁగాను నీచేతఁకు లోనైతి**

**వావిసేసుక నవ్వితే వసమైతిని**

**శ్రీవేంకటేశ నీసేసపెండ్లిదాన నింతే**

**కేవలమై యిఁక కనికరించవద్దా**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1134-6 కన్నడగౌళ సం: 21-199

పల్లవి: ఇంతి నిన్ను దూరఁజాల దెఁత్తైనను

వంతువట్టె నీకు నేఁడు వలసినవూహలు

చ 1: సెలవుల నగఁగానే చెక్కలెల్లాఁ జెమరించె

వలవనిగాసిఁ బెట్టవద్దు ఆపెను

వలిపపయ్యదంటఁగా వాన గురిసెఁ గన్నీరు

తలఁచుకో నీచేసినతప్పులెల్లా నందును

చ 2: మాటలు నీవాడఁగానే మచ్చరపుఁజూపు లెచ్చె

వాఁటముగాఁ జండిపెట్టవద్దు ఆపెను

పాటించి వేఁడుకొనఁగా పలునిట్టూర్పు లు రేఁగె

యేఁటివో నీసరితలు యెఱుఁగుకో అందును

చ 3: ముంచి నీవు చూడఁగానే మోమునఁ గళలుదేరె

వంచనతోఁ గొనియాడవద్దు ఆపెను

అంచెల శ్రీవేంకటేశ అన్నిటాఁ దనిసే నాసె

నించి నీవే తెలుసుకో నీవుపకారములు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1135-1 శంకరాభరణం సం: 21-200

పల్లవి: ఇందుకుఁగాఁ గొస రిఁకనేలా

చెంది నీపనుపు సేసేమయ్యా

చ 1: పలుమారు నీతో బంతములాడఁగఁ

గలిగినవలపులకసి వోదు

చలమున నీతో జంకించఁగా

తలఁచినతలఁపులతహతహ వోదు

చ 2: వట్టికోపమున వాదులడువఁగా

వెట్టికి నెంజెరివియుఁ బోదు

దట్టించి నిన్నును తగవులఁ బెట్టిన

పట్టినసూడునుఁ బాడునుఁ బోదు

చ 3: పేరుకొనుచు నినుఁ బెదవులఁ దిట్టిన

ఆరీతికాఁతాళ మటు వోదు

యీరీతి శ్రీవేంకటేశ కూడితివి

నేరుపు నేరమి నీకే పోదు





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1135-2 సాళంగనాట సం: 21-201**

**పల్లవి: మాకేల అంతేసి నీతో మారుమలయ**

**యీకడివారితో యీడు కెనసేవుగాక**

**చ 1: పంతగత్తెనా నీతోఁ బలుమారు జగడించ**

**వంతుదాననా నీతో వాసులెంచను**

**యెంతకెంత యేమయ్య నిన్నే మాకుఁ జెనకఁగ**

**బంతివారితోడట్టు పాలించేవు గాక**

**చ 2: మెచ్చనివారమా నిన్ను మీఁద మీఁద దప్పు లెంచ**

**మచ్చరములా నీతో మారుకొనను**

**కుచ్చిత మెఱుఁగుదునా గొరబు నిన్నేల సేసే**

**మచ్చికసతులపాడి మన్నించేవుగాక**

**చ 3: సరివెనఁగేమా నీతో సాములుసేయఁగ నేము**

**పొరుగుపోరచా నిన్ను బూమెలు సేయ**

**యిరవై శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి**

**వరుసవారికివలె వలచేవుగాక**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1135-3 బౌళి సం: 21-202

పల్లవి: ఒక్కట మీరిద్దరు నహోబలేశ

వుక్కళమై కాచుకొండహోబలేశ

చ 1: మారుకొండ లెక్కి వచ్చి మంకువాపె లకిమమ్మ

వూరె నీసెలవినవ్వహోబలేశ

తేరి చూచి నీమారు దేవతలఁ గరుణించె

వూరటాయ నీకాపె యహోబలేశ

చ 2: గొబ్బున నీతొడ యెక్కి కొసవెండ్రుకలు దువ్వి

వుబ్బించీ నిన్నిపుడే యహోబలేశ

నిబ్బరపుఁజేతులను నిన్నుఁ గాఁగిలించి పట్టి

వొబ్బిడిఁ దా మెరసె నహోబలేశ

చ 3: మొల్లమినవ్వులతోడ మోవితేనె విందువెట్టి

వుల్లమెల్లఁ గరఁచె నహోబలేశ

యిల్లిదె శ్రీవేంకటాద్రి విరవై తనచన్నుల-

వొల్లనె నాఁటించీ ని న్నహోబలేశ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1135-4 రామక్రియ సం: 21-203

పల్లవి: ఆనసుమీ నీకును ప్రహ్లాదవరదా నిన్ను-

నానితిఁ గుచముల ప్రహ్లాదవరదా

చ 1: అలుక మానుమీ ప్రహ్లాదవరదా నిన్ను-

నలమితి నిప్పుడే ప్రహ్లాదవరదా

అలసితి రతుల ప్రహ్లాదవరదా నీకు-

నలవాటే ఇన్నియుఁ బ్రహ్లాదవరదా

చ 2: అంగపుఁ జెమటల ప్రహ్లాదవరద నీకు-

నంగడి మొక్కు మొక్కేఁ బ్రహ్లాదవరదా

అంగదెల్లాఁ బాసెను ప్రహ్లాదవరదా మోవి-

నంగజముద్ర లంటెఁ బ్రహ్లాదవరదా

చ 3: ఆరితేరెఁ బనులు ప్రహ్లాదవరదా యింక-

నారీతి మన్నించుమీ ప్రహ్లా దవరదా

యీరీతి శ్రీవేంకటాద్రి నిందునందుఁ గూడఁగాను

హేరములు పెనఁగెఁ బ్రహ్లాదవరదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1135-5 లలిత సం: 21-204

పల్లవి: ఇంత సేతురా నీవు యెమ్మెకాఁడ

వింతవాఁడవా నీవు వేడుకకాఁడ

చ 1: పడఁతి విలువఁగాను పలుకక వూరకుండి

నడుమ నవ్వుదురా నాలికాఁడ

చిడుముడి నప్పటిని చెయివట్టి తియ్యఁగాను

జడిసి మారిడుదురా జాణకాఁడ

చ 2: సిగ్గు విడిపించి సతి చెక్కునొక్కి వేఁడుకోఁగా

బగ్గన నలుగుదురా పంతగాఁడ

వెగ్గళమై ఆపె నీకు విందులమో వియ్యఁగాను

దగ్గరి వీడె మిత్తురా తాటోటుకాఁడ

చ 3: చింతదీర నీమగువ చేరి కాఁగిలించుకొంటే

అంతలో భ్రమతురా అందగాఁడ

వంతుకు శ్రీవేంకటేశ వనిత నిన్నుఁ గలసె

బంతి నింతేసి మెత్తురా బయకాడ




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1135-6 ముఖారి సం: 21-205

పల్లవి: నిన్నుఁ జూచుకొనవద్దా నేఁడు మమ్మేమి చెప్పేవు

జున్నుగా సిగ్గురేఁచితే జోరునఁ బైజారదా

చ 1: నిండుజాణలైనవారు నీతో నవ్వేరుగాక

అండనున్న కన్నెలము అందుకోపేమా

చండిపెట్టి నీవు నేడు చల్లలమ్మేవారిఁ దెచ్చి

బండుబండుసేయఁబోతే పలుచనేకాదా

చ 2: యిచ్చకమాడేటివారు యియ్యకొనుందురుగాక

అచ్చపముద్దరాండ్ల మందుకోపేమా

పచ్చిదేరేమాట లాడి పల్లెతావువారిఁ దెచ్చి

ముచ్చిలి చేచాఁచఁబోతే ముదుగులేకావా

చ 3: మందెమేళమైనవారే మారువెనఁగేరుగాక

అందపు మానావతుల మందుకోపేమా

చెందితి శ్రీవేంకటేశ చేఁగల మట్టిలో నన్ను

మందలించఁబోతేను మతకమేకాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1136-1 సాళంగనాట సం: 21-206

పల్లవి: ఎంతకెంత పెంచేవే యెందాఁకాను

కాంతలకుఁ బతులకుఁ గలదేకాదా

చ 1: వొట్టువెట్టుకొంటినంటా వూరకే మాటాడవు

పట్టినదే వ్రతమా పడఁతులకు

మెట్టిపట్టుకొని నీతో మేనవావి సేసుకొని

తిట్టెఁ గాక కోపాన సాదించవచ్చెనా

చ 2: ఆడనలిగినంటా నట్టె శిరసు వంచేవు

ఆడినవే ఆటలా యతివలకు

వేడుక వుట్టవలసి విభుఁడు జూజాన నిన్ను-

నోడించెఁగాక నీతో వొరటువాఁడా

చ 3: చెల్లుబడిగలదంటా సిగ్గులువడే విప్పుడు

పల్లదమే పగటా భామిసులకు

యిల్లిదె శ్రీవేంకటేశుఁ డెనసె నిన్నింతలోనె

వుల్లము చూచెఁగాక వొకరీతి నుండెనా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1136-2 పాడి సం: 21-207

పల్లవి: ముంచి ముంజేయీ నాడితే మోచేయీ నాడుఁగాక

మంచితనము లేకుంటే మరిగీనా తాను

చ 1: ఇచ్చకమాడేవారినే ఇందు రమ్మందురుగాక

తుచ్చమాడేవారినేల తొంగిచూతురు

మచ్చిక నేఁ జేయఁగానే మనసిచ్చెఁగాక తాను

వొచ్చెములు దన్నెంచితే వొనగూడీనా

చ 2: అడ్డాలుచెప్పనివారి కట్టె వలతురుగాక

వొడ్డారపువారికేల వొద్దికౌదురు

వెడ్డువెట్టి వేడుకోఁగా విడువకున్నాఁడు గాక

యెడ్డెతనాన నుండితే ఇయ్యకొనీనా

చ 3: గక్కన మొక్కినవారిఁ గాఁగిట నింతురుగాక

కక్కసపువారినేల కై కొందురు

నిక్కి శ్రీవేంకటేశుఁడు నేఁ గూడఁగాఁ జిక్కెఁగాక

మొక్కలాన నూరకుంటే మోహించీనా




# అన్నమయ్య

# సంకీర్తనలు


శృ.రేకు: 1136-3 ఆహిరి సం: 21-208

పల్లవి: అలుగకువే నీవు అందుకెల్ల నాతనితో

చలములేకుండాఁ దెలుసుటగాక

చ 1: వాడికెమాట లాడితే వద్దనఁగవచ్చునా

యీడుజోడు లందులోన యెంచుటగాక

జాడతో నవ్వు నవ్వితే సాదించవచ్చునా

సూడుఁబాడుఁ గాకుండ సోదించుటగాక

చ 2: తప్పకచూచితేనే తమకించవచ్చునా

కప్పి వెంగెములేకుండాఁ గనుటగాక

ముప్పిరిఁ జేయివట్టితే మొనచూపవచ్చునా

చొప్పుగా బాసలు సరిచుచుకొంటగాక

చ 3: చిమ్మిరేఁగఁ గూడఁగాను సిగ్గువడవచ్చునా

నిమ్మలాన నేరుపులు నించుటగాక

యిమ్ముల శ్రీవేంకటేశుఁ డింతలో నిన్నుఁ గలసె

యెమ్మె చూపవచ్చునా యెఱుఁగుటగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1136-4 మాళవిగౌళ సం: 21-209

పల్లవి: ఆయ రావే యేడ సుద్ది అందువంక నేమి గద్దు

పాయపువేడుకకాఁడు భయపడేనా

చ 1: చేయిమీఁదై చేఁతచేసి సెలవుల నవ్వుఁగాక

యీయెడ నెంతదిట్టినా యెదురాడీనా

కాయకపుటందగాఁడు కతలెల్లాఁ జెప్పుఁగాక

రాయడించి వొద్దనినా రాక మానీనా

చ 2: తగవుచాలనివాఁడు తలవంచుకొనుఁగాక

జిగి నెంత గాదనినా సిగ్గువడీనా

సొగసి వేడుకకాఁడు చూరువట్టి వేలుఁగాక

వెగటుగా దొబ్బినాను విడువఁబొయ్యీనా

చ 3: నేరమిపైఁబడ్డవాండు నిండా నోర్చుకుండుఁగాక

సారె నెంత జంకించినా చండి మానీనా

సారపుశ్రీవేంకటేశ్వరుఁడిదె నన్నుఁ గూడె

మీరేమి చెప్పినా మించి వీఁగీనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1136-5 లలిత సం: 21-210

పల్లవి: నీవల్ల వచ్చినమేలు నిన్ను సోఁకును

దేవర వీజగడాలు దిద్దవయ్య నీవే

చ 1: మచ్చరించి సవతులు మాటలాడదొరకొంటే

నిచ్చలపు వెంగేలెల్ల నిన్ను మోచును

కొచ్చి కడకన్నులకు కోపపుటెఱ్ఱ వచ్చితే

కచ్చుపెట్టి నీపైఁ దారి కమ్ముకొనును

చ 2: చిమ్మిరేఁగి ఆపోనాపెఁ జేతులు చాఁచంబోతే

నెమ్మది నడుమనున్న నిన్ను మోచును

వుమ్మడిపంతాలు వొక్క రొక్క రాడుకొంటేను

పమ్మి అవి దిద్ద నీపాల నుండును

చ 3: మించినయాకాంతలకు మేనులు చెమరించితే

పంచల నాచెమట నీపై నంటును

యెంచఁగ శ్రీవేంకటేశ ఇద్దరినిఁ గూడితివి

కంచపు మోపుల చవి కానవచ్చు నీకును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1136-6 బౌళి సం: 21-211

పల్లవి: మాఁటలాడవయ్య ఇఁక మగువ నీవుత నొక్కటే

ఆఁటదాని కిదే చల్లవారెఁ గోపము

చ 1: కాయముపైఁ జేయివేసి కప్పురము నోటికిచ్చి

ఆయము లంటఁగాఁ జల్లనారెఁ గోపము

చాయలు సన్నలుఁ జేసి చవులుగా మోవి ఇచ్చి

ఆయెడ మొక్కఁగాఁ జల్లనారెఁ గోపము

చ 2: కొప్పు గడుదువ్వి యట్టె కొంగు చేతఁబట్టుకొని

అప్పసము నవ్వఁగాం జల్లారెఁ గోపము

రెప్పలెత్తి చూచి చూచి రేసులెల్లా నించఁగాను

అప్పుడట్టె మతిఁ జల్లనారెఁ గోపము

చ 3: పచ్చిగాఁగం గాఁగిలించి పట్టి తమ్ములము వెట్టి

అచ్చు గోరు మోపఁగాఁ జల్లరెఁ గోపము

మచ్చిక శ్రీవేంకటేశ మనసారఁ గూడితివి

అచ్చలము దేరి చల్లనారెఁ గోపము



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1137-1 సామంతం సం: 21-212

పల్లవి: ఇదివో నీదొరతన మింకా నేమి చెప్పేను

సదరమైతి వీయాడేజాణతనాలకును

చ 1: చలివాసి యాపె నీతో సారె వెంగేలాడఁగాను

నలిరేఁగి నీవు గడునవ్వఁగాను

చులుకనివాఁడవైతి సుదతుల కెల్లాను

మెలఁగి చూడఁగ మందెమేలాలపాలైతివి

చ 2: సందడి మాలో నీతో సన్న లాపె సేయఁగాను

మందలించి నీవు లోనై మన్నించఁగాను

అందరియెంగిలి వైతి వాడికలకు లోనై

కందువరతులలోన కంకివైతివి

చ 3: గక్క నిన్నిపు డాపె కాఁగిలించి కూడఁగాను

మిక్కిలి శ్రీవేంకటేశ మెచ్చఁగాను

లక్కవంటివాఁడవైతి లాగుల మాతోఁ గరఁగి

కక్కసించఁగా రొంపిలో కంబమవైతివి





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1137-2 చాయానాట సం: 21-213

పల్లవి: ఏఁటికి ఆఁటదానికి నింతగర్వము వలెనా

మేఁటిరతుల చేతనే మెప్పించుటగాక

చ 1: మాటలాడేపతితోడ మరి పరాకేఁటికే

కాటుకకన్నులఁ జూచి కైకొంటగాక

కూటమికిఁ బెనఁగఁగా గుట్టు చూపనేఁటికే

చాటించి మోవివిందులు చవిరేఁచుటగాక

చ 2: నవ్వునవ్వే పతియెడ నాలితన మేఁటికే

రవ్వగాఁ జన్నులనొత్తి రాయుటగాక

పువ్వులు ముడువఁగాను బొమ్మజంకెనేఁటికే

జవ్వనపాయము పొందు జరపుటగాక

చ 3: కూడేశ్రీవేంకటపతిఁ గొసరఁగనేఁటికే

జాడతో వలపు పై పైఁ జల్లుటగాక

వేడుక నెనసితివి వేగిరము లేఁటికే

పాడిపంతము మెరసి పనిగొంటగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1137-3 తోండి సం: 21-214

పల్లవి: ఏల మేకులు సేసేవు ఇందరిఁ జూపి మమ్ము

పాలు వాలే నీరు నీరే పలుక లేమిటికి

చ 1: కాయకపువావులకాంతలు సరయ్యేరా

చేయిమీఁద్దై సేసపాల చెలులకును

మాయదారిబీటియెఁడమావులనేళ్లెల్లాను

కాయపుదప్పి దేరుచఁ కాఁగులు నిండీనా

చ 2: యెరవులసతులెల్ల యీడుజోడు వచ్చేరా

తిరమైనపట్టంపుదేవులకును

అరమరచి చూచిన ఆమనిపచ్చలెల్లాను

వరుస రాసులై కొలవఁగ వచ్చీనా

చ 3: కన్నవూడిగపువారు కలసేరా కొలమున

నిన్నుఁ గూడిమావంటినెలఁతలతో

యిన్నిటా శ్రీవేంకటేశ యెంచి చూచుకొంటేను

వెన్నెలకువ్వలెల్లా వెలకెక్కీనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1137-4 గుజ్జరి సం: 21-215

పల్లవి: వద్దనేనా నేఁ దన్ను వలపెంత చవియైనా

అద్దుకొని తనకును ఆపెకు నమరునే

చ 1: మచ్చికకు వేళ గద్దా మాటలకుఁ గొన గద్దా

పెచ్చు వెరిగీఁ గాక ప్రియుఁడు నాతో

ఇచ్చకాలు నేసెనంటా నింతి నిట్టె మెచ్చితేనే

మెచ్చనీవే మాతోనేల మేకులు చెప్పీనే

చ 2: ననుపులో వింత గద్దా నవ్వులకు మితి గద్దా

అనువులు చూచీఁగాక ఆతఁడు నాతో

పెనఁగి పిలిచీనంటా ప్రియురాలిమాట వింటే

విననీవే మాతోనేల వేడుక చెప్పీనే

చ 3: కూటమిలో కొంకు గద్దా కోరికకు మేర గద్దా

యేఁటిదో కాక శ్రీవేంకటేశుఁడు నాతో

యీటువెట్టే నంటా నాకెయింపులకె ననుఁ గూడె

కూటమికి నన్నేల గొరబుసేసీనే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1137-5 దేసాళం సం: 21-216

పల్లవి: ఎందాఁకా వేండుకొనేవు యేఁటికయ్యా
అంది పొంది యింకా నిన్ను అటమటించేనా

చ 1: అలుకలేఁటికి నీఁక నంతరంగ మొక్కటాయ
బలిమి యేఁటికి నీతోఁ బలికితిని
సొలపులేఁటికి నీసుద్దులు సమ్మతించితి
మలసి యప్పటి నీతో మరికాదనేనా

చ 2: వట్టిసొలపులేఁటికి వద్దనే వుందాన నేను
తిట్టనేల నేమోహము తెలిసితిని
పట్టి కొసరఁగనేల పనులెల్లాఁ జేసే నీకు
మట్టుమీరి యంతలోనే మరి కాదనేనా

చ 3: జంకించనేఁటికి నీచనవెల్లాఁ జేకొంటి
వుంకువలేఁటికి నీతో నొద్దికైతివి
అంకెల శ్రీవేంకటేశ అన్నిటా నిన్నుఁ గూడితి
మంకు వాసె నాతోను మరి కాదనేనా



శృ.రేకు: 1137-6 లలిత సం: 21-217

పల్లవి: ఎవ్వరు సాకిరిచెప్పే రిందుకుఁగాం దనకు

వువ్విళూరఁ దనలోనే వూహించుకొమ్మనవే

చ 1: మొగములోపలితేట ముందరనే కానరాఁగా

యెగసక్కెపురమణుఁ డేలబొంకీనే

తగిలి తనవన్నెలు తాఁ జూచుకోరాకుంటే

సొగిసి యద్దమైనానుఎ జూచుకొమ్మనవే

చ 2: లచ్చనగా నొసలను లత్తుక లంటుకుండగా

యిచ్చకములాడి విభుఎ డేలబొంకీనే

తచ్చి తనపై మచ్చము తాఎజూచుకోరాకుంటే

అచ్చలాన నద్దమైన నట్టె చూడుమనవే

చ 3: పెదవిపై మాణికేలు బిగువులువట్టుండఁగా

యెదుట శ్రీవేంకటేశుఁ డేలబొంకీనే

వదనము తాఁ జూడవసముగాకుంటే నద్దము

యిదె చూచుకొమ్మనవే యిట్టె నన్నుఁ గూడెను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1138-1 సౌరాష్ట్రం సం: 21-218

పల్లవి: ఎఱఁగనంటా నానలేల పెట్టుకొనే వీడ

యెఱిఁగేవుగాక ఇఁక నెందువొయ్యేవయ్యా

చ 1: మనసు మర్మమెఱుఁగు మాటలు వాసులెఱుగు

తనువు కాఁగిటిలోనితమి యెఱుఁగు

పనివడి నీవెంత పరాకుతో నుండినాను

యెనసేవుగాక మమ్ము నెందు వొయ్యేవయ్యా

చ 2: వలపు తెగులెఱుఁగు వయసు వాడికెఱఁగు

చెలునపుపంతములు సిగ్గెఱుఁగును

నిలువురాజసముతో నీవెంత వుండినాను

యెలమి మన్నించేవుగా కెందువొయ్యేవయ్యా

చ 3: కన్నులు కాంక్ష లెఱుఁగు కందువలు గోళ్లెఱఁగు

సన్నపునవ్వులు మోవి సారె నెఱుఁగు

అన్నిటా శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను

యెన్నికఁ గూడితి విఁక నెందువొయ్యేవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1138-2 పాడి సం: 21-219**

**పల్లవి: ఊరకే వుండితే నిన్ను వూరెల్లా నెటిఁగేరు**

**దూరువచ్చీ సుమ్మీ నీవు దొరపాటివాఁడవు**

**చ 1: నిలువుఁగస్తూరి పూఁత నీమేన నలఁదుకో**

**చెలఁగి చీఁకటితప్పు సేసేవాఁడవు**

**తలఁగక సేమంతులదండలు నిండా వేసుకో**

**తొలువెన్నముద్దలెల్లా దొంగిలేటివాఁడవు**

**చ 2: వడిఁ బైఁడిపచ్చడము వల్లెవాటు వేసుకో**

**చిదుముడిఁ జీరలు దీసేవాఁడవు**

**కడు నీవు పొద్దొకసింగారాలు సేసుకో**

**తొడికి ఆఁటదాని నెత్తుకవచ్చేవాఁడవు**

**చ 3: మితిలేని హారములు మెడనిండాఁ గట్టుకో**

**రతి నలమేల్మంగవురమువాఁడవు**

**ఇతవై శ్రీవేంకటేశ ఇదె మమ్ము నేలుకో**

**సతుల వేలసంఖ్యల సంతరించేవాఁడవు**



శృ.రేకు: 1138-3 బౌళి సం: 21-220

పల్లవి: పాయపుమదమువట్టి పనులేమి యెఱఁగను

చేయిమీఁదై నీవేమైనాఁ జేసుకోరాదా

చ 1: సిగ్గువడ్డనాచిత్తము చెప్పినట్టు సేసీనా

తగ్గి నన్ను మూలమూల దాఁచుఁగాక

యెగ్గువట్టి యేలదూరే వెంతగబ్బి నేనంటా

అగ్గమై నీయిచ్చల నేమైనాఁ జేయరాదా

చ 2: వాసితోడినాచలము వసము నాకయ్యీనా

యీసురేఁచి అట్టె బిగియింపించుఁగాక

ఆసలనేల జంకించే వంకెకు నే రానంటా

సేసవెట్టి యేమైనాఁ జేసుకోరాదా

చ 3: అంగపుజవ్వనమద మడఁచితే నడఁగీనా

పొంగుచు నీకాఁగిటిలో బోగించుంగాక

రంగుశ్రీవేంకటేశ రతి నలమేల్ మంగను

చెంగట నిచ్చఁ బెండ్లి సేసుకోరాదా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1138-4 శ్రీరాగం సం: 21-221**

**పల్లవి: నీరచన లింతేశాయ నివ్వెరగేల పడేవు**

**పొరకామినులు నిన్నుఁ బంగించితేఁ దప్పా**

**చ 1: కోరి కోరి పిలువఁగ గుట్టెల్లా బయిటఁబడె**

**సారె సారె నవ్వఁగాను చలివాసెను**

**మారుకొని మాటాడఁగ మందెమేలమాయ నేఁడు**

**తేరి చూచి ఆకె నిన్నుఁ దిట్టకుండునా**

**చ 2: చెక్కులు నీవు నొక్కఁగా సిగ్గులెల్లాఁ దొలఁగెను**

**చక్కఁగ నీవు మెచ్చఁగ చండిపడెను**

**దక్కి నీవండనుండఁగ తనకు వెఱవు దీరె**

**తక్కక పాదాన నిన్నుఁ దాఁకించక మానునా**

**చ 3: నీవు గాఁగిలించుకోఁగా నిండురాజసము గప్పె**

**కైవసము గాంగాను కాఁకదేరెను**

**యీవల నలమేల్మంగ యిట్టె వురమెక్కించఁగ**

**శ్రీవేంకటేశ నీసేవ సేయవలదా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1138-5 ఆహిరి సం: 21-222

పల్లవి: నే నేమి సేతునే నిచ్చలాన నే నుందాన

ఆనకపుతనసుద్దు లడుగరే మీరు

చ 1: చల్లనిచందురుఁడే సారె వేఁడి చల్లితేను

యెల్లవారి కిఁకమరి యేమిసేసేదే

వెల్లవిరి నానవ్వు వెంగెము తనకయితే

పల్లదాన తనకైనభాగ్య మింతేకాక

చ 2: ముడిచేటిపూవులే మొనలై నాఁటితేను

యెడయక యెల్లవారి కేది దెరువే

అదరి నాకనుచూపు లాయములు గాడితేను

బడి బడిఁ దాఁ జేసినభాగ్య మింతేకాక

చ 3: చక్కెరవంటిమాటలే సరిఁ జిరుచేఁదైతే

యెక్కడా దంపతులకు నిఁక నేఁటిదే

అక్కరై శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను

పక్కనఁ గూడితిఁ దనభాగ్య మింతేకాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1138-6 రామక్రియ సం: 21-223

పల్లవి: వద్దు వద్దమ్మా యింతవాదు లాతనితోడుత

పొద్దువోనిసుద్దులెల్లా పోగులై నిలిచెను

చ 1: కోరికలు దఱచైతే కోపములు దఱచౌను

మారుకొంటే మీఁదమీఁద మంకువట్టును

సారె సారెఁ బతినేల సాదించేవే నీమీఁది-

పేరడివలపు పెక్కుప్రియురాండ్లఁ దెచ్చెను

చ 2: చెనకులు గడునైతే చిమ్మిరేఁగుఁ దిట్లెల్లా

పెనఁగఁబోతే నట్టే బిరుదెక్కును

కినిసి యీతనినేల కెరలి తిట్టేవే నీపై

మనసే పిక్కటిల్లి యీమగువలఁ దెచ్చెను

చ 3: నయములు మించితేను నగవులు జాలువారు

నియతి నలమేల్మంగ నిన్నుఁ గూడఁగా

దయవెట్టె శ్రీవేంకటోత్తముఁడు యింతేలే సిగ్గు

ప్రియము నీమీఁదిదే యీపేరటాండ్లఁ దెచ్చెను




# అన్నమయ్య  సంకీర్తనలు


**శృ.రేకు: 1139-1 పళవంజరం సం: 21-224**

**పల్లవి: ఆతఁడు నీచేతఁ జిక్కె నదివో నేఁడూ నీ-**

**యేతులు యెమ్మెలు మరి యేమి చెప్పే మిఁకను**

**చ 1: వెన్నెలనవ్వులు నవ్వె వేఁడివేఁడివలపు**

**చన్నులతుదలనె చవుకళించె వయసు**

**కన్నులచూపులనె కాఁడిపారె మనసు**

**యెన్నిలేవు నీసుద్దు లేమిచెప్పే విఁకను**

**చ 2: నాలికతుదలనె నానెఁ జుట్టరికము**

**మేలిమిసరసముల మించె మోముకళలు**

**గాలపుగోరికొనల కరఁగె మర్మములు**

**యీలాగుల నీనేరువు లేమిచెప్పే మిఁకను**

**చ 3: పెదవిపైఁ గుఱుతులఁ బెరసెఁ గూటములు**

**పొదిగొన్నతమకాన పోగులాయ నాసలు**

**అదన శ్రీవేంకటేశు డలమేలుమంగ నిన్ను-**

**నిదె కూడె మీ భావము లేమిచెప్పే మిఁకను**




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1139-2 గౌళ సం: 21-225

పల్లవి: ఎప్పుడూ నాభావము నీవెఱిఁగినవాఁడవు

తప్పులెంచ కిట్లానే దయఁజూడుమీ

చ 1: చక్కనినీరూపు చూచి చొక్కివున్నదాన నేను

పక్కన నీవే నన్నుఁ బైకొనుమీ

యిక్కువ నే నంటనంటా యెగ్గువట్టేవు గనక

చిక్కని చన్నులమీఁదఁ జేయివేయుమీ

చ 2: మాటలు నీ వాడఁగాను మత్తురాలనై వుందాన

గాఁటపునీపచ్చడము గప్పుమీ నాపై

కూటమిలోఁ బరాకంటా గుంపించేవుగనక

నాఁటుకొనంగా నీవే నన్నుఁ గాఁగిలించుమీ

చ 3: సమరతి నిన్నుఁ గూడి సదమదమైనదాన

తమకాన మోవి ఇచ్చి దప్పిదీర్చుమీ

అమరె శ్రీవేంకటేశ అదేమనేవుగనక

సముకమిచ్చి యేపొద్దూ చనవరిఁ జేయుమీ





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1139-3 బౌళి సం: 21-226

పల్లవి: ఇంతగా నేర్చితివి నీ విన్నియు నిందుకొరకే

మంతనవ్వులేకా మక్కువకు మందులు

చ 1: మించి ఇంతులు వలవ మిక్కిలి నీవాడేటి-

మంచిమాటలేకావా మచ్చుమేపులు

పంచల నందరికిని పాయరానిపొందులకు

కంచపుఁబొత్తులేకావా గాలపువేఁటలు

చ 2: కొమ్మలననువులరు కొనగోరితాఁకులు

చిమ్ములేకా విడువనిచేపట్లు

నెమ్మనములు గరఁగ నిలుచుండి నీవు చూచే-

వుమ్మడి చూపులేకావా వుంకుధనములు

చ 3: కూడిన కూటములకు గుఱుతులు రేఁచేవి నీ-

వేడెపుమోవులే కావా నీడుదోళ్లు

యీడనే శ్రీవేంకటేశ ఇందరి నేలితి విట్టె

వేడుకమొక్కులేకావా వెలలేని యాసలు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1139-4 ముఖారి సం: 21-227

పల్లవి: ఒకటంటే నొకటనే వూరకే నీవు

వెకలియై నిన్నేమైనా వెంగెములాడెనా

చ 1: పక్కన నీమోవి చూచి పకపక నవ్వె నాపె

యెక్కువ నీమోవికెంపు లేడవనెనా

వెక్కనపునీపై చేయి విసరె నిప్పుడె ఆపె

చొక్కమై నీవుసేసినసుద్దులు దడవెనా

చ 2: కళదేరేనీమేనికాంతులు వొగడె నాపె

అలరి వున్నాఁడవు నిన్నదేమనెనా

అలసినందుకు పన్నీ రట్టె నీపైఁ జల్లెఁగాక

కలనీసేఁతలు యెఱుకలు సేసుకొనేనా

చ 3: చిమ్మిరేఁగేనీనెరులు చిక్కులుదీసె నాపె

పమ్మి నిన్ను యిట్టే సిగ్గువడఁజేసేనా

కమ్మి శ్రీవేంకటేశుఁడ కలసె నలమేల్మంగ

కుమ్మరించి నీపై బత్తి కొత్తలుగఁ జేసెనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1139-5 కన్నడగౌళ సం: 21-228

పల్లవి: కల్లగాదు చూడవయ్య కన్నులెదుటనే యిదె

జల్లన మైపులకలజాజులు పైఁబోసెను

చ 1: చెప్పేటి నీగుణములు చెవియొగ్గి మాచెలి

కప్పురవునవ్వులనే కానుకవట్టె

వొప్పులుగ నీవిట్టే తనవొద్దికి వచ్చేవంటే

కప్పినతనచన్నులు కప్పముగాఁ బట్టెను

చ 2: యివ్వల విడెము నీకు యిట్టె యిమ్మనేనంటే

వువ్విళ్ళూరఁ దనమోవి వులుపా వట్టె

దవ్వులనే వలపులు తతి నీపైఁ జల్లేనంటే

సువ్వనఁ జేతిమొక్కులు సూడిదెగాఁ బట్టె

చ 3: నెమ్మది నీవు సరుస నిలుచున్నాఁడవంటే

కొమ్మ నీబంగారపు కొంగు వట్టెను

యిమ్ముల శ్రీవేంకటేశ యిదె నీవు గూడఁగాను

పమ్మి నీకాఁగిలి మరి బారచాఁచి పట్టెను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1139-6 భైరవి సం: 21-229

పల్లవి: నిన్నుఁ జూచి నాకైతే నెరవుడా దయవుట్టె
యెన్నిటి కోపుదువు మాయింటికి రావయ్యా

చ 1: చేసన్న సేసి యొకతె చెట్టవట్టి తీసె నిన్ను
ఆసల వొకతె నిన్ను నట్టె నవ్వెను
యీసందుల నీమనసు యిరుమొనసూదాయ
సేసల యిద్దరిచేతఁ జిక్కెఁగా నీతురుము

చ 2: కందువకుఁ దెచ్చొకతె కాఁగిలించుకుండఁగాను
మందలించి వేరొకతె మర్మమంటీని
అంది తాసువంటిదాయ అట్టె నీరతియెల్ల
సందడి నిద్దరిచేత సదమదమైతివి

చ 3: మునుప వేరొకతె నీమోవి గంటిసేయఁ గాను
వెనక నొకతె గోరు వీఁపు మోపీని
యెనసితి నే నిన్ను యింతో శ్రీవేంకటేశ
అనువై ముక్కాలిపీఁట వైతివి గా యిపుడు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1140-1 అందోళి సం: 21-230

పల్లవి: ఇన్నిటా జాణవే నీకిది వోజ

యెన్నేని సంతోసించేని కిదివో వోజా

చ 1: వచ్చినప్పుడే పతికి వలపు పైఁబూసితివి

యెచ్చరికగలదాని కిదివో వోజా

లచ్చనలు నించితేను లలి నూరకె వుంటివి

యిచ్చకపుజవరాలి కిదివో వోజా

చ 2: సరసములాడితేనే చనవెల్లా నిచ్చితివి

యెరవులేని దానికి నిదివో వోజ

తెరవేసినంతలోనే తెలిసి పాదాలొత్తితి-

విరవైన పెండ్లికూఁతు కిదివో వోజా

చ 3: చెంగటికి వచ్చితేనే శ్రీవేంకటేశుఁ గూడితి-

వింగితజ్ఞురాలికి నిదివో వోజ

వుంగిటితమ్ముల మాతఁ డుమియఁబోతే నీవు

యెంగిలికిఁ జేయొగ్గితి విదివో వోజా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1140-2 ఆహిరి సం: 21-231

పల్లవి: ఇంక నేమిచెప్పేము నీయెమ్మెలు సింగారాలు

చింకచూపులనుఁ జూచి సిగ్గువిడిపించిరి

చ 1: ఆవులఁ గాచుచు పరాకైననిన్ను గొల్లెతలు

చేవదేర వలపులు చిమ్మిఁరేచిరి

వోవలఁ బాలెల్లఁ దాగి వుబ్బి మదించీనని

తావిబుజాల గోరికోఁతలు గోసిరి

చ 2: అంచెలయమునలోన అట్టె యీఁదులాడేనిన్ను

ముంచి మానములు చూపి మోహించిరి

పెంచెవువనాలలోన పిల్లఁగోవిపట్టి నీకు

కంచపుకెమ్మోవు లిచ్చి కళలెల్లా నించిరి

చ 3: గచ్చకాయలాడే నిన్నుఁ గాఁగిలించుకొని పట్టి

కొచ్చి కొచ్చి చన్నులనే కూరాడిరి

యిచ్చల శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి

చెచ్చెర వారెల్ల నీపై సేసవెట్టిరి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శ్రృ.రేకు: 1140-3 పాడి సం: 21-232

పల్లవి: ఓపనోప నిందుకెల్లా వోచెలులాల

యేపనులకని పై పై నెచ్చరించే నతని

చ 1: కన్నులు చల్లంగాఁ జూచి కడుసంతసించేఁగాక

యెన్నిటికని కోపించే నిఁక నాతని

చన్నులమొనల నొత్తి సారెఁ గాంగిలించేంగాక

కన్నుందుకెలా నెట్లఁ గక్కసించే నాతిన

చ 2: చేతులు నిండా నేను సేవసేసేఁగాక మరి

యేతుల నెట్టు జంకించే నిఁక నాతని

ఆతుమార మోవితేనె లట్టే విందువెట్టేఁగాక

జాతినీతిమాని యెట్టు సాదించే నతని

చ 3: కాయము నిండాఁ బొంది కరఁగించి కూడేఁగాక

యేయుపాయముల మీరే నిఁక నాతని

యీయెడ శ్రీవేంకటేశుఁ డెనసి నన్ను మన్నించె

చాయల సన్నల నేమి జగుసేసే నాతని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1140-4 దేసాళం సం: 21-233

పల్లవి: మంచితనములు సేసి వంచుకోనేర వతని
పొంచి మోవి చూపితేనే పొందు నీకు నియ్యఁడా

చ 1: పచ్చిసేసి బలిమినే పతినేల పిలిచేవే
యిచ్చకమాడితే నాతఁ డింటికి రాఁడా
బచ్చెనఆనలు వెట్టి బాసలేల అడిగేవే
చెచ్చెర నీవు మొక్కితే చెప్పినట్టు సేయఁడా

చ 2: తలుపు మూసుక యేల తగఁ బతి నాఁగేవే
వలచితినంటేనే వద్ద నుండఁడా
మలసి పొలసి యేల మనసు సోదించేవే
మొలకనవ్వు నవ్వితే ముచ్చటెల్లాఁ జెప్పఁడా

చ 3: చిప్పిల శ్రీవేంకటేశుఁ జెనకి యేల పట్టేవే
కప్పురవిడె మిచ్చితే కాఁగిలించండా
దప్పిదేర నప్పటిని తమకపడఁగనేలే
చెప్పినప్రియములకే చేకొనిట్టె కూడఁడా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1140-5 గౌళ సం: 21-234

పల్లవి: నీవే నేరుతువమ్మ నేఁ డాతని దక్కఁగొన

యీావల నిందుకే వురమెక్కించె నిన్నతఁడు

చ 1: మచ్చరమువిడిచినమానినికి అట్టెకదా

ముచ్చట తనవిభుఁడు మోహించును

చెచ్చెర నుపచారముచెప్పినయాపెకుఁగదా

అచ్చపుమన్ననలెల్లా నఱచేతితలోనివి

చ 2: పంతములాడనియట్టిపడఁతికి నిట్టెకదా

సంతతము రమణుఁడు జంటవాయఁడు

చెంతల నెప్పుడు సేవలుసేసినయాపెకుఁగదా

బంతినే ఆతం డెప్పుడుం బంపసేసును

చ 3: ఇచ్చకురాలై నయట్టిఇంతికి నీ కిట్టె కదా

వచ్చి శ్రీవేంకటేశుఁడు వలచి కూడె

తచ్చివేసి నీవంటితమిగలాపెకుఁ గదా

కచ్చుపెట్టి ఇతఁడిట్టె కైవశమై వుండును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1140-6 తెలుఁగుఁగాంబోది సం: 21-235

పల్లవి: చెలులాల యీచెలి గాచుకొనుచు

సెలవున నెప్పుడు నే నుండేను

చ 1: తప్పక చూచిన తానే తెలుసును

చెప్పకతొల్లే చేరి వలపు

ముప్పిరి నాతనిముందర నిలువదె

యిప్పుడే యీడకు నేతెంచీని

చ 2: యింతిఁ బేర్కొనిన యిటు దయదలఁచును

అంత బలిమిసేయఁగ వలదు

కాంతలు చేయెత్తి గక్కన మొక్కరే

మంతనమిచ్చీ మనసతి కిపుడు

చ 3: కానికిచ్చితేఁ గలసీ నీకేను

నానెను మనవిన్నప మపుడే

ఆనుక శ్రీవేంకటాధిపు నగరే

యీనెలఁత గలసె నిదివో నేఁడు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1141-1 నీలాంబరి సం: 21-236

పల్లవి: ఎంత భ్రమలఁబెట్టేవే ఇతని నీవు

దొంతున నీయానలు తోయఁజాలడు

చ 1: జిగిఁ జెక్కుచేత నీవు చిరునవ్వు నవ్వఁగానె

మగిడి మగిడి పతి మాఁటలాడీని

మొగము చూచి నీవు ముంచి యాస లియ్యఁగానె

తగిలి నీమాట లిట్టె దాఁటఁజాలఁడు

చ 2: పెక్కు విధముల నీవు ప్రియములు చెప్పఁగానె

అక్కరతో రెప్పలువేయక చూచీని

లక్కవలెఁ గరఁచి విలాసాలు నీవు చూపఁగ

వెక్కసపునీపొందు విడువఁగఁజాలఁడు

చ 3: వేడుకతోడుత నిట్టె విడెము నీ కియ్యఁగానె

కూడి శ్రీవేంకటేశుఁడు గోర నొత్తీని

యేడఁజూచినాను నీవే ఇచ్చకములాడఁగానే

జాడ నురమెక్కించి దించఁగఁజాలఁడు



శృ.రేకు: 1141-2 పాడి సం: 21-237

పల్లవి: ఎంతసేసితివో ఆపె నేమిటఁగాని నమ్మదో

పంతములు మెరసె నేపనికోకాని

చ 1: పలుమారు వాలుకరెప్పలు వంచి చూచీ నిన్ను

యెలమిఁ గొసరె నాపె యేఁటికోకాని

సెలవుల నవ్వుదేర చేత రొమ్ము దట్టుకొంటా

మలయుచు శిరసూఁచె మరియేలోకాని

చ 2: పెదవులు గదలఁగ పేరుకొని గొణఁగుతా

యెదురుగా నిలుచుండె నేఁటికో కాని

మదముదొలఁక నీతో మాటకు మాటాడి నిన్ను

నదనఁ జెయివట్టి తీసె నదేఁటికోకాని

చ 3: గుట్టుతోడఁ బరతెంచి కుచములు గదలఁగ

ఇట్టె నీవద్దఁ గూచుండె నేఁటికోకాని

జట్టిగా శ్రీవేంకటేశ సమరతినిఁ జొక్కించి

నెట్టుకొని నిన్ను మెచ్చె నెపమేదోకాని





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1141-3 లలిత సం: 21-238

పల్లవి: ఏఁటిమాటలాడేవు యెందాఁకనైనా

వాఁటమై నిన్నుఁ గాదనేవారు లేరంటానా

చ 1: చెలుల కిందరికని సిగ్గే మూలధనము

తలవంచుకొనరాదా తరుణికిని

చనివాసినవాఁడవు సారె నీవు నవ్వితేను

మలసి యిల్లాలికి మారు నవ్వఁదగునా

చ 2: కొమ్మలకునెల్లాను కోపమే సింగారము

బొమ్మల జంకించరాదా పొలఁతికిని

దిమ్మరివాఁడవు నీవు దీకొని సన్న సేసితే

అమ్మరో గరితలకు నాగడాలు దగునా

చ 3: కోమలులకెల్లాను గుట్టే చక్కఁదనము

నేమముతో నుండరాదా నెలఁతకును

ఆముక శ్రీవేంకటేశ అట్టె నీవు గూడితివి

ప్రేమపుపెండ్లికూఁతుకు పెనఁగఁగఁదగునా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1141-4 సౌరాష్ట్రం సం: 21-239**

**పల్లవి: ఇంకనేఁటి మాటలు యిట్టె కంటి నీనిజము**

**వంకలొత్తఁబోతేను కొంకరలయ్యీని**

**చ 1: యెవ్వతెకస్తూరిబొట్టో ఇదె నీనొసలనంటె**

**చువ్వన నద్దములోన చూచుకోవయ్యా**

**నవ్వఁబోతే పెదవిపై నయానఁ గెంపులురేఁగె**

**యివ్వల చెక్కులపస పిరుమేలా నంటెను**

**చ 2: కుంకుమగుబ్బలపూఁత గురిగా రొమ్మున నించె**

**సుంకుమోవఁ దలవంచి చూచుకోవయ్యా**

**పొంకపుచెవులతట్టుపుణుఁగు బుజాలఁ గారె**

**లంకెల హారములొత్తి లచ్చనలై వున్నవి**

**చ 3: సమరతిచెమటలు చారలై నీమేన నిండె**

**సుముఖుఁడవై నీవే చూచుకోవయ్యా**

**అమర శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి**

**జమళి ఇద్దరిచొప్పు సరి నీపైఁ బడెను**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1141-5 భైరవి సం: 21-240

పల్లవి: ఏమి వేగిరము నా కింతటిలోనే

దీమసాన నీగుణము తిద్దలేనిదాననా

చ 1: పల్లదపు నీమాటకు పదరేటిదాననా

పెల్లున నిన్నింతలోఁ గోపించేదాననా

చెల్లుబడినీచనపు చెల్లించనిదాననా

చల్లఁగా నీవలపు రేంచఁగలేనిదాననా

చ 2: అంతలో నవ్వితే నర్తమడిగేటిదాననా

కాంతుఁడ నీయిచ్చ యెఱఁగనిదాననా

పంతమాడి నిన్నింతలో భ్రమయించేదాననా

మంతనాన నీమన్నన మఱచేటిదాననా

చ 3: ప్రియము చెప్పఁగా నీతో బిగిసేటిదాననా

క్రియ యెఱఁగక కరఁగించేదాననా

రయమున శ్రీవేంకటరమణ నన్నుఁ గూడితివి

నయమిచ్చి నీకాఁగిట నాటుకోనిదాననా



www.annamayya.net



# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1141-6 వరాళి సం: 21-241

పల్లవి: ఎట్టి మొగమాయకాఁడ వేమని చెప్పుదు నిన్ను
తిట్టవచ్చినట్టియాపె దీవించె నిదివో

చ 1: జగడించేనంటా వచ్చి సకియ తప్పకచూచి
మొగమోటమున నీకు ముంచి లోనాయ
వొగరునీబాసలు వొప్పగించేనంటా వచ్చి
తగిలి నీమోవితేనె తానాసపడెను

చ 2: వడి జంకించేనంటా వచ్చి నీమాఁటలు విని
నడుమంతరాలనే నవ్వె నిపుడు
కడఁగి చేయి చాఁచ వచ్చి గక్కన నీమన్ననకు
యెడమిచ్చి నీకుఁ జేయెత్తి మొక్కెను

చ 3: కొంగువట్టేనంటా వచ్చి కూరిమి నీప్రియాలకు
కంగుమాని యంతలోనే కాఁగిలించెను
కుంగక శ్రీవేంకటేశ కూడి గోర నూఁదవచ్చి
యెంగిలిమోవిపైఁ గెంపులెల్లా నించుకొనెను





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1142-1 రామక్రియ సం: 21-242**

**పల్లవి: ఏల సిగ్గువడేవు నే నెఱఁగితే నేమాయ**

**తాలిమితో నాలోనే దాఁచుకొనే నీఁకను**

**చ 1: పతులు మన్నించినవి పరకాంతలతోడ**

**అతివలయినవారు ఆడుకొందురు**

**ఇతవుగాని వప్పుడు యేకతానఁ జేసినట్టి-**

**రతులరహస్యాలు రవ్వకెక్క నిపుడు**

**చ 2: వొంటిఁజేసినట్టి తమవుపచారాలు చెలితో**

**నంటుననుఁ జెప్పి చెప్పి నవ్వుకొందురు**

**జంటల నప్పటివేళ చవులైనకతలెల్లా**

**పెంటలఇంతులనోళ్ల పిరివీకు లౌను**

**చ 3: వలచినవలపులు వడిం దమచుట్టాలతో**

**అలరుచు ముచ్చటగా ననుకొందురు**

**యెలమి శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి**

**తలఁచి అందరికిని తారుకాణలాయను**



  

# అన్నమయ్య సంకీర్తనలు

శృ.రేకు: 1142-2 కాంబోది సం: 21-243

పల్లవి: ఏల వేగిరపడేరు ఇంత చాలదా

వేలు చూపి మెచ్చినదే వేవేలు గాదా

చ 1: వనితలు పెక్కుగలవల్లభునితోడుతను

చనవుగలుగుపాటే చాలు నవ్వులు

మనసుగలయుదాఁకా మంతనమబ్బిన దాఁకా

వినుకలిమాటంలే వేవేలు గాదా

చ 2: అన్నిటా నందరితోడా నలసినపతితోడ

చన్నులనొత్తినపాటే చాలు మేలము

విన్నపమందినదాఁకా విచ్చనవిడైనదాఁకా

వెన్నెలబాయిటికొల్పు వేవేలు గాదా

చ 3: సింగారాన నింటికివచ్చిన శ్రీవేంకటేశుతో

సంగడి గూచున్న పాటే చాలుఁ బ్రియాలు

అంగవించి యిట్లా న న్నలమి కూడినదాఁకా

వెంగెములేని పంతాలు వేవేలు గాదా



శృ.రేకు: 1142-3 మాళవిగౌళ సం: 21-244

పల్లవి: ఆయలేరే యేడ సుద్ది ఆతనికి నిది వన్నె

సేయుమన్నట్టెల్లా నేనే సేసేంగాక

చ 1: అట్టె రమణునికి నంతబాఁతే మామీంద

పట్టినవ్రతాన నేనే పైకొనేఁగాక

గుట్టు విడువఁ డాతండు కోరి మమ్ముఁ గైకొనీనా

వెట్టివలపులదాన వెస నేనే కాక

చ 2: తావుల పెక్కండ్లవిందు తలఁచీనా మమ్ము నేండు

కావలెననుచు నేనే కదిసేఁగాక

దేవరవంటివాఁడు తెమలీనా తనుందానె

వావులు వెదకేదాన వడి నేనే కాక

చ 3: అమ్మరో శ్రీవేంకటేశు కపురూపమా చెలులు

నెమ్మది మేనదాన నేనే కాక

వుమ్మడిం బంతమాడక వూరకుండీనా యీతఁడు

యెమ్మెల యిచ్చకురాల యేడా నేనే కాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1142-4 రామక్రియ సం: 21-245

పల్లవి: ఆ నేల పెట్టుమనేవు అంతలో నీపై

తానకమై నీకాపెకుఁ దగునిపుడు

చ 1: మిగులాఁజక్కనిదైనమెలుఁత నొక్కతె నీకు

తగిలించే వచ్చేవా తరి నావెంట

మగువ నాదోమతెరమంచములో నున్నది

నగనేల అప్పుడుగా నన్ను మెచ్చేది

చ 2: నీ కాపెకుఁ బొందుసేసి నిన్ను సంతోసించఁజేసే

వాకిచిచ మాఁటాడదు వలెనా నీకు

దాకొనీ గుట్టుమానిసి తలుపు ముయ్యుము వేగ

పైకొని యేల కొంకేవు పండీ నియ్యాన

చ 3: నెలవై శ్రీవేంకటేశ నే నలమేలుమంగను

యెలయించేనా నీకు నెవ్వరైరేమి

అలరి ఇదివో అంటే అట్టె కాఁగిలించితివి

కలసితి నేనే ఆపెగానా యీడను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1142-5 వరాళి సం: 21-246

పల్లవి: వేగిరించే విదియేమి వేవేలుసతు లుండఁగ

నీగుణాలు మంచివౌత నేఁడే చూపవలెనా

చ 1: సిగ్గువడి వుండఁగానే చేయివట్టి తీసేవు

దగ్గరివచ్చినవేళ తడవరాదా

నిగ్గు నించుకవడి నిలిచితేనే వలపు

వెగ్గళించి ఇంతలోనే వెల్లివిరిసీనా

చ 2: జలకేళి సేయఁగానే సారెఁ జేయిచాఁచేవు

పిలిచినప్పుడే వచ్చి పెనఁగరాదా

వెలయ వించుకవడి వేళగాచుకుండితేను

యెలమి జవ్వనమద మెదురుదొట్టీనా

చ 3: గుట్టుతోడ నుండఁగానే కూడితి శ్రీవేంకటేశ

పట్టితే నలమేల్మంగఁ బై కొనరాదా

యిట్టె యాపెయిచ్చలో నెనసితే నేమాయ

బెట్టుగా నీపెండ్లి వచ్చి పెళ్ల విడిశున్నదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1142-6 పాడి సం: 21-247

పల్లవి: చెప్పినట్టు సేసేఁగాని సిగ్గులువడితేఁ గాదు

పిప్పిగట్ట మోవియాని ప్రియమెల్లాఁ జెప్పుమా

చ 1: మంతనాన నుండరాదా మాఁటలాడీ నాపె దానె

బంతి నిందరిలోనైతేఁ బలుక దాపె

చెంతఁ గొలువునెల్లా చేతుల వేండుకొనేది

పంతమిచ్చి వోవరిలో పాదాలు వేఁడుకొమ్మా

చ 2: మనసు నమ్మించరాదా మగువ నీకు లోనయ్యీ

తనువెంత నిమిరినాఁ దరల దాపె

మునుప నీమోవియాకు ముదితకు నిచ్చేది

వెనక నాపెమో వేకు వెస నందుకొమ్మా

చ 3: గుట్టుతో నుండఁగరాదా కూడె ని న్నలమేల్మంగ

వొట్టిరట్టు సేయఁబోతే వోరువదాపె

దిట్ట శ్రీవేంకటేశ తెఱవ కుంగలమిచ్చి

మట్టె నీవు తీసుకొని మచ్చిక చేసుకొమ్మా




# అన్నమయ్య  సంకీర్తనలు


**శృ.రేకు: 1143-1 దేవగాంధారి సం: 21-248**

**పల్లవి: సేసినట్టె వానిఁ జేయనీరే**

**మాసటీనివంటి మంకువాఁడే**

**చ 1: పట్టఁగఁ బట్టఁగఁ బాముతల దొక్కె**

**యిట్టిపిన్నవాని నేమందమే**

**తిట్టఁగఁదిట్టఁగ దినె వెన్నలెల్ల**

**బట్టగుత్తుచలపాదివాఁడే**

**చ 2: కూయఁగఁగూయఁగఁ గోకలు దొంగిలె**

**వోయమ్మ వీఁడెంత వుద్దండీఁడే**

**తోయఁగఁదోయఁగ దుండగములు సేసె**

**చేయిమీఁదయి నట్టిసీఁటవాఁడే**

**చ 3: చెప్పఁగఁ జెప్పఁగఁ జేతఁ గొండ యెత్తె**

**అప్పుడే శ్రీవేంకటాద్రీశుఁడే**

**కప్పఁగఁగప్పఁగఁ గలసె నింతుల**

**అప్పఁ డలమేల్మంగాధిపుడే**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1143-2 నాదనామక్రియ సం: 21-249

పల్లవి: ఆతుర బంధుగుఁడవు అన్నిటా నాకు

యీతల నున్నాఁడవుగా యెప్పుడైనాను

చ 1: తలఁగి నీరాక గోరి దప్పిఁ బొరలేటివేళఁ

గలవుగా యిప్పుడైనాఁ గప్పురమీయ్య

జలజలఁ జెమరించి సదమదమై యుండగా

వెలినుండి వచ్చితిగా విసరనైనా

చ 2: చేరి నిన్నుఁ దలఁచుక చింతతోడ నుండఁగాను

నీరూపు చూపితివిగా నేఁడైనాను

ఆరీతి నిట్టూరుపుల నసురుసురై వుండఁగా

గారవించి స్వస్తపెట్టి కందువ నిల్తువుగా

చ 3: నీకుఁగా నెదురుచూచి నవ్వెరగై వుండఁగాను

కైకొని శ్రీవేంకటేశ కలసితివి

యీకడ నలమేల్మంగ నిటు సేవసేయఁగా

మేకొని యిప్పుడు నన్ను మెత్తువుగా నీవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1143-3 శంకరాభరణం సం: 21-250

పల్లవి: పొంచి యిఁక నెటువలె పొందు సేసేవే

దించరాని పొంతనాలు దేవరే కూర్చెనే

చ 1: పొలసి యాతనిదిక్కు చూడవదేమే

నలువంక నాతనిమై నాఁటీనంటానే

మలసి కొంతయినాను మాఁటలాడవే

నిలిచి యేమనినాను నిందమోచునే

చ 2: ముడువనే శిరసున ముడిపువ్వులూ

కడలేని వవియెకా కంతునమ్ములూ

అడరినదప్పి దేర నధర మీవే

నడుమఁ బలుసోఁకులు నాఁటీనంటానే

చ 3: శ్రీవేంకటేశ్వరునిఁ జెక్కునొక్కవే

ఆవల నొత్తినరేక లవి రాఁగీనే

కావిరి నలమేలుమంగవుగదవే

కైవశమై కూడితి వెక్కసమయ్యీఁగదవే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1143-4 నట్టనారాయణి సం: 21-251

పల్లవి: అప్పుడు నమ్మేవు నీవు అన్నిఁ దారుకాణలైతే

ఇప్పుడు నీతో మాకునేఁటికి వాదించను

చ 1: నీమోవిపై నించె నాపె నెయ్యమెల్లాను

కామించి నీవేల యెఱఁగవోకాని

దోమటి మాకైతే నిది తోడ దిష్టము

ఆమాట నిజమూఁ గల్లా నాపెనే యడుగుమా

చ 2: వువిదవలపులు నీవొళ్ల నించెను

అవల నీకేల తెలియదో కాని

వివరించి మాకుఁజాడ వెల్లావిరులు

తవిలి నీకిష్టమైనతరుణి నడుగుమా

చ 3: ముంచి నీమన్నన వురమున నించెను

అంచేలశ్రీవేంకటేశ అలమేల్మంగ

చంచులమీకూటములు సరివచ్చెను

యెంచఁగ మమ్మేలితివి యింతినే యడుగుమా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1143-5 శ్రీరాగం సం: 21-252

పల్లవి: నే నెఱఁగనా యిది నీవు చెప్పవలెనా

తేనెలమాట లాడఁగ దేవరపు గావా

చ 1: యిద్దరము నొక్కటే నీ వేమానినా నేమాయ

చద్దివేఁడిరతులలో సరసాలింతే

అద్దుక యేల లోఁగేవు ఆనలేల పెట్టేవు

తిద్దుక మాఁటలాడఁగ దేవరపు గావా

చ 2: నీవు నేను భేదమా నేర మిందులోన నేది

భావపుమందె మేళాలపలుకు లింతే

సేవలెల్ల సేసేవు చెక్కులేల నొక్కేవు

తీవరించి మాఁటలాడ దేవరవు గావా

చ 3: మనకేలెగ్గలమేలుమంగను న న్నేలితివి

చలవులతిట్లెల్లా సలిగె లింతే

చెనకి యేల మొక్కేవు శ్రీవేంకటేశ్వర నీవు

దినము నీమాఁటలాడ దేవరపు గావా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1143-6 తెలుఁగుఁగాంబోది సం: 21-253

పల్లవి: ఇందాఁక నెఱఁగనైతి నీకుఁ గపటము లేదు

చెంది యిట్టె నాతోడఁ జెప్పవయ్య మాఁటలు

చ 1: మంతనానకు రాఁగాను మనసెల్లా నొక్కటాయ

పంతము నీ వియ్యఁగాను పాసెఁ గోపము

అంతరంగము చెప్పఁగా ననుమాన మిఁక నెంచ

రంతులుసేయక యిట్టె రావయ్య యింటికి

చ 2: సరసు నీ వాడఁగా చల్లనాయ నామేను

సరుసఁ గూచుండగాఁను సమ్మతించితి

యెరవులేక నవ్వఁగా నిరవాయఁ గూరియులు

బిరుదులెల్లాఁ గంటిఁ బెట్టవయ్య విడెము

చ 3: గక్కన నీవు గూడఁగా కాఁతాళము లణఁగె

మిక్కిలి మన్నించఁగాను మెచ్చితి నేను

అక్కున శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను

వొక్కటై కూడితి విట్టె వుండవయ్య వొద్దను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1144-1 ముఖారి సం: 21-254

పల్లవి: చేరి చనవులే నీవు చెల్లించవయ్యా

వలవనివాసు లింక వద్దు నీకు నయ్యా

చ 1: కాంతలకుఁ బతులతో గబ్బితనమే వన్నె

కొంతపుఁజూపుతోడికోపమే వన్నె

మంతుకెక్కె గుట్టుతోడిమంకుఁదనమే వన్నె

ఇంతలో మీకు నెగ్గు లెంచనేఁటికయ్యా

చ 2: వెలలేని కొసరుల వెంగెపుమాటలే వన్నె

చలివాసినట్టి రాజసములే వన్నె

అలమిపట్టినవేళ నానలు పెట్టుటే వన్నె

యెలమి నాపెకు నీకు నేఁటిచలమయ్యా

చ 3: వొనగూడివున్న వేళ వుద్దండములే వన్నె

చనవులసరసజంకెనే వన్నె

యెనసి శ్రీవేంకటేశ యీపె నీ కిదే వన్నె

యెనలేనితరితీపు లేఁటి కింకా నయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1144-2 నాదనామక్రియ సం: 21-255

పల్లవి: ఎఱఁగనివానివలె యేలడిగే విటు నన్ను-

నెఱవుగా నింతసేసి నీవే యెఱఁగవా

చ 1: చెంగట నీవు నాకుఁ జేయిసన్న సేయఁగాను

పొంగి చెమరించితి నప్పుడుగాదా

ముంగిటినీచూపు నాపై ముంచి ముంచి చల్లఁగాను

అంగపుసొమ్ములు బిగువైనది యెఱఁగవా

చ 2: మలసి నీవు నాతో మాఁటలు గడునాడఁగా

మొలు నూలు జారెను నీముందరఁగాదా

వలపులు చల్లి నీవు వాడికెనవ్వు నవ్వఁగా

పులకలు జాజుకొని పొదలె నెఱఁగవా

చ 3: గక్కన నీవు నన్నుఁ గాఁగిలించి కూడఁగాను

నెక్కొనెఁ గెంపులు మోవి నీవల్లఁగాదా

అక్కజపుశ్రీవేంకటాద్రిగోవిందరాజవు

మిక్కిలి రతులలో నీమేలు నీవెఱఁగవా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1144-3 సామంతం సం: 21-256

పల్లవి: ఎటువంటి తగవరి వేమోయి నీవు

ఇటువంటి వాఁడవా యేమోయి నీవు

చ 1: మారుకొని యాపె సారె మాటలెల్ల నాడఁగాను

వూరకుండుమనేవు యేమోయి నన్ను

చేరియాపె కమ్మటిని చేతులు చాఁచఁగాను

యీరీతి నన్నే పట్టేవు ఇదేమోయి నీవు

చ 2: వుదుటున రేఁగి యాపె వొట్టులెల్లాఁ బెట్టఁగాను

ఇదె నా కడ్డాలు వచ్చే వేమోయి నీవు

పదరి యాపె పూవుబంతిఁ గొనివేయఁగాను

యెదిగి నీమే నొడ్డే వేమోయి నీవు

చ 3: పన్ని యాపె నా మీఁద పంతమెల్లాఁ జూపఁగాను

ఇన్ని నీపైఁ దీసుకొనే వేమోయి నీవు

వన్నెలశ్రీవేంకటేశ వాకిట నాపె వుండఁగా

యెన్న నన్ను లోనఁ గూడె వేమోయి నీవు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1144-4 వరాళి సం: 21-257

పల్లవి: నీ వెఱఁగవా ఇది నెరజాణవు

యీవల మాతో నీవే యెందాఁకాఁ జెప్పేవు

చ 1: పువ్వులఁ గొని వేసేది పుప్పొడి పైఁ జల్లేది

జవ్వనపుసతులకు సాజమే యది

నవ్వుసేసుకొంటేనే నానును వలపులెల్ల

చివ్వనఁ గోపించుకొంటే చేరుఁ గూళతనము

చ 2: మక్కువలు చూపేది మనసు సోదించేది

చక్కని కాంతలకును సాజమే యది

దక్కి లోనై వుండితేనే తతిగొనుఁ గూటములు

మిక్కిలి పెనఁగఁబోతే మించు నెడ్డతనము

చ 3: కరుణించి చూచేది కాఁగిలించి కూడేది

సరసపుటింతులకు సాజమే యది

నిరతి శ్రీవేంకటేశ నీకు నివే యింపులైను

వరుస నిటు గాకుంటే వచ్చు మంకుఁదనము





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1144-5 బౌళి సం: 21-258

పల్లవి: అన్నియుఁ జూతురుగాని యట్టె వుండరే
సన్న లాతఁ డెఱుఁగు వేసారకురే

చ 1: నీతులుగాఁ భోహణించి నే విన్నవించేది
ఆతఁడే యెఱుఁగునే అంగనలాల
రాతిరిఁబగలు నాడ రచ్చ లెంత సేసినాను
ఆతుమ యిక్కడ గుండు నాతనికిని

చ 2: యీడనేఁ గానుక మీచే నిచ్చి పంపేదెల్లాను
ఆడ నాతనిచే నున్న దతివలాల
చేడెలు పదివేగురు సేవలు సేసినాను
వేడుకెల్లా నామీఁదిదే విభునికిని

చ 3: కదిసి శ్రీవేంకటేశుకడకుఁ బోయేమనఁగ
అదె యాఁతడే వచ్చెనే అక్కలాల
అడ నెఱిఁగి కలసె నందరికంటె నాపై-
నెదుగా వలపుగద్దె యీతనికిని





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1144-6 కన్నడగౌళ సం: 21-259

పల్లవి: ఇంతి యదె నీ విదె యేమనేము నేమెల్లా

చింతలెల్లాఁ బాసెను నీచిత్త మింతే యిఁకను

చ 1: తలఁపెల్లాఁ దమకమే తనువెల్లాఁ జెమటలే

నెలఁత కెంతమోహమో నీమీఁదను

పిలిచినప్పుడు రాక బిగిసి యిప్పుడు వచ్చి

చెలరేఁగి నవ్వేవు నీచిత్తమింతే యిఁకను

చ 2: చూపులెల్లా నివ్వెరగే సుద్దులెల్లా నీకతలే

యీపడఁతి కెంతాసో యిటు నీమీఁద

రేపకాక రచ్చసేసి రేతిరి యీపె దగ్గరి

చేపట్టితి వింతలో నీచిత్తమింతే యిఁకను

చ 3: చెక్కులెల్లాఁ బులకలే సెలవులెల్లా సిగ్గులే

అక్కరెంతో కాఁగిటిలో నాపె నీమీఁద

గక్కన శ్రీవేంకటేశ కలసితివి కాంతను

చిక్కనాయ ననుపు నీచిత్తమింతే యిఁకను



శృ.రేకు: 1145-1 సాళంగనాట సం: 21-260

పల్లవి: మీటితివిగదవమ్మ మెచ్చితిమి నీసుద్దులు

ఆటడిఁబెట్టకువమ్మ అలమేలుమంగా

చ 1: పాయపువిభుఁడు తన్నుఁ బట్టి పెనఁగఁజూచితే

చాయకు వచ్చినదే సరసాలు

చేయిచాఁచి మీఁదమీఁద చెక్కునొక్కి వేఁడుకొంటే

రాయడి కోర్చినదే రసికురాలు

చ 2: సంగతిగా మాటలాడి సన్నలుసేసితేను

అంగము లంటినదే అధికురాలు

చెంగటఁ గన్నులెదుటఁ జేసినచేఁతలకెల్లా

కంగువెట్టుకోనిదే ఘనురాలు

చ 3: యిత్తలఁ జేతికిలోనై యెంతచన విచ్చినాను

తత్తరించకుండినదే దారకురాలు

బత్తితో శ్రీవేంకటాద్రిపతి నిన్ను నిదె కూడె

కొత్తగా నీవంటిదే కోవిదురాలు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1145-2 హిజ్జిజి సం: 21-261

పల్లవి: చెంగలించె నీమొగము జిగి నాపె దగ్గరితే

సంగడి నీ కపుడెంత సంతోసమో

చ 1: సోగచూపులనుఁ జూచి సుద్దులా పెడుగఁగాను

ఆగతి నీకపుడెంత ఆనందమో

చేగదేర మాఁటలాడి చెక్కులట్టె నొక్కఁగాను

బాగుగ నీకపుడెంత పరిణామమాయనో

చ 2: కొనగోరు సోఁకఁగ నీకొప్పు ఆపె దువ్వఁగాను

ఘనమైననీ కపుడెంత కళరేఁగెనో

తవియ నీతొడమీద తా దొడవేయగాను

మనసు నీకపుడెంత మర్మము దాఁకెనో

చ 3: గక్కన నలమేల్మంగ కాఁగిలించుకొనఁగాను

తక్కక నీ కపుడెంత తమ్మివుట్టెనో

అక్కున శ్రీవేంకటేశ ఆపె నిన్నటె కూడఁగా

పక్కన నీ కపుడెంత పరవశమందెనో





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1145-3 శుద్ధవసంతం సం: 21-262

పల్లవి: దొరవైననీతోడి పొందులు యెట్టయినా వచ్చు

మరకుండఁగరాదు మరగారాదు

చ 1: యెంగిలినోర మాట యెటువలె నాడేను

సంగడిఁ బలుకనంటా సారె దూరేవు

రంగగువాఁడిచూపు లూరక ని న్నట్టు నాఁటింతు

అంగవించి శిరసెత్త నని కొసరేవు

చ 2: చెమటచేతులను నీసేవ లెట్టు సేసేను

తమి విడెమియ్యనంటాఁ దత్తరించేవు

జమళిపాదాలు దాఁక సరినెట్టు గూచుండేను

అమర నీవద్దికి రానని సొలసేవు

చ 3: కుప్పెలవంటి చన్నులఁ గుచ్చి నిన్నెట్టె త్తేను

అప్పుడే కాఁగిలించనైతి ననేవు

అప్పఁడ శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను

యిప్పుడే కూడితి వింకా నేమని కోరేవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1145-4 శంకరాభరణం సం: 21-263

పల్లవి: ఇంగిత మెఱఁగలేవా యింత జాణవు

వుంగిటిగా నాపెనేల వొరసేవు నీవు

చ 1: నగవె ననుపు నయమె ప్రియము

తెగువే తెలివి దినదినమూ

మగువనుఁ జూడరాడా మాటాడ సిగ్గువడీని

అగడుసేసి యేల అడిగేవు నీవు

చ 2: పిలుపే నిలుపు పెనఁగుటే తగులు

చలిమే బలిమి సారెసారెకూ

కలదు యీచెలియందే; గక్కన గుట్టుతోనుంటే

సొలసి యాపెతోనేల సోదించేవు నీవు

చ 3: మరులే మచ్చికలూ మానమే మోనము

కరఁగులే యితవులు కలకాలమూ

మరలి ని న్నలమేల్మంగ శ్రీవేంకటేశుఁడ

యిరవై సొలసె నీ వింకానేల సొలసేవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1145-5 చాయానాట సం: 21-264

పల్లవి: ఇంతవాఁడవు గాకుంటే యెవతురా గోపికలు

చెంతకురాకతొలుతే చెలఁగె నామొకము

చ 1: పిలువకతొలుతే ప్రియముతో వచ్చితివి

తలఁచుకొంటివా నీతప్పనిబాస

నిలిచినంతటిలోనె నిండాఁ జెమరించితివి

కలయకతొలుతనె కరఁగే నామనసు

చ 2: అడుగకతొలుతే ఆనతిచ్చితి వీపని

పెడరేఁచె నావలపు బెట్టుగా నీకు

తడయకతొలుతే దక్కితివి నీవు నాకు

బడిబడి నీకృప ఫలమందెనా

చ 3: కానికాయీకతొలుతే కాఁగిటఁ గూడితి నన్ను

తానకపునీయాస దైలువారెనా

ఆనుక శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను

నానారతులు తొల్లె నాటివుండెనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1145-6 నాగవరాళి సం: 21-265

పల్లవి: ఏమి సేసునో నిన్ను యింకా నాపె

ప్రేమ నాపైఁ జేసేవంటాఁ బెనంగీనాపె

చ 1: మలసి నీతో నేను మాఁటలాడితినంటా

చలము సాదించి నిన్ను జంకించీ నాపె

నలిరేఁగి నీవప్పటి నవ్వులు నవ్వితివంటా

పెలుచుంబంతములెల్లాఁ బెంచీ నాపె

చ 2: చేతులెత్తి నే నీకు సిగ్గున మొక్కితినంటా

కాతరించి సారె నిన్నుఁ గసరీ నాపె

ఆతుమెల్లా నీవు నాతో నట్టె చెప్పితివంటా

యేతులెత్తి నీమీఁద యెమ్మెచూపీ నాపె

చ 3: యేకతాన నీతో నే నెనసివుందానవంటా

యీకడ నీవురమెక్కె నింతో నాపె

చేకొని కూడితి నిట్టె శ్రీవేంకటేశ్వర నీవు

దాకొనె నలమేల్మంగ తానే యాపె





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1146-1 గుండక్రియ సం: 21-266

పల్లవి: ఇంకనేల తమకించే నిందుకు నేను

సంకెలెల్లాఁ దీరెఁ జనవరి నేను

చ 1: వాములుగా వలపులు వలసినవారి కిచ్చి

నామొగము చూడఁగానే నవ్వితి నేను

చేముంచె నీచేఁతలు చేరె నీవుద్దండములు

యేమని వుత్తరమిచ్చే నియ్యకొంటి నేను

చ 2: వుమ్మడి నీవొక్కఁడవే వూరెల్లాఁ దిరిగివచ్చి

నమ్మికే నీవియ్యఁగానే నవ్వితి నేను

కమ్ముకొనెఁ జెమటలు కానవచ్చె గుఱుతులు

కమ్మటి నిన్ననలేక కానిమ్మంటి నేను

చ 3: అన్నిటా జాణతనాల నాయములెల్లాఁ గరఁగి

నన్ను నిట్టె కూడఁగాను నవ్వితి నేను

నిన్ను శ్రీవేంకటేశుఁడ నే నలమేలుమంగను

సన్నలఁ గలసి మోవి చవిగొంటి నేను









శృ.రేకు: 1146-2 మాళవి సం: 21-267

పల్లవి: ఏమి తగవులు చెప్పే మింకా మీకు

ఆముకొన్న వలపుల కవియెల్లా దొడ్డా

చ 1: తలపునిలువలేని తమకము గలయట్టి-

చెలి ని న్నెంతసేసినాఁ జెల్లునయ్యా

బలిమిఁ బట్టుక నిన్ను పడఁతులు చూడఁగానే

అలమొా వెంగిలిసేసే దదియేమి దొడ్డా

చ 2: ఆయములు గరఁగి కాయము మదించినసతి

చేయిమీఁదై చెనకఁగం జెల్లునయ్యా

దాయము వచ్చినవేళ దాఁచరానిచోట్ల

యీాయెడ గుఱుతుసేసు టదియేమి దొడ్డా

చ 3: అందుక నీవురమెక్కినట్టియలమేలుమంగ

చెంది నిన్నెంత గూడినాఁ జెల్లునయ్యా

అందపుశ్రీవేంకటేశ అట్టె పాదాలు చాఁచుక

యెందుకునైనా నవ్వే దిదియేమి దొడ్డా







# అన్నమయ్య సంకీర్తనలు

శృ.రేకు: 1146-3 దేసాళం సం: 21-268

పల్లవి: తిట్టినా వెఱవ వెంతదిట్టతనమే

గుట్టు విడిచితి వెంత గొంట వైతివే

చ 1: నావద్దనున్న పతితో నవ్వులు నవ్వేవు నీవు

చేవదేర నీకెంట చెల్లుబడే

కావికన్నులఁ నాతని గమ్మటి నాఁటఁ జూచేవు

తావికొని యెంత గబ్బితనమే నీది

చ 2: పొత్తుల మాయిద్దరికి పోరచి వెట్ట వచ్చేవు

యిత్తల నీపెద్దరిక మెంతగలదే

సత్తుగాఁ బైకొసరులు జాణతనాలూ నాడేవు

కొత్తగాఁ బోతర మింత కూడఁ బెట్టుకొంటివా

చ 3: నన్నిట్టె కూడినవాని నయగారాలఁ బెట్టేవు

కన్నె వోయమ్మ యెంతగామిడివే

ఇన్నిటా శ్రీవేంకటేశు నెలయించి చెనకేవు

సన్నల చాయలనే సవతివైతివా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1146-4 సామవరాళి సం: 21-269

పల్లవి: వింటిమి కంటిమి నాఁడే వీనులఁ గన్నులను

సొంటులు సోదించవద్దు జొబ్బిలీఁ జెమటలు

చ 1: చొప్పెలెత్తి పలుమారుఁ జూచితి నన్నియు నిట్టె

కప్పవద్దు నీచేఁతలు కల్లలు గావు

వుప్పటించెననవేవు నిన్నూరక నే నేమనినా

చెప్పవద్దు నీసుద్దులు చెల్లుబడులాయను

చ 2: బట్టబయటఁ బడెను పట్టితి మి మ్మిద్దరిని

గుట్టుసేయ నిఁక వద్దు గురుతు లివే

బెట్టుగా మోవికెంపులు బేట్లెత్తి నేఁజూపితి

ముట్టవద్దు నన్ను నీవు మునివేళ్లు చాఁచి

చ 3: దివ్వెవెలుఁగుననే తేటపడె నీకూటమి

నవ్వవద్దు నీ వంతేసి నయగారాల

రవ్వగా శ్రీవేంకటేశ రతి నిన్నుఁ జేసితిని

దువ్వవద్దు నాకొప్పు దొరకె వేడుకలు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1146-5 సౌరాష్ట్రం సం: 21-270

పల్లవి: సతులగబ్బితనాలే చవులు గావా

ఇతవులే సుమ్మీ నీకు నెరవులు గావు

చ 1: మనసు నీపైఁ బెట్టి మాటల నెంతదూరినా

చనవుగాఁ జేకొనుమీ చలము గాదు

పెనఁగ నాపెచనుమొనలు నిన్ను నాటితె

కినియకుమీ నీపైకేరడము గాదు

చ 2: యెదుటనే నిలుచుండి యెంత నిన్నుఁ గొసరినా

అది నీపై మేలు సుమ్మీ అలుక గాదు

పెదవుల మాటాడఁగా పెనుఁదిట్లు వెళ్లితే

పదరకుమీ నీతో పంత మిది గాదు

చ 3: కడుసరసమాడుతాఁ గరము నీపైఁ జాఁచితే

విడువని పొందుసుమ్మీ వెగటు గాదు

అడరి శ్రీవేంకటేశ అతివఁ గూడి నవ్వితే

వెడమాట లాడకుమీ వెంగె మిదిగాదు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శ్రృ.రేకు: 1146-6 శుద్ధవసంతం సం: 21-271

పల్లవి: ఇటువంటికొత్తలు నే మెఱఁగమమ్మ

చిటుకుమని నంతనే చిమ్మిరేఁగేవు

చ 1: మంచి మాఁటాడేపతిని మలసి తిట్టే ననేవు

యెంచరానిరాఁగతన మేల సేసేవే

పొంచి పువ్వుల వేసితే బొప్పిగట్టె మేననేవు

నించి యాతఁ డందుకేపో నివ్వెరగు నందెను

చ 2: పచ్చడము గప్పితేనే బలిమిసేసె ననేవు

అచ్చలాన నీ వెంతగయ్యాళివే నేఁడు

పచ్చిమోవి యానఁగాను పగసాదించీ ననేవు

కచ్చుపెట్టి యివియెల్ల గామిడితనములా

చ 3: యేకతానకుఁ దీసితే యీడిచెను నిన్ననేవు

పైకొని యెంతటినేరుపరివే నీవు

యీకడ శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె

మేకొని యిందుకే నేము మెచ్చితిమే నిన్నును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1147-1 కేదారగౌళ సం: 21-272

పల్లవి: అదియు నీభాగ్యము అవధరింతువుగాక

వెదకివచ్చేటివారే వేగినంతాను

చ 1: కాతరించి నీమోము గంటేఁజాలుఁగాని

చేతులు చాఁచేవారే చెలులెల్లాను

ఆతలనీతల నీవు అండకు వచ్చితేఁ జాలు

యేతుల నవ్వేవారే యేడనైనాను

చ 2: మక్కువ నోరుదెరచి మాట నీవాడితేఁచాలు

గక్కనఁ దిట్టేవారే కాంతలెల్లాను

చక్కనినీ వేపాటి సమ్మతించినాఁజాలు

యిక్కువ లంటేవారే యెవ్వరైనాను

చ 3: వలపులు చల్లుచు నీవు వావులు చెప్పితేఁ జాలు

అలరి పెండ్లాడేవారే అంగనలెల్లా

యెలమి శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి

కలసేమనేవారే యేకాలమైనాను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1147-2 మధ్యమావతి సం: 21-273

పల్లవి: ఏఁటికిఁ దమకించే వేల పెట్టే వానలెల్లా

నీటుతోనే వుండరాదా నిజమయ్యీగాని

చ 1: యిందరిలో రంతులేల యింటికి విచ్చేయరాదా

చెంది నీతో నొకమాట చెప్పేఁగాని

విందువలె నాచేతివిడె మందుకోరాదా

కందువ మీఁదటిసుద్ది గనేవు గాని

చ 2: పాసివుండక పానుపుపైఁ బవళించరాదా

రాసికెక్క నీచిత్తము రప్పించేఁగాని

పోసరించి నామోవిపొత్తు గలయఁగరాదా

ఆసల నీపనికి సహాయమయ్యేగాని

చ 3: పక్కన నిట్టె నీపచ్చడము గప్పరాదా

నిక్కము నానేరుపులు నెరపేఁగాని

యిక్కడ శ్రీవేంకటేశ యెనసితి మిద్దరము

చెక్కునొక్క నియ్యరాదా సేసవెట్టేఁగాని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1147-3 హిందోళవసంతం సం: 21-274

పల్లవి: మాతోడి గొడవేల మాపుదాఁకాను
యేతులకు వెంటవచ్చే విది యేమోకాక

చ 1: సింగారించఁగానే ఆపెచేతికి లోనైతివి
వుంగరపువేలిగోరి కొరవైతివి
కంగినతిట్ల కెల్ల కణఁజమైతివి
పంగెనమానిసి వింక పనికివచ్చేవా

చ 2: కమ్మటి నాపెమోవికిఁ గంచమవైతివి
దొమ్మిచూపులబందెకు దొడ్డివైతివి
పమ్మినవవ్వులకెల్లా పడిగమవైతివి
వుమ్మడివాఁడవు నీకు నున్నదా స్వతంత్రము

చ 3: కలికిరతులకెల్లా గద్దెవు నీవైతివి
వలపులపంటకెల్ల వామివైతివి
బలిమి శ్రీవేంకటేశ పైకొని న న్నేలితివి
వలరాచకయ్యాన నీవంక వేసటున్నదా



శృ.రేకు: 1147-4 చా(ఛా?)యానాట సం: 21-275

పల్లవి: ఇదివో నీపెద్దరిక మెంతని విన్నవించేము

కదిసి కదిసి ఊతిగని వైతివి

చ 1: ఆపెకును నీకెకును ఆసలు నీవిచ్చి యిచ్చి

చేపట్టి చేరవచ్చితే సిగ్గువడేవు

కోపుల నిరువంకలా కొనగోళ్లు మేననంటి

యేపున నడిగితేను యెమ్మె చెప్పేవు

చ 2: యిద్దరినడుమ నీవు యేకతానఁ బవ్వళించి

వుద్దండాలు సేసితేను వొద్దుకొనేవు

చద్దికి వేఁడికి వారు చన్నుల ని న్నొత్తి తేను

వొద్దిచెలులసాకిరు లూరకె పెట్టేవు

చ 3: శ్రీసతి భూసతిని చేసూటిఁ గూడికూడి

సేసలు నీపైఁ బెట్టితే చెలరేఁగేవు

ఆసల శ్రీవేంకటేశ అందరుదేవుళ్లతోడ

తాసువలెఁ దులఁదూఁగి దయిలువారేవు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1147-5 ఆహిరినాట సం: 21-276

పల్లవి: ఏఁటిదో నీమతకము యెఱఁగ నేను

నోటినీయానలకు వీనులు మూసీఁ దాను

చ 1: యేతలఁపు దెలిసెనో యెచ్చుకుందు గలిగెనో

నాతో నీవు మాఁటాడఁగ నవ్వీ నాపె

కాతరాన నీవు నాకు కడుగిందుపడి యిట్టె

చేతులు ఛాఁచఁగాను సిగ్గువడీఁ దాను

చ 2: యేకడ దెచ్చితివో యెందరి భ్రమయింతువో

నాకు విడెమియ్యఁగాను నవ్వీ నాపె

జోకకు నాసింగారాలు చూచి చూచి సారెకు

దాకొని నీవు మెచ్చఁగ తలవూఁచీఁ దాను

చ 3: యేపున వింతకుముందే యెవ్వతెఁ బెండ్లాడితివో

నాపై సేసవెట్టఁగ నవ్వీ నాపె

రాపుగ శ్రీవేంకటేశ రతి నన్నుఁ గూడితివి

చాపలాన నింతలోనే సంతసించీఁ దాను




# అన్నమయ్య  సంకీర్తనలు


**శృ.రేకు: 1148-1 సామవరాళి సం: 21-277**

**పల్లవి: ఆఁటది గూళయైతే నందేమి చెప్పేము నేము**

**వాటముగ నీవైన వద్దనవద్దా**

**చ 1: వూని యేకతాన నీవొద్ద నేఁ గాచుకుండగా**

**కానుకె లిచ్చి తగిలీఁ గదిసి తాను**

**మానకు నీతో నేను మంతనములాడఁగాను**

**ఆనుక యెంగిలిమాట లాడనేల తాను**

**చ 2: పడతినై నే నేకు బాగాలిందియ్యఁ గాను**

**యెడ నాకుమడిచిచ్చీ యేఁటికిఁ దాను**

**జడిగొని నీతో నేను సరసములాడఁగాను**

**కడిగి పయ్యదకొంగు కప్పనేల తాను**

**చ 3: గద్దించి ఇంతలో నేను కాఁగిలించుకుండఁగాను**

**చద్దివేఁడివలపేల చల్లీఁ దాను**

**ఇద్దరము శ్రీవేంకటేశ పోద్దై కూడఁగాను**

**బద్దులకునేల వొడఁబరచీఁ దాను**




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1148-2 పాడి సం: 21-278

పల్లవి: ఒద్దు వొద్దు చాలుఁ జాలు నోపదయ్యా

ఇద్దరితమకముల నిఁక యెంతయౌనో

చ 1: కొమ్మ నీతో నవ్వఁగాను కొప్పున విరులు రాలె

చిమ్ముఁజూపులు చూడఁగఁ జెమరించెను

నెమ్మి సాగిలి మొక్కఁగా నిట్టూరుపులు రేఁగె

యెమ్మెల పొందుసేసితే నిఁక నెంతయౌనో

చ 2: సంగడిఁ గూచుండఁగాను జాజుకొనఁ బులకించె

అంగవించి మాటాడఁగా నాయము లంటె

ముంగిటఁ జెనకఁగాను మోపులాయ వలపులు

యెంగిలిమోవి పొత్తుల నిఁక నెంతయౌనో

చ 3: గక్కనఁ గాంగిలించఁగా కడుఁ గరఁగె మనసు

చెక్కునొక్కఁగా సిగ్గులు చిమ్మిరేఁగెను

మక్కువ శ్రీవేంకటేశ మానినిఁ గూడితి విట్టె

ఇక్కువలెల్ల నంటఁగా నిఁక నెంతయౌనో



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1148-3 బౌళి సం: 21-279

పల్లవి: ఎవ్వరు నిన్నాడుకొనే రేది వెంగె మిందులోన

రవ్వగా మొక్కఁగరాదా రచ్చలోన నీకును

చ 1: తగవరివౌదువు తప్పు నీయందేమిలేదు

నగరాదా వూరకె నాలోనను

వెగటు నీ కెక్కడిది వెరపు నీకిఁకనేల

మొగము చూడరాదా మంచి నాకు నేఁడు

చ 2: పంతగాఁడ వౌదువు బాసచేసితే మీరవు

సంతోసించఁగరాదా సారెసారెకు

వింతవా రిందులో వేరీ; వేడుకచుట్టానే నీకు

మంతనమాడుకోరాదా మాలో మేము

చ 3: దయగలవాఁడవు తగ్గుముగ్గు లెరఁగవు

ప్రియము చెప్పఁగరాదా పెనఁగి నీకు

నియతి శ్రీవేంకటేశ నీవు నన్ను నేలితివి

నయము చూపఁగరాదా నంటుసేసి నీకు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1148-4 దేసాళం సం: 21-280

పల్లవి: ఏఁటికిఁ జేసేవు నాతో నింకా గుట్టు

యీటువెట్టి సతులకు నిదె చాలౌఁజుమ్మీ

చ 1: అన్నువచెమటలతో నలసి నీవు రాఁగాను

నిన్నుఁ జూచి నామనసు నీరాయను

యిన్నిటా నానతీవయ్య యెవ్వతె నీ కింత సేసె

పన్ని వాదువెట్టుకొని పచరించే నాపెను

చ 2: వింతవింతనీమేనివెడవెడగురుతులు

కొంతగొంత వొడగని కోపమాయను

పంతగత్తె యెవ్వతె యీపాట్లఁబెట్టెను నిన్ను

రంతుల నందరిలోన రచ్చవేసేను

చ 3: కందువకు వచ్చి నన్ను గాఁగిలించి కూడఁగాను

విందులనీనేర్పులకు వెరగాయను

అందపు శ్రీవేంకటేశ అవ్వల నెవ్వతె నేర్పె

చందము సేసుక నేను సారె మెచ్చే నాపెను



www.annamayya.net



# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1148-5 బౌళి సం: 21-281

పల్లవి: అందుకేమి దోసమా అటువంటిఁవాడవా

నిందలేని నీమీఁద నించవద్దా మోహాము

చ 1: తగవు నీవు చెప్పఁగా తప్పు లందు లేకుండఁగా

నగరాదా నీతోను నయముగాను

మొగము నీవుచూడఁగ మొక్కులు చేత నుండఁగ

చిగురుఁబెదవులెత్తి చెప్పరాదా ప్రియము

చ 2: కప్పురము నీ వియ్యఁగా కాయమెల్లఁ జల్లఁగాఁగా

ముప్పిరి మెచ్చఁగ వద్దా ముందు ముందే

కొప్పు నీవు దువ్వఁగాను కొంగు చేతఁ బట్టఁగాను

నెప్పున సిగ్గులు నీపై నించరాదా నాకును

చ 3: విడెము చేతికియ్యఁగా వేడుకఁ గాఁగిలించఁగా

కూడవద్దా నిన్ను నేను కొఱతదీర

జోడై నీ వుండఁగాను చొక్కఁగా శ్రీవేంకటేశ

వూడిగాలుసేసి వొద్దనుండరాదా ఇఁకను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1148-6 లలిత సం: 21-282

పల్లవి: నీ వేమి సేతువు నీవొళ్లికల్లగాదు

వావులు మోవితేనె నవ్వఁగఁ జూతురు

చ 1: సేసవెట్టి లచ్చిమమ్మ చెంగటనే వుండఁగాను

ఆసపడే వెవ్వరికో అప్పటి నీవు

యీటులేని సిరులెల్లా నింటిలోనే వుండఁగాను

కాసు వీదిఁ బడియుంటే కైకొని యెత్తుదురు

చ 2: వింతగా భూసతి నీవీఁపుననే వుండఁగాను

చింతించే వెవ్వరినోయి సిగ్గువడక

దొంతిఁ బెట్టి రుచులెల్లా దొరకి తమకుండినా

చింతకాయ గనుఁగొంటే చేరి నోరూరుదురు

చ 3: సింగారపుఁ దొళశమ్మ శిరసుపై నుండఁగాను

ముంగిట నెవ్వరికోయి మోహించేవు

ఇంగితాన శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

అంగడిబేరాల కొసరదుగక మానరు




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1149-1 భైరవి సం: 21-283

పల్లవి: ఇంత చాలదా నాకు యేమిసేసుఁ జలములు

పంతగాఁడు తా నిట్లా బతికితేఁ జాలును

చ 1: పిలువఁగనేల తన్ను బిగిసితేఁ దిట్టనేల

కలఁడుగా మాకుఁ దానే కలకాలము

చలివాసె వేయిటిపై జవ్వాదికొమ్ముపలె

తొలుతటిచెలులలో తొరలివుందానను

చ 2: తనతోడిమాటలేల తప్పితేఁ గోపించనేల

మనసున నున్నదిగా మామీఁదిమేలు

మునుకొని తనకు నే ముద్రలోనిసొమ్ముపలె

తనవనితలలోన తగిలివుందానను

చ 3: మొగము చూడనేల తా మొక్కితే దీవించనేల

అగపడి కూడెఁగా తా నప్పుడే నన్ను

జిగి శ్రీవేంకటేశుముఁజేతికంకణమువలె

తగుఁబట్టపు దేవులదండనే వుందానను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1149-2 వరాళి సం: 21-284

పల్లవి: నీకే తెలుసు నిది నేమేమి విన్నవించేము

చేకొన్న రమణిమతి చిక్కుదీర్చవయ్యా

చ 1: మచ్చరమే లేనిసతి మాటలెన్ని యాడినాను

విచ్చనవిడిరతికి వెంగెము గాదు

అచ్చపుమోహాన నింతి ఆయమెంత తాఁకించినా

మచ్చికె పెరుగుఁగాని మఱి నొప్పిలేదు

చ 2: కైవశమయ్యినకాంత కాఁకలెన్ని చల్లినాను

వేవేలై మతికిని వెట్టదోఁచదు

సేవసేసేయట్టి చెలి సిగ్గులెంత రేఁచినాను

మూవంకలపొందులకు మొగచాటై వుండదు

చ 3: సేసవెట్టినమగువ సిగ్గున నెంతమీరినా

వీసమంతాఁ గాఁగిటికి వేసటేది

ఆసల శ్రీవేంకటేశ అంగన నిట్టె కూడితి

వాసితోడి సరసము వడిఁబడదు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1149-3 కురంజి సం: 21-285

పల్లవి: సంగతి యెఱఁగవద్దా జాణకాఁడవు

అంగడి వేతురా మోహ మాసోదకాఁడవు

చ 1: చెక్కు చేత నిడుకొని సిగ్గున నవ్వేచెలిఁ

బక్కన నేల పట్టేవు పంతఁగాడవు

చిక్కనిచెమటతోడ చేతులెత్తి మొక్కేయాపె-

నిక్కువ లంటుదురా యింతవాఁడవు

చ 2: అడరి తెరమాటున నానలువెట్టేఇంతిఁ

దొడికి పట్టుదురా దొరవాఁడవు

వొడఁబాటు మాటల నే వొద్దనే లోనైవుండఁగా

పుడుకుదురా చన్నులు బూములేలేవాఁడవు

చ 3: అంగవించి నీసేత కడ్డమాడనిసతిని

యెంగిలిసేతురా మోవి ఇంపూవాఁడవు

రంగు శ్రీవేంకటేశ రతి నెనసి చొక్కించి

పంగింతురా యింతలోనే బలువాఁడవు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1149-4 సాళంగనాట సం: 21-286

పల్లవి: ఊరకుండు చాలుఁజాలు వొరలోనఁ బెట్టు మిఁక

సారపునీవినయాలు సతములయ్యీనా

చ 1: పయ్యదేల పుడికేవు పంతములేల ఇచ్చేవు

తియ్యనినీమాటలెల్లఁ దెలిసె నాకు

చెయ్యార నీవు నాకు సేసినబాసలే చాలు

వెయ్యయినా నీవినయాలు వీనులఁబట్టీనా

చ 2: కన్నులనేల మొక్కేవు కడునేల నవ్వేవు

తిన్ననివలపెల్లాఁ దెలిసె నాకు

చిన్ననాఁడు నామీఁద సేసవెట్టినదే చాలు

యెన్నైనా వొడఁబాటు లితవయ్యీనా

చ 3: బలిమేల సేసేవు పైకొని యేల మెచ్చేవు

తిలకించ నీమేలు తెలిసె నాకు

యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి

అలరి యెంతైనా నీపై యాసమానీనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1149-5 సింధురామక్రియ సం: 21-287

పల్లవి: ఊరివారిఁ జూచి చూచి వూరకే నోరూరనేల

ఆరీతి నీకెందుకైనా ఆసపడనేఁటికి

చ 1: కన్నులెంత గనమైనాఁ గాంతకే చక్కఁదనము

చన్నులెంత గనమైనా సొగు బలిమి

యెన్నుకొంటా సారె సారె నేల యేఁకరేవు నీవు

విన్న నీవెంచుకోరాదా నీకేల యీగొడవ

చ 2: నెఱి దురుమెంతైనా నెలఁతకే సింగారము

పిఱుఁ దెంతబటువైనా పెద్దఱికమే

పఱచై పొగడ నీవు బట్టువాఁడవా యేమి

గుఱుతువెట్టుకొనరాదా కొంచపడనేఁటికి

చ 3: మొగమెంత మెఱుఁగైనా ముద్దుగాఁ జెలియకు

నగవెంత గలిగినా నయమై తోఁచు

వెగటుదీర శ్రీవేంకటేశ కూడితివి

మగువనే మెచ్చరాదా మచ్చికలే నిండును





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1149-6 నాదనామక్రియ సం: 21-288

పల్లవి: ఎందువోయీ దాను యేల మానే నేను

సందడి వేఁడికాఁకలు చల్లారనీవే

చ 1: తమి యెంతరేఁగినాను తగులమౌఁ బొందులు

తెమలి పొద్దులు వుచ్చితే నేమాయనే

చెమటెంత పుట్టినాను చిగిరించు వలపులు

సముకాన సరసము సొముసేయ నియ్యవే

చ 2: నగవెంత గలిగినా ననుపులు సతమౌను

యెగసక్కేన నుండితే నేమాయనే

తగవెంత నడపినా తరితీపౌఁ బనులెల్లా

మొగమెదుటనే కొంత మొక్కులాడనీవే

చ 3: భావమెంత చిక్కినాను పరవశములు మించు

తావుల మనోరథాలు తలఁచనీవే

యీవేళ శ్రీవేంకటేశుఁ డిట్టే నన్నుఁ గూడినాఁడు

వేవేలుప్రియములు వెదచల్లనీవే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1150-1 కుంతలవరాళి సం: 21-289

పల్లవి: ఇందాఁకా నామంకుబుద్ధి ఇట్లుండెను

కందువకు రాఁగాను కడమెల్లాఁ దీరెను

చ 1: మక్కళించి మక్కళించి మాటలు నీవాడఁగాను

గక్కన నామనసెల్లఁ గరఁగె నిదె

చెక్కులు నొక్కి నొక్కి చేరి నీవే వేఁడుకోఁగా

ఇక్కువ సెలవినవ్వు లిదె వచ్చెను

చ 2: చనవుసేసుక నీవు సారెసారెఁ బెనఁగఁగా

తనివిదీరనియట్టితగులాయను

కొనబుఁజూపులు చిమ్మి కొచ్చికొచ్చి చూడఁగాను

వెనకమునుపులెల్ల వింతలాయను

చ 3: కాఁగిలించి కాఁగిలించి కమ్మటి నీవు గూడఁగా

మాఁగినమోవి సదమదమాయను

యేఁగి వచ్చి పెండ్లాడితి విదివో శ్రీవేంకటేశ

వీఁగనిసిగ్గులు వెల్లవిరులాయను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1150-2 గౌళ సం: 21-290

పల్లవి: పొద్దువోనివాఁడవు బొంకేవుగాక

వుద్దండపునీగుణాలు వొద్దికలయ్యీనా

చ 1: మొగమెంత చూచినాను మొక్కులెన్ని మొక్కినాను

చిగిరించినవలపు చేఁగలెక్కీనా

నగవెంత నగినాను వయసెంత చూపినాను

పొగరులనీమాటలు పొసఁగివుండీనా

చ 2: తీపు లెంతవుట్టించినా తిద్దీని వంకలాడినా

పూపనియాసలు నేఁడు పుల్లటొరలా

వోపి యంతవోరిచినా వూడిగ మెంతసేసినా

నీపలుచుఁజేఁతలు నేడు చక్కనవునా

చ 3: మనసెంత గరఁచినాను మచ్చికెంత రేఁచినాను

పెనఁగొన్నరతు లిఁక బీరుపోయినా

ననిచి శ్రీవేంకటేశ నన్ను నిట్టె కూడితివి

వినవయ్య నీమన్నవ వేరొకటయ్యీనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1150-3 రామక్రియ సం: 21-291

పల్లవి: నావంటి సతులే నన్ను మెత్తురు

భావించ నీకే నేను బాఁతిగాఁగాని

చ 1: చిన్నదాననైనా నీచిత్తము రా సేవసేతు

నన్ను నే పొగడుకొన నాయము గాదు

వున్నతినీచేఁతలకు వోరుతు నెంతేసికైనా

యెన్నిక నీతో నేను యీడురాఁగాని

చ 2: కడుగర్వినైనా నీకతలకెల్లా లోను

బడిబడి విన్నవించఁ బాడిగాదు

యెడయక యిచ్చకాన నెప్పుడూ నీవద్దనుందు

ముడిమాఁటలను నీపై మోపుగట్టఁగాని

చ 3: పట్టపుదేవినైనా నీపలుకులెనె నడతు

దట్టించి నీ కెచ్చరించఁ దగవుగాదు

యిట్టె శ్రీవేంకటేశ యెనసితి నిట్లు నిన్ను

అట్టడితనాన నే నాఅడిసేయఁగాని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1150-4 ముఖారి సం: 21-292

పల్లవి: తనకు నాకుఁ బోవునా తానేల పదరీనే

ననుపులకెల్లాను నవ్వే గురిగాదా

చ 1: అలిగి నేనూఁ దాను నాడా నీడా నుండినాను

తలపోఁతలకు గురితానే కాఁడా

యెలమి నాడకు నన్ను నేల పిలువనంపీనే

మలసి తాఁ జెప్పించినమాటే గురిగాదా

చ 2: పంతముతో తను నేను పలుమారు బిగిసినా

అంతరంగములో గురి ఆసలే కావా

వంతదీర నింతలోనే వాకిటికేల వచ్చీనే

యెఁత్తైనా మేనరిక మీదే గురిగాదా

చ 3: మంచముపై సిగ్గులను మారుమోములై యుండినా

పొంచి రతులకు గురి భోగమే కాదా

అంచెలశ్రీవేంకటేశుఁ డట్టె నిన్నుఁ గూడె నిదె

మంచితనముద్రలకు మోవే గురిగాదా







# అన్నమయ్య సంకీర్తనలు

శృ.రేకు: 1150-5 గౌళ సం: 21-293

పల్లవి: నేము బుద్దులు చెప్పేమా నెలఁతకును

దీమసము నీవల్లనే తేటతెల్లమాయను

చ 1: చెప్పరాని మాట లేమిచెప్పితివో అపెతోడ

ముప్పిరిసిగ్గులతోడ మోము వంచెను

తప్పకుండా నేడ నేడఁ దాఁకించితివో గోరు

రెప్పలెత్తి చూచి మేలు రేచుకొనెను

చ 2: నవ్వరాని నవ్వులేమి నవ్వితివో ఆపెతోడ

దువ్వటపుపయ్యద మీఁదు బిగించెను

రవ్వ నెంత వూడిగాలుద రతిఁ జేయించితివో

పువ్వులచెండున నిన్నుఁ బూఁచి వేసెను

చ 3: సేయరాని సేఁత యేమి సేసితివో ఆపెను

కాయము బిగించి నిన్నుఁ గాఁగిలించెను

యీయెడ శ్రీవేంకటేశ యెంతగా మన్నించితివో

చాయల సన్నల మొక్కి సంతోసించెను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1150-6 సౌరాష్ట్రం సం: 21-294

పల్లవి: మారుకొనేదాననా మచ్చరించి నీతోను

కోరికలే పచరించి కూడుకుందుఁగాక

చ 1: పంతమాడఁగలమా పలుమారు నీతోడ

చెంతఁబ్రియమాడేనోటిచెలులము

రంతుల నీ వికఁ నెంత రాజసము చూపినాను

అంతయు నే నిచ్చగించి అలరుదుఁగాక

చ 2: కొసరఁగఁగలమా కొంగువట్టేనీతోను

వెస నూడిగాలు సేసేవెలఁదులము

పసలుగా నీవెంత బలుములు చూపినాను

పొసగ నీకే లోనై పొందేదానఁగాక

చ 3: సిగ్గువడఁగలమా చెనకేటినీతోను

వొగ్గి నీరతులకెల్ల వోపుదుఁగాక

కగ్గక శ్రీవేంకటేశ కడు మందెమేళమైన

నిగ్గుల నిన్నే పొగడి నిండుకుందుఁగాక





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1161-1 నారాయణి సం: 21-295

పల్లవి: తనతోడి యీడువెట్టి తానేల మమ్ముఁ దడవీ

ఘనుఁడైతే బూములేలఁ గర్త గానీవే

చ 1: తాలిమెంతగలిగినా తానే బతుకనీవే

ఆలరికాంతలకెల్లా నవి వచ్చీనా

చాలా నవ్వితేను ఆజాణతనముఁ దనదే

మేలిమతనగుణాలు మెలుఁతల కుండునా

చ 2: యింతుల కిచ్చకుఁడైతే యీపుణ్యముఁ దనదే

బంతినున్న వారికెల్లఁ బట్టుపడీనా

యెంత తాఁ బంటమిచ్చినా ఇదియూఁ దనకే వన్నె

వంతులు మాకు నడప వసగాదుగాక

చ 3: యెందరిరొచ్చుకోర్చినా యీ కీరితి దనదే

అందరికిఁ దనవలె నలవడీనా

యిందరిలో శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె

విందులయీమోహానకు వెల వున్నదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1161-2 దేశాక్షి సం: 21-296

పల్లవి: ఇదివో నీభాగ్యము యేమని చెప్పఁగవచ్చు

పొదలు సరసముల పోగులాయఁగదరా

చ 1: వుప్పతిల్లుఁగుచముల నూఁదిపట్టి ఆపె నీతోఁ

జెప్పఁగలమాటలెల్లాం జెప్పఁగాను

చిప్పిలేవు చెమటల జెలియకాఁగిలే నీకు

కుప్పళించి మంచి కేళాకూళి ఆయఁగదరా

చ 2: బాగాలిచ్చి సారె సారె పైతరవై అపె నిన్ను

వేగినంతా గోరనంటి వేఁడుకోఁగాను

యీగతి బులకించేవు యీపెతోడిసరసమే

జాగులేని పువ్వులవసంత మాయఁగదరా

చ 3: చిగురునీమోవి యాని చేరి యాపె మొక్కఁగాను

నగుతా శ్రీవేంకటేశ నన్నేలితివి

తగ నీ విద్దరితోడఁ దమకించి పెనఁగేవు

తగిలి రతులు నీచే తాసులాయఁగదరా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1161-3 పాడి సం: 21-297**

**పల్లవి: ఇంతి యిదె నీవిదె యిఁక నెన్నఁడు**

**సంతసాలు రేఁచకుంటే చవు లేడ నున్నవి**

**చ 1: అలిగి మాఁటాడనట్టిఅతివను నేరుపున**

**పలికించకుంటేను పంతములేవి**

**చలపట్టిన గొంటెతఁ జక్క నవ్వించకుంటేను**

**తలకొన్న నీజాణతన మేమి వున్నది**

**చ 2: చెక్కుతోఁ జింతించేయాపెఁ జెలరేఁగించి సారెకు**

**చక్కఁగా నవ్వించకుంటేఁ జనవులేవి**

**మొక్కలాన రతులకు మొగియకవున్నయాపె**

**మొక్కఁ జేసుకొనకుంటే మోహమేమి వున్నది**

**చ 3: కతలుచెప్పినసతిచే కాఁగిలింపించుకొనకుంటే**

**యితవు శ్రీవేంకటేశ యేమున్నది**

**తతిగొని నిన్నుఁ గలసి తమకించేయాకెనిండు-**

**వ్రత మీడేరుచకుంటే వాడికేమి వున్నది**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1161-4 వరాళి సం: 21-298

పల్లవి: చవిగావు నీవెంత సటలు సేసినాను

తవిలి లోకులు నీకుఁ దప్పు లేదనేరా

చ 1: యెన్నియానలు వెట్టుక యెంత వొడఁబరచినా

వెన్న నీవు దొంగిలివా వెనకకును

నన్నుఁ జూచి నీవెన్నేసి నవ్వులు నవ్వినాను

నిన్నును నీసుద్దులును నే నెఱఁగనా

చ 2: అందరు జూడఁగా నీవు ఆచారాలు సేసినాను

చెంది చీఁకటితప్పులు సేయవా నీవు

యిందులోనే నాయెడకు యిచ్చక మేమిసేసినా

అందుకొని నిన్ను వెంగెమాడక వీఁగుదునా

చ 3: మనసచ్చి నీవెంత మక్కువ నాకుఁ జేసినా

తనివోక ముట్టవా పదారువేలను

ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను

చనవున నీరతుల చలము విడుతునా



శృ.రేకు: 1161-5 రామక్రియ సం: 21-299

పల్లవి: చూడరమ్మ యీతనిసుద్దులెల్ల నిట్లానే

వేడుకమాఁటలకెల్ల వెసఁ గారాలెక్కవా

చ 1: నగనేరిచినచోట నగితే నమరుఁగాక

జగడగానితోడ సరసమేలా

మొగము నేఁ జూచితేను మొక్కలానఁ దిట్టవచ్చీ

యెగసక్కెపుచన్నుల కిఁక వాండ్లెకవా

చ 2: ఆసలుచల్లేచోట నట్టే కొసరుటగాక

మాసటీనితోడ మారు మలయనేల

బాసగలవాఁడవంటే పై పైనే వొట్టు వెట్టీ

యీసున చిగురుగోళ్ల కిఁక చేఁగలెక్కవా

చ 3: సులభమయినచోట సూటిపడుఁగాక మేలు

చలపాదివాని తోడ సణఁగులేల

యెలమి శ్రీవేంకటేశుఁ డింపుతోడ నన్నుఁ గూడె

యెలయింపుమోవులకు నిఁకఁ గెంపులెక్కవా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1161-6 హిందోళం సం: 21-300

పల్లవి: వేమారు నెంతలేదు వెలుమజోలి

నేము నీవలెనే కూర్మి నెరపేము గాక

చ 1: నీకు నాతనిమాఁటలు నీలోనె తెలుసునే

మాకేమి చెప్పేవు మాపుదాఁకాను

దాకొని మీవద్ద నేము తగవులు దిద్దేమా

జోకల మీవోపికలు చూచే మింతేకాక

చ 2: మీ యిద్దరిచేఁతలు మీకుమీకే అందాలే

చాయలేల అడిగేరే సారె మమ్మును

యేమనేము నేము మిమ్ము నెటువలె నడచినా

బూమిలో మీనేరుపులే పొగడేముగాక

చ 3: మచ్చికలమీనవ్వులు మాకెల్లాఁ దెలుసునా

చెచ్చెర మీకే ఇవి సెలవుగాక

యిచ్చకమై శ్రీవేంకటేశుఁ డేలె నన్ను; నీవు

ముచ్చటలాడితే మీకు మొక్కేముగాక





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1162-1 అందోళి సం: 21-301

పల్లవి: ఇందుకుఁగా నెవ్వరును యెగ్గులెంచరు
సందుకొని ఆపెనేల సాదించేవు నీవు

చ 1: వాడికగలచోటను వలచి వొకరొకరు
ఆడరానిమాటలైనా నాడుచుందురు
వూడిగము సేసేవారు వూసివాసు లెంచరు
జోడై తమ మేనులు సోఁకింతురు

చ 2: సరసమాడేవేళ సమ్మతించి తమలోన
సరుగ మందెమేళాన జంకింతురు
వరుస విడెమిచ్చేవారు వింతసేయరు
అరిదిఁ దమచేతుల నంటింతురు

చ 3: రతిఁ గలసేయప్పుడు రాజసము విడువరు
తతి గూడఁ దమలోనఁ దమకింతురు
యితవై శ్రీవేంకటేశ ఇంతి నీవూఁ గూడితిరి
చతురులైనవారు సతమే చింతింతురు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1162-2 సాళంగం సం: 21-302

పల్లవి: నీయంత నెఱఁగవు నేఁటిదాఁకాను

మాయలెల్లా నీకు నేమగువ నేరిపెరా

చ 1: పలుమారు నవ్వుమని పడఁతులఁ దిట్టుమని

చెలఁగి యవ్వతె బుద్ధిచెప్పెరా నీకు

చలము సాదించుమని సటలెల్లాఁ జేయుమని

నిలుకడగా నెంతనేరిపెరా నీకు

చ 2: వొద్దనే కూచుండుమని వొడివట్టి తియ్యుమని

తిద్ది యెవ్వతె బోదించెరా నీకు

కొద్దిమీరి వుండుమని గుఱుతులు సేయుమని

గద్దరితన మేగతిఁ గట్టెరా నీకు

చ 3: పంతగాఁడవు గమ్మని పైపై నిచ్చలాడుమని

కాంత యెవ్వతె పట్టముగట్టెరా నీకు

యింతో శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి

బంతినే యీగుణ మెట్టు పట్టించెరా నీకు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1162-3 పాడి సం: 21-303

పల్లవి: నీయంత నెఱఁగకున్న నేనైనాఁ జెప్పే నీకు

పాయపువాఁడవు గాన పరాకెంతో నీకు

చ 1: కరఁగిజారినయట్టికస్తురి బొట్టు చెలికి

సరుగ దిద్దుతాను ముచ్చటలాడేవు

సరిఁ జెఱుఁగువట్టుక సతులెందరో వున్నారు

పరగ వారిఁ జూడవు పరాకెంతో నీకు

చ 2: యెక్కువై తడఁబడినఇంతికంఠమాలికలు

చిక్కులు దీసుకొంటాను చిత్తగించేవు

మొక్కులు నీకు మొక్కుతా ముందరనున్నా రెందరో

ఫక్కనవారిఁ జూడవు పరాకెంతో నీకు

చ 3: సుదతిఁ గాఁగిటఁ గూడి సురటి విసరుకొంటా

వుదుటై శ్రీవేంకటేశ వున్నాఁడవు

పదిమారులును నీకుఁ బాదాలు విసికేవారి-

పదనుకాంక్ష చూడవు పరాకెంతో నీకు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1162-4 లలిత సం: 21-304

పల్లవి: నేనూ మీవంటిదాననే నేరమి నాకు నెదే

తానకమై యాతనినే తడవరాదా

చ 1: చలివాయ దినములు సవతిపాళ్లకు వచ్చు

వలపు పాలు వెట్టంగవచ్చునా యేమి

నలువంకఁ జెలులెల్ల నన్నేల వుప్పటించేరే

కొలదిఁమీరఁగఁ బతిఁ గొసరరాదా

చ 2: ప్రియురాండ్లకు సేసలు పెండ్లివేళఁ బెట్టినట్టు

వయసు వంచిపెట్టఁగవచ్చునా యేమి

నయమెఱఁగక మీరు నన్నేల గోరసేసేరే

దయవుట్ట నాతనిఁ దగులరాదా

చ 3: అడియాలపుఁగాఁగిట నాతఁ డిందరికిఁ బొత్తు

వడిరూపు పంచిపెట్టఁగవచ్చునా యేమి

చిడుముడి నన్నుఁ గూడె శ్రీవేంకటేశ్వరుఁడు

బడిబడి మీరు నింకాఁ బై కొనరాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1162-5 తోండి సం: 21-305

పల్లవి: రాగదే యెక్కడిసుద్ది రమణుఁడున్నాడకు
పాఁగినవోవరిలోనఁ బవళించున్నాడు

చ 1: తెరమఱఁగు దియ్యఁగా తీపులాయ వలపు
సరసములాడఁగానే చవులాయ మాఁటలు
తరితీపు శాయఁగానే తమకము రేఁగెను
యెరపుసేసుకవుంటే నెడలౌను పొందులు

చ 2: యెడమాఁట లాడఁగానే యియ్యకోలాయఁ బనులు
తొడిఁబడ నవ్వఁగానే దొరకెఁ గూటములు
వొడివట్టి తియ్యఁగానే వొళ్లెల్లాఁ జెమరించె
జడిసి వూరకేవుంటే చప్పనౌను వావులు

చ 3: యిచ్చకము శాయఁగానే యింపులు మిక్కిలిఁగల్లు
తచ్చి తచ్చి పెనఁగితే తగులాయమౌను
అచ్చపు శ్రీవేంకటేశుఁ డప్పుడే కూడె నిన్ను
మెచ్చి మెచ్చి పొందకున్న మీరుఁ జుట్టరికము



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1162-6 దేశి సం: 21-306

పల్లవి: నీవు సామాన్యుఁడవా నీగుట్టు నే నెఱఁగనా

వావులెంత చెప్పినాను వలచేవా

చ 1: కలయఁగ నీకుఁ బని గలుగఁగానే కాక

బలిమిసేసితే నీవు పలికేవా

నెలకొన్న తమకము నీకుఁ గలుగఁగాఁ గాక

పిలిపించితే నీవు ప్రియాన వచ్చేవా

చ 2: చేకొని నీవుల్లాసము సెలవి వెళ్లఁగాఁ గాక

నాకు వలెనంటే నీవు నవ్వేవా

కైకొనఁగా నీకు నాపై కాంక్ష గలుగఁగాం గాక

ఆకు నే మడిచియ్యఁ గా నందుకొనేవా

చ 3: యింతటాను నీవు నన్ను యేలుకొనఁగాఁ గాక

మంతన మెంతాడినాను మనసిచ్చేవా

యింతులలో శ్రీవేంకటేశ నన్నేలితివి

పంతము నేనాడితేను పరాకుసేసేవా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1163-1 పళవంజరం సం: 21-307**

**పల్లవి: ఏమని వలపు చెప్పే నెవ్వరూ నే మెఱిఁగేరు**

**నేమపునీగుణాలకు నీవే సాక్షి**

**చ 1: వొనర నీపైబత్తి వొరులకుఁ జెప్పరాదు**

**మనసులోపలనున్నమరుఁడే సాక్షి**

**నినుఁబాసి విరహాన నే నిందాఁకా నున్నందుకు**

**నినుపులయిననానిట్టూర్పులే సాక్షి**

**చ 2: నెక్కొన్న నాకోరికలు నీతో వాకుచ్చరాదు**

**దిక్కులను మొక్కుకొన్న దేవరే సాక్షి**

**చొక్కపునాచూపులసూటి నీపైనున్నందుకు**

**పక్కన నే నుండేటిభావమే సాక్షి**

**చ 3: బాసతోడ నీకాఁగిటఁ బాయలేకవున్నందుకు**

**రాసికెక్కనట్టినారతియే సాక్షి**

**సేసవెట్టి యేలితివి శ్రీవేంకటేశ్వర నన్ను**

**ఆసుద్దులకెల్లా మనఆయములే సాక్షి**





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1163-2 వేళావళి సం: 21-308

పల్లవి: అప్పుడన్నీ( జెప్పే(గాని అందరిముందరనేలా

దెప్పరాన నిట్టే పట్టుతెర వేసేమయ్యా

చ 1: మొగములోపలిసిగ్గు మోవివెంట నవ్వులాయ

చిగురులోపలిచింత చెక్కుచేయాయ

మగువ నప్పటి నీవు మాట(లేమి యడిగేవు

అగడుసేయక యేకాంత మియ్యవయ్యా

చ 2: చేతుల(గారే చెమట చీరకొంగు దడిసెను

కాతరపు(జూపు కడకన్నుల( దేరె

యేతుల నీపెను నీవు యేల వెడ్డువెట్టేవు

జాతులు సేయక రహస్యాన( జెనకవయ్యా

చ 3: పట్టినపాయపుమీ(ద పై పై నీకే సెలవాయ

తొట్టినవలపులెల్ల దోమటాయను

యిట్టె శ్రీవేంకటేశ యెనసితి వింతి నిట్టె

దట్టముగా నీవు మంతన మానతీవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1163-3 లలిత సం: 21-309

పల్లవి: మొక్కవే యాతనికి మున్నిటినేరమి దీర
మొక్కళీ డాతఁడు నీమోవెంగిలే చాలు

చ 1: వేసటేలే నీకూ వేగినంతా నాతఁడు
ఆసలు రేఁచి రేఁచి ఆయాలంటఁగా
వేసములఁ దిట్టకువే విభుని నేమనినాను
దోసము లందురు కాలుదొక్కినదే చాలును

చ 2: జంకెనలేలే నీకు సమ్మతించి నీమగఁడు
వుంకువగా విడెమిచ్చి వూరడించఁగా
మంకుఁదనాలు చూపకు మగనాలి మీరితేను
అంకెగాదు నీచెమట నద్దినదే చాలును

చ 3: సిగ్గులు వడఁగనేల శ్రీవేంకటేశ్వరుఁడు
అగ్గమై నిన్నుఁ గలసి ఆదరించఁగా
వెగ్గళించి కితనికి వెక్కసాలు చూపితేను
సగ్గవు కోరికలెల్లా సరసమే చాలును





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1163-4 గుండక్రియ సం: 21-310

పల్లవి: కానీవే నాకెంత గలిగెఁ దనకూ నంతే

వూని నానినసనిగె లొకటి కినుమడి

చ 1: తన కెంతకుచ్చితము తానే బదికీలేవే

మనసంతే మంగళము మాపుదాఁకాను

వనిత నొక్కతె నాతో వడి నీడువెట్టెను

తనకూ నదేకాదా తగవు మీఁదటికి

చ 2: యీసులెంత రేఁచుకొన్నా నెక్కడవోయీలేవే

సేసినసుబాఫలాలు చేతిలోనివే

యీసిరులతో మగని కెందరిఁ బెండ్లిసేసినా

లాసి నావలెనే తనలాబము గాదా

చ 3: తడవి శ్రీవేంకటేశు దక్కనిచ్చె నాకు నేఁడు

నుడుగులఁదే వున్నది నోముఫలము

పఁడతులచేతనెల్లా పంతము నాకిప్పించితే

కడఁగి తనపెద్దరికముగాదా యిఁకను




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1163-5 మాళవి సం: 21-311

పల్లవి: ఏమి చెప్పేవు సుద్దులు యెందాఁకాను

వేమారు వెన్నెలేకాదా వేసవయ్యేది

చ 1: పురుషుఁడైతేనేమి పొలఁతియైతేనేమి

వరుస నొకటేకాదా వాసిపట్లు

కడఁగి చొక్కిననేమి కడువెరగైతేనేమి

మరునియమ్ములేకావా మతి నాఁటేవి

చ 2: వొంటి నేలికైతేనేమి వూడిగపుదై తేనేమి

జంటల సరేకావా జవ్వనములు

ఇంటిలో నైతేనేమి యీవాకిట నైతేనేమి

అంటి చల్లగాలేకాదా ఆయాలు రేఁచేది

చ 3: దేవరయైతేనేమి దేవులైతే మరియేమి

వావిరిఁ బొత్తేకాదా వలపులెల్లా

శ్రీవేంకటేశ్వరుఁడ చేరి నన్నుఁ గూడితివి

కోవిలకూఁతలేకావా గురులయ్యేవి





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1163-6 రామక్రియ సం: 21-312

పల్లవి: ఎంతవేగిరకాఁడవు యేమి చెప్పేది

పంతమెల్ల నీవు నాపైఁ బచరించేవు

చ 1: కూరిమి నేనాడినకొసరుమాటలకు

ఆరీతిఁ దారుకాణించుమని యాడేవు

నేరుపుతో మెలఁగితే నీవే బదికేవు మఱి

వారకపునీగుణా లెవ్వరికి వచ్చీని

చ 2: ననుపున నే నీతో నవ్వినసుద్దల కెల్లా

పెనఁగి నీవానలేల పెట్టవచ్చేవు

అనువుగా నిజమరివైతే నిన్నే పొగడేరు

వొనర నొకరికీరి తొకరి నంటీనా

చ 3: కూడేవేళనే నిన్ను గోరు సోఁకించినందుకు

చూడఁజాతి రతి నెంత సూడువట్టేవు

యీడుగా శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను

యీడేరినచుట్టరిక మిద్దరికుండీని





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1164-1 ఆహిరి సం: 21-313

పల్లవి: ఏమయ్య కరుణించేది యిఁక నెన్నఁడు

చేముట్టి సరసమాడి చెక్కునొక్కరాదా

చ 1: చిప్పిలుఁగాఁకలతోడి సిగ్గులు నీపైఁ జల్లీ

కప్పుర మియ్యగఁరాదా కలికికిని

రెప్పలెత్తుఁజూపులతో రేసుల నిన్నుఁ గొసరీ

దప్పికి మోవియ్యరాదా తరుణికిని

చ 2: కొలకొలనవ్వులతో కూరిమి నీపై వేసీ

పిలిచి చేకొనరాదా ప్రియురాలిని

తొలఁకునాసలతోడ దూరీ నిన్ను సారెకు

అలమి చనవీరాదా అంగనకును

చ 3: కందువఁ జన్నులు మోపి కళలు నీపై రేఁచీ

అంది కాఁగిలించరాదా అతివను

చెందెను బలిమిఁ బట్టి శ్రీవేంకటేశ్వర నిన్ను

అంది విడెమియ్యరాదా అలివేణికి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1164-2 దేసాళం సం: 21-314

పల్లవి: వట్టివాదులకునేల వచ్చీనే తాను

అట్టునిట్టు జంకించి ఆదరించరాదా

చ 1: తగవు చెప్పరే మీరు తరుణులాల

మొగముచూచేపతికి మొక్కరాదా

మగఁడు దనకై తేను మాటమాట సరసాన

వెగటుగాఁ దిట్టి నేను వేఁడుకోరాదా

చ 2: వొలపక్షమడకురే వువిదలాల

పలుమారుఁ బిలువఁగాఁ బలుకరాదా

మలసి తనవాఁడైతే మాతోఁ బెనఁగేవేళ

చెలఁగి గోరుదాఁకితే చెక్కునొక్కరాదా

చ 3: మీకే తెలుసునే మెలుఁతలాల

కైకొని నన్నుఁ గూడితేఁ గలయరాదా

జోక శ్రీవేంకటేశుఁడు సొరిదినే యేలఁగాను

వాకునఁ బ్రియము చెప్పి వంచుకోరాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1164-3 సాళంగనాట సం: 21-315

పల్లవి: నిన్ను గెలువవసమా నీ వింతటివాఁడవు

మన్నించవయ్యా నే నీమరఁగు చొచ్చితివి

చ 1: బలువాఁడ వౌదువు పడఁతు లెందరైనాను

సొలసితిట్టినా నోరుచుకవుందువు

మెలుపునీగుణాలకు మెచ్చితి నిందరిలోన

బలిమిఁ బదారువేల పాదముల సోఁకెను

చ 2: యెంతలేదు నీమహిమ యెంచి చూడ నిప్పుడిట్టె

కాంతలకెల్లా నీమోవి వకంచమాయను

వింతలాయ నీబతుకు వేడుకఁ బీతాంబరము

బంతినే గోపికలకుఁ బరపాయను

చ 3: మేలుమేలు నీపొదు మెరవడికత్తెలకు

వాలాయము వరుసలువంతులాయను

యీలీల శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి

నీలాడు లిందరికిక కానికాలాయను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1164-4 కుంతలవరాళి సం: 21-316

పల్లవి: నే మిద్దరమును నీపాలఁ జిక్కితి మిదె

కామించి యేపుణ్యమైనాఁ గట్టుకొనవయ్యా

చ 1: ఆకె నీకు నేరిపిన వవే తగవులు

లోకులము మమ్మునేల లోఁచి చూచేవు

సాకి రెవ్వరు చెప్పినా సటలే యందువు నీవు

వాకున వలచువారి వంకలాడవయ్యా

చ 2: చెవిలో నాడినమాటె చిత్తమునఁ బుట్టుఁగాక

వివరించి మమ్మునేల విచారించేవు

జవళిఁ జెలికత్తె ల సారెకు గరిసించేవు

భువిలోఁ గడవారికి పూనుకరావయ్యా

చ 3: ఇచ్చకములాడినవే ఇంపులు నీకౌఁగాక

అచ్చులము మమ్మునేల అలయించేవు

చెచ్చెర శ్రీవేంకటేశ చెనకి మమ్మేలితివి

మచ్చికైనవారినే మరగవయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1164-5 హిందోళం సం: 21-317

పల్లవి: ఒక్కతెనే యాలనా వూరకే నీకు

చక్కఁగా నీనెపమున సాదించేవుగాక

చ 1: కొల్లగాఁ జెక్కు నొక్కుచు కొనగోరు నాఁటించేవు

చెల్లినంతఁ జేయవయ్య చేఁతలు నీవు

పల్లదాన నీవిది పగ సాదించుటగాక

చెల్లఁబో నామీఁద బత్తిసేయుటా నీవు

చ 2: కొంగువట్టుతానే నాకుచములు విసికేవు

అంగడి వేయవయ్య నీ వన్నిటా సిగ్గు

చెంగట నీపంత మిఁదే చేకొనవచ్చుటగాక

సంగతి నాపై వలపుచల్లుటా నీవు

చ 3: పక్కునఁ గాఁగిటఁ గూడి పలుసోఁకులు సోఁకించేవు

వెక్కసానఁ గూడవయ్య వేడుక నన్ను

మక్కువ శ్రీవేంకటేశ మమ్ము మన్నించుట గాక

తక్కక మాతోడివినోదములా యివి









శృ.రేకు: 1164-6 శుద్ధదేశి సం: 21-318

పల్లవి: మదించిన వలపుల మత్తురాలను

చెదర నీవే యింత సేసితి నన్ను

చ 1: మాటలు నీ వాడించఁగ మఱచివుంటి నిందాఁకా

గాఁటానఁ జేయెత్తి మొక్కేఁ గైకొనవయ్యా

పాటించి నీవు రాఁగాను పై పైఁ జూడఁబట్టె నాకు

చాటువైనకానుకిచ్చే చాఁచవయ్యా చెయ్యి

చ 2: సెలవి నీవు నవ్వఁగ సిగ్గునవుంటి నిందాఁకా

యెలమితో వీడెమిచ్చే నిందవయ్యా

నిలుచుండఁగా బానుపు నీకుఁ బరవఁగబట్టె

యెలమిఁ గైదండ ఇచ్చే నిందవయ్యా

చ 3: పైకొని కాఁగిలించంగ భ్రమసివుంటి నిందాఁకా

యీకడ మోవితేనియ లిందవయ్యా

దాకొని శ్రీవేంకటేశ దక్కితి విట్టె నాకు

రేకలఁ గస్తూరి గప్పే జోక్కై వుండరాదా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1165-1 రీతిగౌళ సం: 21-319**

**పల్లవి: ఎంతకు నంతేకాక యెక్కుడేఁటికే**

**పొంతనుండి యాతని బుజ్జగించఁగదవే**

**చ 1: పయ్యదకొంగు వట్టితే పతిని జంకించితివి**

**తియ్యనిమోవిపై మరి తిట్లూ నేలే**

**వొయ్యనే వలపు చింది వొకటి ఇనుమడాయ**

**చయ్యాటలు మాని ఇఁక సరసములాడవే**

**చ 2: కోరి చన్ను లంటితేను కొనగోర నూఁదితివి**

**వూరకే మీఁదమిక్కిలి వొట్లేంటికే**

**పోరచి వయసు వండి పోఁకకుఁ బుట్టెఁడాయ**

**కేరడాలు మాని ఇట్టే కేలెత్తి మొక్కవే**

**చ 3: పక్కన గాఁగిలించితే పాదము పైవేసితవి**

**చెక్కిటిచేతితోడిసిగ్గు లేఁటికే**

**యెక్కువైన శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నుఁ గూడె**

**పెక్కులెల్లా మాని యిట్టె ప్రియములు చెప్పవే**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1165-2 బౌళి సం: 21-320

పల్లవి: అట్టె బదుకవయ్యా అంతలోనే మాకేమి

ఇట్టె వలపే నీకు యెక్కువసింగారమా

చ 1: మాయదారివాఁడవు మానినులవుంగరాలు

యీయెడ వెళ్లఁబెట్టుక యెమ్మెసేసేవు

చాయలమేనిరేఖలు చాలవా అందుకుఁదోడు

కాయముపై మచ్చములు కడుసింగారమా

చ 2: పొద్దువోనివాఁడవు పొలఁతులవలువలు

కొద్దిమీర మొలఁ గట్టుకొనివచ్చేవు

ముద్దుముద్దువలె నీమోవికెంపులే చాలవా

పెద్దరికపుటెరవు పెక్కువసింగారమా

చ 3: కతకారివాఁడవు కాంతలపువ్వు దండలు

ఇతవై మెడవేసుక యెలయించేవు

తతి నన్నుఁ బొందితివి దగ్గరి శ్రీవేంకటేశ

రతులసదమదము రాఁపులసింగారమా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1165-3 శంకరాభరణం సం: 21-321

పల్లవి: పెనఁగే వూరకే ప్రియపడి నాతో

ననుపు నటించక నయమౌనా

చ 1: చిత్తములోపలిసిలుగులు వాయక

బత్తులు సేయఁగఁ బనిగలదా

వొత్తినగొళ్లు వొళ్లనే వుండఁగ

హత్తినకాఁగిలి అనువౌనా

చ 2: నగవులలోపలి నలుసులు దియ్యక

పగటులు సేయఁగఁ బని గలదా

తగిలిదండలు తతి మెడనుండఁగ

వెగటుగఁ బెనఁగఁగ వేడుకలైనా

చ 3: వలపులలోపలి వాసులు దోయక

బలుములు చూపఁగఁ బని గలదా

యెలమిని శ్రీవేంకటేశ కూడితివి

కలసిరతులకుఁ గడమలు నౌనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1165-4 కాంబోది సం: 21-322

పల్లవి: ఓయమ్మ నీగాతికి నోరుచునా యెవ్వతైనా

పాయలు వడినఁ బోదు పట్టకు మాచెఱఁగు

చ 1: కాంతలఁ బెక్కులఁ బొంది కాయాటుపడె నీమేను

యెంతవడ్డైనా నలయ దిదివో నేఁడు

ఇంతలోనే తమ్ములము లిందరివి లోఁగొని

యెఁత్తైనాఁ గద్దు నీనోరు యెట్టు మాటాడేను

చ 2: వనితల రహస్యాలు వాఁగి వాఁగి నీవీనులు

వెనకతియ్య వెంతేసి విన్నవించినా

తనివోనిమర్మములు తాఁకి తాఁకి గట్టిపడె

పనివి నీచేతు లెట్టు పట్టిపెనఁగేను

చ 3: కుచములు దాఁకి తాఁకి గురులాయ నీవురము

రచన నన్నిటాను నీరచ్చకెక్కెను

యిచట శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను

పచరించి నీయాసలు పట్ట నెట్టు వచ్చును




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1165-5 గౌళ సం: 21-323

పల్లవి: పొయిఁ బాలవంటిది పూఁచినతనమోహమెల్లా

నయముల నెందాఁకా నానఁబెట్టవచ్చునే

చ 1: కన్నులఁ గన్నపుడే కందువచుట్టరికము

వున్నప్పుడెల్లా నూరకే వుండును తాను

చన్నులు మోఁపినప్పుడే జల్లనఁ బులకించును

యెన్నిక నల్లంతనుంటే యెఁతైనా గరఁగఁడు

చ 2: పిలిచినప్పుడే తన ప్రియవాదిపలుకులు

చలముననున్నపుడు సటలే తాను

తలఁచినప్పుడే తనతమకపువినోదాలు

మలసివున్నప్పుడైతే మానుపడివుండును

చ 3: గక్కనఁ గూడినప్పుడే ఘనమైనతనయింపు

తక్కినప్పుడు గొంటుఁదనమే తాను

యెక్కువతో శ్రీవేంకటేశుఁ డిప్పుడు నన్ను నేలె

చెక్కులునొక్కినవేళ చిరునవ్వు నవ్వును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1165-6 సామంతం సం: 21-324

పల్లవి: ఇంతియవ్వనసీమకు యేలికవు నీవైతివి

రంతు లిన్నియును నేలు రపమాయ నీకును

చ 1: మొలకనవ్వులనేటి మోసులు

చెలఁగేటి పెదవులచిగురులు

మలసి పైతాఁకులమారాకులు

వలపులపైరులు వనితపై నవివో

చ 2: పూచినసిగ్గులలోనిపుప్పొడులు

కాచినచన్నుల నిమ్మకాయలు

యేచినమోవిపండ్లు యెసఁగెను

చేచేత వసంతవేళ చెలియమై నదివో

చ 3: చెప్పరానిపలుకులచిలుకలు

ముప్పిరి నెరిఁదుమ్మదమూఁకలు

యిప్పుడే శ్రీవేంకటేశ యింతి నీవు గూడఁగాను

కుప్పలకొటారులు కొమ్మమేన నదివో




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1166-1 వరాళి సం: 21-325

పల్లవి: ఇద్దరిలోపల నీవు యెవతెను మెచ్చితివి

అద్దలించక మాకిది యానతియ్యవయ్యా

చ 1: కొమ్మ వొక్కరితె కేళాకూళిలో జలకేళిని

కమ్మి పెనఁగేయట్లాఁ గాఁగిటఁ గూడె

పమ్మి వేరొక్కతె వచ్చి పైకొని యది దెలిసి

దిమ్మరితనాన మోవితేనె చవిగొనెను

చ 2: పడఁతి వొక్కతె నిన్ను పక్కపారిశాన వచ్చి

తొడలఁ బీడించి పట్టి తొలఁగఁదీసె

యెడచొచ్చి వేరొకతే ఇవ్వలిపారిసెమున

అడియాలమైనమాట లటు విన్నవించెను

చ 3: మునిఁగి వచ్చి యొకతె మొక్కలాన నిన్నుఁ గూడి

మొనలచన్నుల నూఁది మొకమెత్తెను

ఘనుఁడ శ్రీవేంకటేశ కమ్మటి మఱియొకతె

మనసిజరతులను మాటిపిల్లాడెను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1166-2 పాడి సం: 21-326

పల్లవి: నమ్ముదురు యిఁక నిన్ను నలినాక్షులు

వుమ్మడి నింకానేల వొడఁబరచేవు

చ 1: వేడుకకాఁడవైతివి విచ్చి విచ్చి ఆపె నాతో-

నాడినన్నీఁ గలవు నీయంగములందు

యీడుపడ నీ నిన్ను నింతకంటె నేమాడేను

యేడలేని యానలు నీవేల పెట్టేవిఁకను

చ 2: నగితివట యేడనో నాలి చేసినచేఁతకు

తగుదు వన్నియు వింటిఁ దరుణిచేత

యెగసక్యానకు నే నింత కంటే నేమిసేసే

తగిలి సతుల నేల తారుకాణించేవు

చ 3: నన్నేలితివి కాఁగిట నసుపు లక్కడివలె

కన్నులెదుటనే నాకుఁ గానవచ్చెను

యెన్నఁగ శ్రీవేంకటేశ ఇంతకంటె నిఁక నేమి

పన్ని ననగవులేల పచారించేవు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1166-3 నాదనామక్రియ సం: 21-327

పల్లవి: వట్టిదోసాలు గట్టేవు వద్దన్నాఁ బోవు

అట్టడిసేఁతల నింతాఅడిసేతురా

చ 1: చలివాయ గొల్లెతల సంగడిఁ గూచుండుకొంటా

బలిమి వారిపాదాలు పైవేసుకొంటా

కులికి చేతుల వారగుబ్బలు రాచుకొంటా

బులిసే వదేమోయి పొద్దువోదా నీకు

చ 2: కొమరెపడుచులతో కొల్లున నవ్వుకొంటా

చెమటలంట చేతులఁ జెనకుకొంటా

అమర వారిపూదండ లవి మెడవేసుకొంటా

తమకించే వేఁటి దొరతనమోయి నీకు

చ 3: మందబోయి రాండ్లను మానముపైఁ దిట్టుకొంటా

అంది పోఁకముడి విడిచాడు కొంటాను

ఇందరి శ్రీవేంకటేశ యెనసితిని మమ్మెల్లా

ఇందుముఖులెల్లాను ఇంతబాఁతే నీకు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1166-4 దేసాళం సం: 21-328

పల్లవి: కామాతురునకును గర్వ మెక్కుడు

వేమారుఁ బెచ్చువెరిగి విఱ్ఱవీఁగు మిఁకను

చ 1: నీకేల వెరపూ నీవిన్నిటా దొరవూ

చేకొని యేమి చేసినాఁ జెల్లును నేడు

యీకడనాకడ సతు లెందరైనా నున్నవారు

చేకొని మత్తుఁడవై చెలరేఁగు మిఁకను

చ 2: అడ్డాఁక లేడవి అన్నిటాఁ దెగుదారివి

వొడ్డారాన నెట్టుండినా వొరపే నీకు

జడ్డుదేరె తమ్ములము సరి నీపుక్కిళ్ల నదె

దొడ్డగాఁ జొక్కుచు సోలి తుదమీరు మిఁకను

చ 3: పండెను నీతపమూ పట్టినదెల్లాఁ బైఁడి

అండనే నన్నుఁ గూడితి వాయను పని

నిండఁగ శ్రీవేంకటాద్రినిధిఁ దొక్కివున్నాఁడవు

కొండవంటి వుబ్బుతోడఁ గొల్లగాను మిఁకను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1166-5 బౌళి సం: 21-329

పల్లవి: కడమమాటలు నీవే కనుకోవయ్యా

పడఁతులలోన వాసిపట్టుదాననయ్యా

చ 1: పంతము నేనా విడువ పైకొని మాటలాడేవు

యెంతవడి వూఁకొందు నేమనేవయ్యా

కాంతుడవు నీవు గక్కన వంచుకోరాదు

చెంత నీనవ్వుల కెట్టు చేతులొగ్గేనయ్యా

చ 2: పాయపుగర్వపుదానఁ బలుమారు మొక్కేవు

యీయెడ నెందాఁకాఁ జూతు నేమనేవయ్యా

నీయంత దొరవు పని నీచేఁ గొనఁగరాదు

చాయల నేమని నీతో సమ్మతించేనయ్యా

చ 3: చలము నాకే కలదు సారె నన్ను వేఁడుకొనే-

యెలయింపు లెట్టువిందు నేమనేనయ్యా

బలిమి శ్రీవేంకటేశ పైకొని కూడితి విట్టె

నిలువెల్లా వలుపులే నీవే నేనయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1166-6 సాళంగం సం: 21-330

పల్లవి: ఇంతా నీమహిమలే యేల నవ్వేవు

ఇంతులెల్లా నుండఁగానే యేల నవ్వేవు

చ 1: దవ్వులనుండినదాన దగ్గరివచ్చితి నింతే

యెవ్వరు నిన్నేమని రేల నవ్వేవు

పవ్వళించివుండఁగాను పనీనరు చల్లితి నింతే

యివ్వల నామోము చూచి యేల నవ్వేవు

చ 2: యిచ్చకములాడి నీకు యిటు ప్రియాలు చెప్పితే

యెచ్చరి నీవే తెలిసి యేల నవ్వేవు

మెచ్చి మెచ్చి చనవుతో మేలములాడినందుకు

యెచ్చుకుందు లాయనంటా యేల నవ్వేవు

చ 3: కాయకపుచెమటలు కడిగి కడిగి నేను

యీయెడ నిన్నుఁ గూడితే యేల నవ్వేవు

పాయపుశ్రీవేంకటేశ పనులెల్లాఁ జక్కనాయ

యీయరానిచన విచ్చి యేల నవ్వేవు




# అన్నమయ్య  సంకీర్తనలు


**శృ.రేకు: 1167-1 సౌరాష్ట్రం సం: 21-331**

**పల్లవి: లేవే యెందాఁకను లెక్కలు వెట్టేవు**

**ఆవటించి పైకొంటే నాయములు రేగును**

**చ 1: యెదురుమాటలాడితే నెన్నైనాఁ గలవు**

**పొదిగి కాఁగిలించితే పొందు చేకూరు**

**చదురులాడఁజూచితే సరియాఁకలై యుండు**

**అదన మోవియానితే నడ్డాఁక లేదు**

**చ 2: పనులు విచారించితే బండ్లకొలఁదులు**

**ననిచి రతిసేసితే నాఁడే పెండ్లి**

**పెనఁగఁబోతే కడుబిగియ మనసువుట్టు**

**చెనకి పై కొంటేను చేతఁ జిక్కు వలపు**

**చ 3: కొచ్చి సిగ్గువడితేను కొండలౌను జగమెల్లా**

**పచ్చిగా రతిసేసితే బట్టబయలు**

**యిచ్చట శ్రీవేంకటేశుఁ డెనసె నేఁ డింతలోనె**

**ఇచ్చగించితే నట్టే యితవౌఁ దమకము**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1167-2 నీలాంబరి సం: 21-332

పల్లవి: తెలుసుకొమ్మీ యిట్టె దిక్కుల పరాకు మాని

ఫలించెఁజుమ్మీ జవ్వనపాయమెల్లాను

చ 1: చిగురుటాకులను వ్రాసినమేలుసుద్దులే

మగువయాడేమంచి మాటలెల్లాను

మొగి ముత్తెపుఁజిప్పల మూసిదించినవే

వెగటైనచూపుల వెన్నెలలెల్లాను

చ 2: కమలపుపుటికల కలయ నీపైఁజల్లేవే

రమణిచేఁతలు సేసే రచనలెల్లా

అమర మరుగరిడి నటు సాములు చూపేదే

కొమరె నీతొడ మీఁదఁ గూచుండేదెల్లాను

చ 3: పువ్వులగుత్తుల నిన్నుఁ బూజలుసేసేదే

జవ్వని చన్నులనొత్తేసరసమెల్లా

రవ్వగా శ్రీవేంకటేశ రమణిఁ బెండ్లాడినదే

బువ్వపురతుల నీతోఁ బొత్తులు గూడినది



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1167-3 ముఖారి సం: 21-333

పల్లవి: ఎరవై పట్టనేరము యింతేసి వూసివాసులు

ఇరవైవుందాన నీకు నేమిసేతురా

చ 1: యెంత నే మాటలాడినా యెగసక్కెమే యనేవు

కొంతగొంత చూచితేను కోపమనేవు

వింతప్రియాలు సేసితే వెంగెములుగాఁ బట్టేవు

యెంతటివాఁడవు నిన్ను నేమనందురా

చ 2: అట్టే సిగ్గులు వడితే నలిగితి నే ననేవు

గట్టిగాఁ గొంగువట్టితే గయ్యాళనేవు

నెట్టుకొని నీవద్దనుంటే నే నిన్ను నమ్మకనేవు

యిట్టిమతకపువాని నెట్టు నే గెలుతురా

చ 3: అంకెకెల్లా వచ్చితేను అబ్బురము లివనేవు

సంకెలేక నవ్వితేను సటలనేవు

లంకెల శ్రీవేంకటేశ లలి నన్నుఁ గూడితివి

యింకా నిన్నప్పటిని యెట్టు గొసరుదురా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1167-4 కేదారగౌళ సం: 21-334

పల్లవి: చూతము దానికేమి సుభము లన్నియు నింకా

కాతరపుచేఁతలచే కడుమించరాదా

చ 1: తెల్లనాయఁ గన్నులు తేటలాయ నీసుద్దులు

పల్లదాన మావొడేల పట్టేవయ్య

చెల్లుబడి గలదు సిగ్గులు నీకా లేవు

బల్లిదుఁడవై యిట్లానే బతుకరాదా

చ 2: చెమరించె నీమేను చేఁతలు రూడికెక్కె

తమితో నింకా మమ్మేల దగ్గరేవయ్యా

భ్రమయించనేరుతువు బాసలు మీఱఁగలవు

అమర నిన్నిమేళ్లు నందఁగరాదా

చ 3: కళలు మోమున రేఁగె కాఁగిటిలో చలివాసె

బలిమిసేసి మమ్మేల పై కొనెవయ్య

యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి

వెలలేని వేడుకల వెలయరాదా



www.annamayya.net



# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1167-5 ఆహిరి సం: 21-335

పల్లవి: ఇంతికి నీవు లోనైతి వేమందు నిన్ను

పంతములాడేటికాంతఁ బట్టవచ్చునా

చ 1: నాయములు చెప్పఁగాను నన్నునేల తిట్టేవు

ఆయింతిపొందు సేయుమంటినా నిన్ను

ఆయెడ నే నడ్డమురానని నన్ను దూరేవు

పాయపుమదముసతిఁ బటవచ్చునా

చ 2: నడుమ నవ్వేటిదాని నన్నునెల గద్దించేవు

గొడవ లాపెతోఁ బెట్టుకొమ్మంటినా

తొడిఁబడ నీకు నేను తోడుగానైతి ననేవు

బడిఁబైకొనేజవ్వనిఁ బట్టవచ్చునా

చ 3: నిన్నుఁ జేయివట్టేదాని నీవేల సొలసేవు

అన్నిటా నాపెతోఁ బెనఁగాడుమంటినా

యెన్నఁగ శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి

పన్ని నీమోహపుఁజెలిఁ బట్టవచ్చునా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1167-6 మంగళకౌసిక సం: 21-336

పల్లవి: వద్దనున్నారము నేము వాడికవారమెల్లాను

కొద్దిమీరి ముమ్మదము కుంగ దేఁతైనాను

చ 1: వెలఁది కొత్తవలపు వేఁడివేఁడి చెమటలు

బలిమి ని న్నే పొద్దుఁ బాయఁగలేదు

మెలుపుతోడ నీవు మెడఁగట్టుకొనవయ్య

తిలకించ నాసోదము తీర దేఁతైనాను

చ 2: చెలియ వింతొకచూపు చిరునవ్వు లొకచవి

కొలువులో నీతొడపైఁ గూరుచున్నది

పొలుపై నీదేవరగా బూజించుకొనవయ్య

తలఁపులో నాపెకు తనియ దేఁతైనను

చ 3: అంగనకాఁగిటిపెండ్లి అట్టె నాగవెల్లి

సంగతిగా నినుఁగూడి సతమాయను

యింగితాన శ్రీవేంకటేశుఁడ మన్నించవయ్య

చెంగట మాసరుసకె చేరె నెంతయినాను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1168-1 పళవంజరం సం: 21-337

పల్లవి: దయగలదానవు తమకించకువే ఇట్టె

ప్రియపడఁగానే ఇంక బిగియఁగవచ్చునా

చ 1: భావ మెఱిఁగి మెల్లనె పైకొని కూడుటగాక

కైవసమైనవానిఁ గక్కసింతురా

యేవల్లనుండి వచ్చిన యెదురుకొందురుగాక

నీవద్దఁ గూచుండఁగానే నిష్ఠూరమాడుదురా

చ 2: వూరట చేసుకొని వొడఁబరచుటగాక

కూరిమిగలుగు వారిఁ గోపగింతురా

కోరి మచ్చము లుండినా కూర్చుకొనవెలఁగాక

సారె సారెఁ జెనకఁగా సణఁగులాడుదురా

చ 3: వేడుకలెల్లాఁ జూపి విన్నవించుకొంటగాక

కూడి శ్రీవేంకటేశుఁ గొసరుదురా

మేడెపురతులలోన మెచ్చులు మెత్తురుగాక

పాడిగా నీతో నవ్వఁగా పంతములాడుదురా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1168-2 తోండి సం: 21-338

పల్లవి: మావంటివారికెల్లా మాటల లోనయ్యేవా

లావరులకై తేఁగాక లాలనకు మెత్తువా

చ 1: చలమరులైనట్టి సతులకుఁగాని మరి

బలిమిగలపతులు పంపుసేయరు

తెలివితోఁ గొంగువట్టితీసేవారికిఁగాని

కెలయుచు నెఁత్తైనా కిందుపడరు

చ 2: ముంగోపులై నట్టి ముదితలనే కాని

కందు దీరి యెందుకునుఁ గై కొనరు

వంగక తిట్టేమెరవడికత్తైలకుఁగాని

ముంగిటఁ గాచుకుండి మోహించరు

చ 3: యెడయక కాచుకుండేఇంతులకేకాని

బడిబడిఁ గాచుకుండి పనికిరాదు

అడరి శ్రీవేంకటేశ అట్టె నన్ను నేలితివి

తడవకుండిన మీరు తమకించరు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1168-3 ఆహిరి సం: 21-339

పల్లవి: ఏమోయి నేనెఱఁగనా యెంతకెంత సేసేవు

కామతంత్రముల కివి కందువలుగాక

చ 1: ఈకడ దిట్టితినంటా నెగ్గులేల పట్టేవు

నాకు నీపైఁ గోపమా నగితిఁగాక

కైకొని జంకింతునంటా కమ్మటిని దూరేవు

చేకొన్నపగదాననా చెలిమిగాక

చ 2: పొలయలు కలకె పొగిలేవు రానంటా

చలమా నీతో నాకు చవులుగాక

పలుకనైతినంటా పై పైఁ జింతించేవు

చలపట్టినదాననా సరసముగాక

చ 3: గుట్టుతో నేనుండఁగాను కొసరేవు రానంటా

చిట్టకపుదాననా సిగ్గులుగాక

గట్టిగా శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను

అట్టుచేసేనా నిన్ను జట్టిగొనేఁగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1168-4 వరాళి సం: 21-340

పల్లవి: ఎట్టు భ్రమయకుందుము యిటువంటినిన్నుఁ జూచి

వుట్టిపడి నిదివో నీవొడఁబాటుపొందులు

చ 1: పెచ్చురేఁగి వలచినప్రియురాండ్లకెల్లాను

మచ్చుమేఁపులాయను నీమంచిమాటలు

అచ్చలాన నీవుచూపే ఆస లందరికిఁ జేల-

పచ్చలాయ నిదివో నీబయకారిచేఁతలు

చ 2: కాలుదొక్కినట్టి నీకామినుల కెల్లాను

పాలకూళ్లాయను నీపచ్చినవ్వులు

యీలాగులె ఇందరికి యీఁదులాడేనీటిలోని-

వోలలాయ నిదివో నీవుప్పవేసి పొత్తులు

చ 3: మక్కువ నిన్నుఁ గూడినమముబోంట్లకల్లాను

చొక్కుమందులాయను నీసొంపురతులు

గక్కన శ్రీవేంకటేశ కలసితివి నీమేలు

రొక్కమాయ నిదివో నీరూఢైనమన్ననలు



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1168-5 గౌళ సం: 21-341

పల్లవి: వెలపేల రమ్మనవే వింతవాఁడా తా నాకు

మెఱుఁగు మెరచితేను మించదా దిక్కులను

చ 1: అందుకేమె తా నన్ను నాదరించె నింతలోనే

యెందటిఁ గూడివచ్చినా నేమాయనే

ముందు నన్నుఁగూడెను ముడిచివేసినపువ్వు

పొందుగా వీదినుండితే బుగంధించకుండునా

చ 2: కడమ యేదే తాను కైకొని నన్ను మెచ్చె

యెడసి యెందుండినాను యేమాయనే

కడఁగి నాతో నవ్వె గరచివేసినబూరె

అడరి యెక్కడఁగన్నా నట్టె నోరురదా

చ 3: ఇన్నీ నేలె శ్రీవేంకటేశుఁ డిట్టె నన్ను నేలె

యెన్నిపెండ్లిండ్లాడినా నేమాయనే

వున్నాఁడు నాకాఁగిటను వొద్దికైననాకంచము

కన్నవారెల్లాఁ బొత్తుగలయక వుందురా



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1168-6 ఆహిరినాట సం: 21-342

పల్లవి: ఇయ్యకొంటి నీపనులు ఇంతా మేలే

చెయ్యిమీఁదాయ నాకు సిరులేమి బాఁతి

చ 1: నయగారివాఁడవునాకు నీవు గలవు

ప్రియములేమి గడమ పెక్కుమారులు

క్రియ లెఱుఁగుదువు కేలు చాఁచేవు నామీఁద

నియతా నిందుకే నీయాలనైతిని

చ 2: చలపాదివాఁడవు సతమై వున్నాఁడవు

బలిమి యేమి గడమ పై పై నేఁడు

వలపించనేరుతువు వంచేవు నాపై నను

కలకాలమును నీకుఁ గైవశమైతిని

చ 3: శ్రీవేంకటేశుఁడవు చేరి నన్నుఁ గూడితివి

దైవిక మేమిగడమ తగులాయను

భావ మెఱుఁగుదువు పచ్చిగా నవ్వేవు నాతో

వేవేలకును నీకే వెల్లవిరి యైతిని





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1169-1 సామంతం సం: 21-343

పల్లవి: తరుణి కింతచలము తగవు గాదు

సరుగ నాతనిమాఁట సమ్మతించవే

చ 1: తడవితే నొడ్డుకొంటా తరితీపుసేసుకొంటా

వుడుకఁబెట్టేవు మోహ మొక్కమాఁటే

బడలె నీరమణుఁడు పంతము నీకుఁ జెల్లె

యెడయ కింతటనైనా యింపు చల్లవే

చ 2: పిలిచితే బిగుసుతా ప్రియము చెప్పించుకొంటా

కలయ నూరేవు నవ్వు కడుఁగడు

అలవిమీరె నాతఁడు అమరె నీరాజసము

సొలసి యింతటనైనాఁ జొక్కించవే

చ 3: కదిసితేఁ దిట్టుతాను కందువలు రేఁచుకొంటా

వెదచల్లేవు సిగ్గులు వేడుకతోడ

చెదరకుండా నిన్ను శ్రీవేంకటేశుఁడుఁ గూడె

పొదలి ఇంతటనైనాఁ బొసఁగుండవే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1169-2 పాడి సం: 21-344

పల్లవి: మానినుల మీఁదనేల మదములు చల్లేవు

ఆనుకొని జూజాలెల్లా నాడుదము రమ్మా

చ 1: వలపులెల్లా రేఁచి వాడలసతులఁ జూపి

చలము వుట్టింతురా సతుల కింత

పొలసి పొద్దులు నీకుఁ బోకుంటేఁగనక నేఁడు

అలవోక చదురంగాలాడుదము రమ్మా

చ 2: సరసములెల్లా నాడి సవతుల నెచ్చరించి

కరికరిసేతురా కాంతల నింత

వురుటున నీకింత వుబ్బసపోకుంటేను

అరుదుగాఁ బగడసాలాడుదము రమ్మా

చ 3: కొల్లున నవ్వులు నవ్వి కొలువుసతులఁ గూర్చి

పల్లదాలాడుదురా పట్టపుదారి

యెల్లగా శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను

అల్లాడ నెత్తము మన మాడుదము రమ్మా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1169-3 ఆహిరి సం: 21-345

పల్లవి: ఎందాఁకా వట్టి జాగులేల సేసేవే

సందడించి వలపులు జాజుకొనఁగాను

చ 1: సిగ్గులు వడుదురా శిరసు వంచుదురా

దగ్గరి కూచుండి పతి తలఁపించఁగా

వొగ్గి అందుకోకుందురా వూరకే వుండుదురా

వెగ్గళించి యాతఁడు విడెమియ్యఁగాను

చ 2: కన్నెపడుచువా నీవు కడుముద్దరాలవా

మిన్నక లోఁగేవు పతి మేలమాడఁగా

మన్నన నెఱఁగవా మనసు సోదించేవా

విన్నంతనే పలుకవు వేఁడుకోఁగాను

చ 3: కప్పుర మియ్యఁగవద్దా కాఁగిలించుకొనవద్దా

యిప్పుడె శ్రీవేంకటేశుఁ డెనసె నిన్ను

చెప్పినట్టు సేయవద్దా సేవల మెప్పించవద్దా

తప్ప కాతఁ డప్పటిని తమకించఁగాను



శృ.రేకు: 1169-4 భైరవి సం: 21-346

పల్లవి: కరుణించవయ్యా కామినిని

గరిమ నివ్వెరగుల కాణాచితో నున్నది

చ 1: జమళికానుకలు సతి నీకు వియ్యవచ్చి

సముకాన నిలిచుండీ చాఁచుమా చెయ్యి

నెమకి చెక్కులనే నిలువుటద్దాలు వట్టి

అమర నూడిగాలు నీకదివో సేసీని

చ 2: వేడుక మోవిపంటి విందు నీకుఁ జెప్పవచ్చి

వోడుక నిన్నుఁ జూచీ వొగ్గుమా కొంగు

వీడినకొప్పునీలాలు వెలసేసి నీకుఁ జూపి

జాడతోడ నిచ్చకాలు సారెసారె జేసి నీకును

చ 3: కనకపుమేనివన్నె కప్పములు నీకుఁ బట్టి

చెనకీఁ బానుపుమీఁద జేకొనరాదా

ఘనుఁడ శ్రీవేంకటేశ కలసె నిన్నింతలోనే

వనిత నానారతుల వంతులువేసీవి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1169-5 ముఖారి సం: 21-347

పల్లవి: ఏమి చెప్పేవు సుద్దులు యెందాఁక మాతో

కామించినటువలెఁ గైకొందువు గాక

చ 1: పంతములాడఁగనేల బలిమి గలితే నీకు

చెంతనుండ యేమైనా జేతువుగాక

వింతలు మరేడవి వెల్లావిరైననీకు

నంతకూటములనె జడుతువుగాక

చ 2: అనుమానాలు మరేల అన్నిటా సర్వజ్ఞుఁడవు

చెనకి మమ్ము రట్టుసేతువుగాక

వెనకముందేడది వేడుకగలుగునీకు

పనిగలయపెడెల్లాఁ బైకొందువుగాక

చ 3: సిగ్గు వీడనేల నీకు శ్రీవేంకటేశుఁడవు

వొగ్గి నన్నేలితి విట్టె వుందువుగాక

యెగ్గుదప్పు లేడవి యింతవలచిననీకు

కగ్గులేక యిట్లానే కలతువు గాక



శ్రృ.రేకు: 1169-6 నాదనామక్రియ సం: 21-348

పల్లవి: ఏమి సేయవచ్చునమ్మ యీకాలము

కామినుల నెవ్వరైనాఁ గైకొందురా

చ 1: యిచ్చకములాడేకాదా యింతులెల్లాఁ బతులను

పచ్చిగాఁగ భ్రమయించి వలపించేది

మచ్చరించి సతులెల్లా మఱియేల అగ్గువైరి

తచ్చి యిటువంటివారే తలచైరి భువిని

చ 2: సరసము లాడేకాదా సారెకును మనసులు

కరఁగించి గర్వముల ఘనమయ్యేది

తరితీపుల మరేల తడబడేరు ముయ్యాడ

సరి నిందువంక మొగచాటాయ మోహము

చ 3: నవ్వులు నవ్వేకాదా నయాన వేంకటేశు

రవ్వఁగాఁ గాఁగిటఁ గూడి రతికెక్కిరి

యివ్వల మరేల నన్ను నెవసె నీతఁడై పై పై

మువ్వంక నిందువంక నే మును వాయఁ బంతము





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1170-1 వేళావళి సం: 21-349**

**పల్లవి: ఎన్నిమాయలు సేసేవు యేఁటివేసాలు బొయ్యేవు**

**నిన్ను నన్ను నెంచు కొంటే నీవే కావా**

**చ 1: మిన్నక నీవలపులే మెరమీ నింతేకాక**

**కన్నులనాచూపు నీపైఁ గాఁడిపారీనా**

**తిన్ననై నీకాఁక తరితీపులు సేసీఁగాక**

**వున్నతి నామోవి నోరూరించీనా**

**చ 2: పట్టరానినీవయసు భ్రమయించీ నింతేకాక**

**గట్టినాచన్నులు నీకళ దాఁకీనా**

**నెట్టన నీతమకమే నిన్నుఁ గరఁగించీఁగాక**

**తొట్టి నాచక్కఁదనము దొమ్మిసేసీనా**

**చ 3: కలనీ నీకాఁగిలే గక్కనఁ జొక్కించెఁగాక**

**మలసి నామేలు నిన్ను మఱపించెనా**

**తెలిపి శ్రీవేంకటేశ దిక్కయి నన్నేలితివి**

**చలపట్టి నాగుణము సాదించెనా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1170-2 మేఁచబౌళి సం: 21-350

పల్లవి: ఓపితేఁగనక నీవు వొడిగట్టు మిందుకును
కోపము పనికిరాదు కొమ్మలయెడలను

చ 1: వలపు జున్నువంటిది వడి రేఁచఁబోతేను
తిలకించ మోవినే తేనె గారును
తలఁపు తీగెవంటిది దగ్గరి పొందుసేసితే
పులకలమొగ్గలు గొబ్బున మేనఁ బొడము

చ 2: ననుపు వెన్నవంటిది నవ్వులు నవ్వితేనే
మొనసి సెలవి నయములు దేరును
చనవు పంటవంటిది జాణతనాలాడఁగానే
అనుగునాలికెతుద నక్షయమై పెరుగు

చ 3: రతి తపమువంటిది రచనలు మీఱఁగాను
చతురతఁ గాఁగిటిలో సఫలమౌను
హితవుతో శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
మితిమీఱి యిందులోనె మేలెల్లాఁ జేరును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1170-3 దేసాళం సం: 21-351

పల్లవి: మఱచేమా నేమిఁక మాఁటిమాఁటికి

తఱితోడ నేపొద్దు ధ్యానము సేసేము

చ 1: ఆపె గరుడిఁ జదివినటు వంటిమాఁటలు

రాపుల నిదివో నేఁడు రచ్చకెక్కెను

పై పై నే మవియెల్లా పాటము గొంటిమి నేఁడు

చాపలాన నేపొద్దూ జపము సేసేవు

చ 2: పడఁతి మొగసాలలోఁ బచరించినచేఁతలు

వడిగాఁగ నిన్నిట్లాను వహికెక్కెను

విడివిగా నేమవి నేరుచుకొంటి మిదివో

తడఁబడ కేపొద్దూఁ దలఁచుకొనేము

చ 3: అంగనమంచముమీఁద నభ్యసించినవిద్యలు

రంగుగా మాకాఁగిటిలో రతికెక్కెను

అంగవించి శ్రీవేంకటాధిప నన్నే కూడితి

సింగారాలనీరూపే చింతనసేసేము





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1170-4 సామంతం సం: 21-352

పల్లవి: ఇవివో మాసుద్దులు యెవ్వరికి ముద్దులు

వివరించి చూచుకొమ్మా వింతవింతబుద్దులు

చ 1: తారుకాణించఁగఁబోతే తప్పులాయ మాఁటలు

వూరకే వినఁగఁబోతే నుప్పులాయను

సారెసారెఁ జెనకఁగ చప్పనాయ వలపులు

కోరి వెనఁగఁగఁబోతే గొప్పలాయను

చ 2: బడిబడిఁ జేయఁబోతే పగలాయసేఁతలు

తడవినప్పుడెల్లాను తగులాయను

నడుకొత్తవినయాలు నానావగలాయను

గొడవలేని పొందులగుట్టు మిగులాయను

చ 3: ననిచి పెనఁగఁబోతె నవ్వులాయ నాసలు

పొనుఁగక దాఁచితేనే పువ్వులాయను

యెనసితివి శ్రీవేంకటేశ నన్ను నింతలోనే

కనుఁగొన్నరతులెల్లా కడురవ్వలాయను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1170-5 బౌళి సం: 21-353

పల్లవి: నేసవెట్టవయ్యా ఇట్టె చెలిమీఁదను

ఆసల మీకిద్దరికి నన్నిటా నమరును

చ 1: గక్కనఁ జెట్టపట్టితే కంకణము వంటి దాపె

దక్కి వురమెక్కితేను తాళివంటిది

మొక్కలానఁ దొడెక్కితే మొలనూలువంటిది

అక్కజమై నీకు నాపె కన్నిటా నమరును

చ 2: చేరి విన్నవించితేను చెవిపోగులవంటిది

నీరతికి వద్దనుంటే నీడవంటిది

కోరి పానుపుపై పెండ్లికూఁతురువంటి దేపొద్దు

ఆరీతి నాపెకు నీకు నన్నిటా నమరును

చ 3: పాదాలసేవసేసితే పావకోరళ్ల వంటిది

సోదించి కూచుండితేను సొమ్ము వంటిది

యీదెస శ్రీవేంకటేశ యింతి నీవుఁ గూడితిరి

ఆదిగొని నీకు నాపె కన్నిటా నమరును



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1170-6 మధ్యమావతి సం: 21-354

పల్లవి: అప్పటి మమ్ముఁ జెనకే వాసోదకాఁడవు నీవు

చప్పఁగా గరివడ్డ పెసరుగింజవయ్యా

చ 1: అలిగించుకొంటా వెంగే లట్టె యాడించుకొంటా

వెలఁది యొకతెచేత వేగించరాదు

పలువురు గొల్లమంకు భామలబారిఁ జిక్కి

బలిమినెట్లా వెళ్లఁబడితివయ్యా

చ 2: చన్నుల నొత్తించుకొంటా సారె జంకింపించుకొంటా

కన్నె వొక్కతె కాఁగిటఁ గరఁగరాదు

పన్నినపదారువేలపంతాలకు లోనై

ఇన్నిటా నెట్ల ధరియించితివయ్యా

చ 3: చెందినరతికేలిని శ్రీవేంకటేశ్వర

పొంది యొక్కతె మెప్పించి భోగించరాదు

యిందరిరూపులైన యిందిరను నన్ను నేలి

అందపు వేడుకల నెట్టలరితివయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1171-1 ఆహిరి సం: 21-355

పల్లవి: సిగ్గువడ వెంత్తైనా చెల్లఁబో నీవు

బగ్గన మమ్ము నవ్వుఁబాటు సేసేవు

చ 1: చాయలకు నీవు నాతో సరసములాడఁగాను

మోయుచు సవతులు మోములుచూచుకొనేరు

యీయెడ మంచముమీఁద నిద్దరముఁ గూచుండఁగా

నాయములు వెట్టుక సన్నలుసేసుకొనేరు

చ 2: కాతరాన నీవు నాకు గందపుబొట్టు వెట్టఁగా

జాతులు సేసేరు వారె సారెసారెఁ జెలులు

చేతిసురటిని నీవు చేరి నాకు విసరఁగ

రాతిరిఁబగలును కేరడములాడేరు

చ 3: కందువల నీవు నన్నుఁ గాఁగిలించి కూడఁగాన

అందరుఁ దమతమకే ఆసపడి రిపుడు

పొందినశ్రీవేంకటేశ భోగములెల్లా సరి

మందలించి నా కెక్కుడుమన్నన లనేరు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1171-2 బౌళి సం: 21-356

పల్లవి: ఏమిదప్పిపోయి నీకు నెందరు లేరు సతులు

నేమముతో నున్నదాన నెరవేర్చరాదా

చ 1: మగువా నీవును నుండి మాటలు నన్నాడించేవు

యెగసక్కేలాడఁగా నీ వేముందువో

జగడాల కోపను చాయసేసుకొని నేను

వొాగి నూరకున్న దాన నుండనీరాదా

చ 2: పడఁతి నీకుండఁగా నాపయ్యెదకొంగు వట్టేవు

యెడసి చేత దొబ్బఁగా నేమందువో

కడుంగోప మాఁపలేక గక్కన గుట్టుసేసుక

వొాడికాన నున్నదాన నుండనీరాదా

చ 3: దక్కి యాపెఁ గూడుండి తడవేవు నన్నప్పటి

యెక్కడికైనా రమ్మంటే నేమందువో

ఇక్కడ శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి

వుక్కుమీరి వున్నదాన నుండనీరాదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1171-3 లలిత సం: 21-357

పల్లవి: ఎఱుఁగుదు మిందరము నీవలపు

తర గరితనముతో దాఁచనేమిటికే

చ 1: జొబ్బిలుఁ జెమటలతో సోనగారీ నీవలపు

నిబ్బరపుటూర్పుల నిండీ వలపు

వుబ్బరిపులకలచే వుట్టిపడీ నీవలపు

అబ్బురపుపతితోడ నలుగనేమిటికే

చ 2: జాఱెడితురుముతోడ సందడించీ నీవలపు

మీఱినరతుల మితిమీఱీ నీవలపు

ఆఱడికాఁకలతోడి ఆయాలురేఁగీ వలపు

చూఱలుగా నితనికి చూపిచెప్పనేఁటికే

చ 3: వేడుకచూపులతోడ వేళగాచీ నీవలపు

వూడిగెపుచేఁతల కోగ్గీ వలపు

కూడె శ్రీవేంకటేశుఁడు గొబ్బున ని న్నంతలోనె

మోడామోడిసిగ్గుల మూసిపెట్టనేఁటికే









శృ.రేకు: 1171-4 మంగళకౌసిక సం: 21-358

పల్లవి: ఏల తిట్టు దిట్టేవు ఎవ్వరి దపరాధము

మూలలవారిచన్నులు ముట్టితియ్యఁగాను

చ 1: చెక్కులు నొక్కె నొకతె జీరలుదీసె నొకతె

చక్కనిగొల్లెతలతో సాముసేయగా

తొక్కెఁ బాదాన నొక్కతె దొమ్మిసేసె మరొకతె

వుక్కున వారిండ్లలోనివు ట్లెక్కగాను

చ 2: చన్నుల నొత్తె నొకతె చప్పరించె మోవొకతె

పన్ని గొల్లవారి నీవు బండుసేయగా

సన్నల దూరె నొకతె చలము రేఁచె నొకతె

పన్నుగ వారిచీరలు పట్టితియ్యఁగాను

చ 3: కైకొని పట్టె నొకతె కందువఁ గూడె నొకతె

జోకతో మందలవారి సోదించఁగా

ఆకడ శ్రీవేంకటేశ అలయించె నిన్నొకతె

దీకొని వారి బలిమిఁ దీసి కూడఁగాను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1171-5 సామవరాళి సం: 21-359

పల్లవి: తగవెఱఁగనివాఁడా తరుణిరో నీమగఁడు

నగవులకొలఁదినే నాఁటుకొనీఁగాక

చ 1: సొలసేవు రమణుని సూటిదప్పకచూచేవు

కలసినందాఁకా నిట్టె కాంతాళించేవు

బలువులు చూపుదురా పతితోడ నింతేసి

కొలఁదెఱిఁగాతఁడే కూడీఁగాక

చ 2: పెనఁగే వాతనితోడ బెట్టిమాటలాడెవు

తనువుసోఁకినదాఁకాఁ దమకించేవు

మొనలెత్తి చూపుదురా మొదలనే ఆతనితో

అనువెఱిఁగి తానే ఆదరించీఁగాక

చ 3: కక్కసించి పిలిచేవు కరకరిఁబెట్టేవు

చిక్కిలోనైనదాఁకా చిమ్మిరేఁగేవు

యెక్కువ శ్రీవేంకటేశుఁ డితం డిట్టె నిన్నుఁ గూడె

మిక్కిలియాతఁడే నీకు మేలువాఁ డవుఁగాక





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1171-6 అమరసింధు సం: 21-360

పల్లవి: ఆనతియ్యవయ్యా అందుకు మాఁటెఱుఁగుదు

పూని అందరిని నీకుఁ బొందుసేసేను

చ 1: వసివాడు మోముతోడ వంచుకొనేవు శిరసు

దెసల నెవ్వతెయైనాఁ దిట్టదుగదా

అసురుసురౌతాను అలసేవు పలుమారు

పిసికి ని న్నెవ్వతైనాఁ బిప్పిసేసెనో

చ 2: వుడుకుఁ జెమటతోడ నొరగేవు మలగుపై

కడనెవ్వతైనా నలుగదుగదా

చిడుముడితోఁ గొంత చిన్నఁబోయివున్నాఁడవు

పడఁతి యెవ్వ తెయైనాఁ బంతమాడెనో

చ 3: నిండుఁగళలతోడుత నివ్వెరగైనాఁడవు

అండనెవ్వతైనా మర్మా లంటదు గదా

దండిగా శ్రీవేంకటేశ తగ నన్ను నేలితివి

చండిపెట్టి యెవ్వతైనా సారెకు బోధించెనో




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1172-1 సామంతం సం: 21-361

పల్లవి: నీవొళ్లనేర మెంచవు నేమే కల్లలమనేవు

తావుకు విచ్చేయుమా తారుకాణించేము

చ 1: మావంటివారిమాట మనసునఁ బట్టకుంటే

ఆవలికి రావయ్యా ఆపె ఆడీని

కావించి నేనిచ్చినట్టికమ్మ నీవు నమ్మకుంటే

వావిరి నీవడుగుమా వాసి చూపీని

చ 2: వూడిగపువారి మొక్కు లొల్లఁబే ట్లైతేను

ఆడకే రమ్మా నీకు నాపె మొక్కీని

యీడ నేము వెట్టేఆన లియ్యకోలుగాకుంటే

తోడనే విచ్చేయుమా తొయ్యలిచే వినేవు

చ 3: ఇచ్చిన మాచేకానుక లింపులు నీకుఁ గాకుంటే

అచ్చటికి రమ్మా చెలి ఆపె యిచ్చీని

ఇచ్చల శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి

అచ్చుగా నీ వేకతము లాడుమా విన్నవించీని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1172-2 వరాళి సం: 21-362

పల్లవి: మాపుదాఁకా వట్టిజోలి మాతో నేఁటికి

నీపొందుల కిది వలె నేరుచుకోవయ్యా

చ 1: తెగరాని మాఁటలకు తెరువు కోపగించుట

నగితేనే పెనగొను నాలితనము

మొగము చూచితేనే మోహములెల్లా నిండు

నిగిడి నీకేది వలె నేరుచుకోవయ్యా

చ 2: తీరనియలుకలకు తెరఁగు పంతమిచ్చుట

వూరకుండితేనే నాయ ముమ్మళినుండు

కూరిమి గొసరితేనే కుప్పవడు వలపులు

నీరచన కేది వలె నేరుచుకోవయ్యా

చ 3: పట్టినవాలములకు పరిహరము మొక్కుటే

గుట్టుతో నుంటే నన్నీఁ గొనసాగును

ఇట్టె శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను

నెట్టన నీ కేది వలె నేరుచుకోవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1172-3 దేసాళం సం: 21-363

పల్లవి: చేతికి లోనైనప్పుడే చేరి కై కొందువుగాక

పోతరపుమదమున బొద్దేల జరపేవె

చ 1: పిలువగబిలువగ బిగిసే వాతనితోను

చలపాదితనమేలే సారెసారెకు

నలువున నీవలపు నాటి మతి నుండగాను

వెలి నీవు సటచేసి విఱ్ఱవీగేదేటిదే

చ 2: పట్టబట్ట నాతనితో బలిమినే పెనగేవు

వట్టిబీరములేటికే వరవాతాను

వుట్టిపడి నీయాసలు వొడినిండా నుండగాను

దిట్టతనములు చూపేదీమస మదేటిదే

చ 3: కూడగగూడగ గునిసే వాతనితోను

పాడిపంతము లేటికే పచ్చిదేరెను

యీడనె శ్రీవేంకటేశు డెనసె ని న్నింతలోనె

వీడెపు సొక్కులతో డివింత లిదేటిదే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1172-4 రామక్రియ సం: 21-364

పల్లవి: ఏల వేగిరించేవు యింతలోననే నీవు

కాలుదొక్కినప్పుడే కరగించీగాక

చ 1: నిన్ను నేమైనా దిట్టైనా నెలత నీచేతలకు

చన్నుల మొనలనే సాదించీగాక

యెన్నిసుద్దులు చెప్పినా యెదురు నీ కాడీనా

సన్నలచాయలనే చక్క బెట్టీ గాక

చ 2: కోపగించీనా ఆపె కొండుకనీసుద్దులకు

చూపులకొనలనే సోదించీగాక

మాపుదాకా నవ్వినాను మారుకొనీనా నీతో

తీపులమాటలనే తిద్దుకొనీగాక

చ 3: జంకించీనా నేడు సతి నీగుణములకు

పొంకపురతులనే భోగించీగాక

అంకెల శ్రీవేంకటేశ ఆపె నీవు గూడితిరి

మంకుదనాలు చూపీనా మనసిచ్చీ గాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1172-5 గౌళ సం: 21-365

పల్లవి: ఎప్పటికెప్పటివాదు లెందాఁకానే

కొప్పులు వీడినమీఁద కూడుకొనవలదా

చ 1: సొగిసి మొగామొగాలు చూచుకొంటె జాలుఁగాక

తగవు లేమున్నవే తనకు నాకు

నగవులు సెలవులు నారుకొంటేఁ జాలుఁగాక

ఎగసక్కేలు మరెవ్వరు నేమాడేరే

చ 2: ఆరీతినే మాటకు మాటాడుకొంటేఁ జాలుఁగాక

తారుకాణ లేమున్నవే తనకు నాకు

తారసించి మేనుమేనుఁ దగులైతేఁ జాలుఁగాక

నేరములు మరెవ్వరు నేఁడేమి వట్టిరే

చ 3: ఇతవుతో నిట్లానే యెనసితేఁ జాలుఁగాక

తతి యెంచ నేమున్నదే తనకు నాకు

రతిని శ్రీవేంకటాద్రిరమణుఁడు నన్నే నేలె

మతకా లెవ్వరు నింక మరేమి వన్నేరె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1172-6 పళవంజరం సం: 21-366

పల్లవి: ఈతగవు నీమతిలో నెంచుకోవద్దా

కాతరాన నీవు మమ్ముఁ గదియఁగఁజెల్లునా

చ 1: వేడుకకు నేఁ దిట్టితే వెంగెము సేసుకొందురా

ఆడుకొనేరా నిన్ను నవ్వలివారు

పాడితో నింత సిబ్బితిపడేవాఁడవైతేను

వోడక మోవెంగిలికి నొగ్గ నీకుఁ జెల్లునా

చ 2: నగుటా గోరగీరితే నాతో వాదింతురా

అగడుసేసేరా నిన్ను నవ్వలివారు

వొగి నీ వింతపనికి నోపనివాఁడ వైతేను

మిగులా రతులఁ గిందుమీఁదుపడఁజెల్లునా

చ 3: చేయివట్టి నేఁదీసితే శిరసిటే వంతురా

ఆయెడఁ బంగించేరా అవ్వలివారు

యీయెడ నన్నుఁ గూడితి వింతవాసివాఁడవు

చాయ శ్రీవేంకటేశ చన్నులంటఁజెల్లునా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1173-1 కాంబోది సం: 21-367**

**పల్లవి: అనరాదు గాక నిన్ను ఆయములు చూపి మోపి**

**ఘనుఁడవైతే పాపము కలపేవా నీవు**

**చ 1: శిరసు వంచుకుండాన సిగ్గువడివున్నదాన**

**కరఁగుచు నాపై నేల కాలు వేసేవు**

**సరుగన నేఁతైనా మజ్జన మవధరించవు**

**దొరవైతే నేసినట్టిదోసములు వాసునా**

**చ 2: కలయక వున్నదాన కడనిట్టే వున్నదాన**

**యెలమిఁ దమ్ములము నాకేల పెట్టేవు**

**కలవి మోవి యెంగిలి కడుగకో వేఁతైనా**

**యిలయేలేవాఁడవైతే నెంగిలి లేదా**

**చ 3: అంటఁగాక వున్నదాన ఆనవెట్టుచున్నదాన**

**జంటగాఁ గాఁగిటఁ బట్టి సారెఁ గూడేవు**

**నంటున శ్రీవేంకటేశ నామతక మెఱఁగవు**

**దంటవయసువాఁడవైతే తప్పొప్పు లేదా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1173-2 ఆహిరి సం: 21-368

పల్లవి: ఇన్నాళ్లు నెఱఁగము ఇంతలేసిపనులు

సన్నల చాయలనే సతమాయ వావులు

చ 1: పాటపాట సిగ్గులతో పఁడతి నీవు నవ్వఁగ

తేటతెల్లమాయను మీతెఱగుఁలెల్లా

మాటమాటలను మీరు మర్మాలు సోఁకనాడఁగా

వాటమాయ మీలోనివాడికవలపులు

చ 2: వెడవెడ చూపు మీసై విచ్చనవిడిఁ బారఁగ

తడఁబడీ మీలోనితమకమెల్లా

చిడుముడితో మీరు చేతులుపైఁ జాఁచఁగాను

అడియాలాలాయను మీఅంకెలైనలంకెలు

చ 3: పొద్దువొద్దు బాసలు గొబ్బున మీలోఁ జేయఁగాను

వొద్దికాయఁ గూటములు వొండురులలో

అద్దుక శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడఁగాను

సుద్దులాయఁ దొల్లి టినీ సొలపుల పొందులు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1173-3 పాడి సం: 21-369

పల్లవి: తరవాతి పనులకు తానే నేను

మరుతంత్రములోన మరియేఁటిమాటలే

చ 1: బలువు కొలఁదియే పంతము

చలము కొలఁదియే సాదింపులు

కలిమికొలఁదియే గర్వము

మలసి తనకు నాకు మరియేఁటిమాటలే

చ 2: మనసుకొలఁదియే మంగళము

చనవుకొలఁదియే సరసము

యెనసినకొలఁదివే యింపులు

మనవి సనవి చెల్లె మరియేఁటిమాటలే

చ 3: మచ్చికకొలఁదివే మంతనాలు

వచ్చినకొలఁదివే వాడికలు

ఇచ్చగించి శ్రీవేంకటేశుఁడే తా నన్నుఁ గూడె

మచ్చరములెల్లాఁ బాసె మరియేఁటిమాటలే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శ్రృ.రేకు: 1173-4 హిందోళం సం: 21-370

పల్లవి: ఏమయ్య కటకటా యెంతదోసము

ఏమైన మందెమేళ మింతసేసీనా

చ 1: ఆపె నీకు విడెమిచ్చేననఁగానే వేగిరించి

చాపలానఁ దముల మొసఁగుమనేవు

ఆపని తొల్లెలవాటైతే నీకు నాయఁగాక

యీపడఁతి యిపుడు నీ కెంగిలివెట్టీనా

చ 2: వెలఁది నీకొకనాఁడు విందువెట్టేననఁగానె

తొలఁగక యిపుడే పొత్తుకు వచ్చేవు

అలరి నీకిది సాజమైతే నాయఁగాక

కలికి నీకు నెంగిలికడి వెట్టీనా

చ 3: సారెకు రతుల మేలు చవిచూపేననఁగానె

తేరి యిందరిలో మోవితేనడిగేవు

మారుక శ్రీవేంకటాద్రిమందెమురాయ కూడితి

యీరీతి నింకా నీకు నెంగిలివెట్టీనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1173-5 దేసాళం సం: 21-371

పల్లవి: సేయవయ్య నీకు నేఁడు చెల్లినంతాను

పాయరాదు నిన్ను నిట్టె పైకొనుటేకాని

చ 1: తెగరాదు నీవెంత దిమ్మరివై తిరిగినా

జగడానఁ గొంతగొంత సాదించది

నగరాదు నీవు సేసేనాటకపుఁజేఁతలకు

మొగమోడి చేతులెత్తి మొక్కు టింతేకాని

చ 2: తిట్టరాదు యెవ్వతెతోఁ దెగడియాడినా నిన్ను

జట్టిగాఁ జూపులఁ జూచి జంకించుటే

పట్టరానినీ వెందుఁ బఱచవై తిరిగినా

చెట్టవట్టి నీసేవసుయి టింతేగాని

చ 3: మానరాదు నీవెన్నిమతకములు నుండినా

నానినచెమటలతో నంటుసేయుటే

పూనిక శ్రీవేంకటేశ పొందితివి నన్ను నిట్టె

ఆనుకొని నీతో ముదమందు టింతేకాని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1173-6 కాంబోది సం: 21-372

పల్లవి: నన్ను నేల తడవేవు నాజాడ నీవెఱఁగవా
యెన్నిక నిను దగ్గర నిది వేళా నాకు

చ 1: చాయలకు నాపె నీతో సరసములాడఁగాను
నాయమా నీతో నాకు నవ్వఁగ నేఁడు
చేయి చాఁచి యప్పటిని చెనకులు చెనకఁగా
యీాయెడ నీసేవ సేయ నిది వేళా నాకు

చ 2: యెలయించి యాపె నిన్ను నేకతానకుఁ దియ్యఁగా
చలమా నిన్నుఁ బిలువ సారెకు నాకు
పలుమారుఁ దానె నీతోఁ బచ్చిమాఁటలాడఁగాను
యెలమి నే విడెమీయ నిది వేళా నాకు

చ 3: గరిమ నాపె నిన్నుఁ గాఁగిలించుకుండఁగాను
పురుఁడా నేను నట్టె పొత్తుగలయ
ఇరవై శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి
యెరవులేక కొసర నిది వేళా నాకు





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1174-1 ముఖారి సం: 21-373**

**పల్లవి: అంత విచ్చి చెప్పకు మా కప్పటి నీవు**

**యింతా నీమన్ననలోనె యెఱఁగరాదా**

**చ 1: వీనులకు నేఁజేసేవిన్నపము చవులైతే**

**నావినాని నీవలపు ననలొత్తీని**

**ఆనందించి నీకు నాపై నంతబత్తి గలిగితే**

**కానరాదా నీమోము కళలలోనె**

**చ 2: సోగలుగా నేఁజూచేచూపులే నీకితవైతే**

**చేఁగదేరేనీమనసు చిగిరించీని**

**వేగిరించి నన్నుఁ బొందేవేడుక నీకుఁ గలితే**

**లాగుగాఁ దెలియదా సెలవినవ్వులోనె**

**చ 3: చెనకేనాసరసము చిత్తాన నీకుఁ బట్టితే**

**పనివడి నీకోరిక ఫలియించీని**

**యెనయుచు శ్రీవేంకటేశ నన్ను నేలితివి**

**ననుపెల్లాఁ దోఁచగా యీనయములోనె**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1174-2 శ్రీరాగం సం: 21-374

పల్లవి: ఇంతలోనె వేగిరమా యెందు వోయేము

వంతులువెట్టాడకురా వచ్చేఁగాని నేను

చ 1: నాలితనాననే నీవు నాతులను వలపించి

వేలసంఖ్యలను లోన వేసుకొంటివి

పాలించి యింకా నెందరి భ్రమయించనున్నాఁడవో

చేలకొంగు విడువరా చెప్పేఁగాని నీకు

చ 2: సాదుఁదనాన నప్పటి సతులఁ దక్కులఁబెట్టి

ఆదిగో నిందరిమానా లంటుకొంటివి

యీదెస నెవ్వరెవ్వరి నెంతసేయ నున్నాఁడవో

సోదించకురా నావోడి చూపేఁగాని మేలు

చ 3: మంచితనాననే నీవు మానినులమోవు లాని

చంచుల నెంగిలిసేసి చవిగొంటివి

యెంచఁగ శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి

దించకురా నీవురము తిరమైతి నిపుడు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1174-3 పూర్వగౌళ సం: 21-375

పల్లవి: ఇద్దరూ నెదిరించిరి ఇన్నిటికి మూలము

పొద్దువొద్దుకు మనము బుద్ధిచెప్పనేఁటికే

చ 1: సెలవినవ్వినవ్వు సిగ్గులకు మూలము

కలికితనము కాఁకలమూలము

పలుకులు లోలోనె పైకొనుటకు మూలము

వెలసె నన్నిపనులు వేగిరించనేఁటికే

చ 2: కొనఁగోరిచెనకులు కోరికలకు మూలము

పెనఁగులాటలు కడుఁ బ్రియమూలము

తనివోనికొసరులు తమకముల మూలము

యెనసెఁ దనంతఁదానె యెచ్చరించనేఁటికే

చ 3: మొగమొగాలు చూచూట మొక్కులకు మూలము

తగవులు కూటమికిఁ దానె మూలము

నిగిడి శ్రీవేంకటాద్రి నిలయుఁడు సతి నేలె

పగటున నిఁక వేరే బాసడుగనేఁటికే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1174-4 గౌళ సం: 21-376

పల్లవి: ఇంత వెఱవుమఱపు లేఁటికి నీకు

కాంతలు పెక్కుగలుగుఘనుఁడవు నీవు

చ 1: చెక్కులు నిన్ను నొక్కితే సిగ్గులువడుదురా

చొక్కపుచూపుల నన్ను చూతువు గాక

గక్కున చేయివేసితే కడుఁజెమరింతురా

ఇక్కువ లంటి నన్ను యెచ్చరింతువు గాక

చ 2: నిన్ను సోఁకనాడితేను నివ్వెరగందుదురా

అన్నిటాను నాకు లోనవుదువుగాక

సన్నలు సేసితేనే జల్లనఁ బులకింతురా

మన్నించి నాతో మారుమలతువుగాక

చ 3: వొద్దికై నేఁ గూడితేను వూరకె భ్రమతురా

చద్దివేఁడివలపులు చల్లుదుగాక

అద్దో శ్రీవేంకటేశ ఆలనైతి నీకు నేను

పొద్దువొద్దు రతులను భోగింతువుగాక





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1174-5 ఆహిరినాట సం: 21-377**

**పల్లవి: తనవోజ మానఁడు తప్పు లాతనికి లేవు**

**పెనఁగఁగం బెనఁగఁగఁ బీరమే కలది**

**చ 1: సారె మీరు చెప్పఁగాను చలపట్టి పోరఁగాను**

**కూరిమిఁ గొసరఁగాను కోపగించేనా**

**మేరమీరినాతఁడు మిందుఁగిందు నెంచఁడు**

**తారుకాణించగఁబోతే తగవులే కలవి**

**చ 2: అందాలు మీరు చెప్పఁగా నట్టె వేఁడుకొనఁగా**

**విందువలె మొక్కఁగాను వెగ్గళించేనా**

**మందెమేళమే యాతఁడు మానఁడు తన గుణాలు**

**అందుకు నౌఁగాదంటే నానలే కలవి**

**చ 3: పనివడి మీరనఁగా పంతాలు సరిసేయఁగా**

**చనవులు చెల్లించగా సాదించేనా**

**యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నిట్టె**

**ననుపు నటించఁగాను నవ్వులే గలవి**



శృ.రేకు: 1174-6 సామంతం సం: 21-378

పల్లవి: నీలోనివారమే నేమెల్లాను

పాలువొంగినట్లనే బతుకవే యికను

చ 1: నిలువెల్ల నీటే నీకేమి గడమే

వలపించితివి యిందువంక నాతని

చలవాసితి వన్నిటా సతమాయ నాతఁడు

ఫలియించె నీతపము బతుకవే యికను

చ 2: మేనెల్ల గర్వమే మేకులు నీకేమి బాఁతె

లోను సేసుకొంటివి మేలున నాతని

యీనెపాన దొరవైతి వింతసేసె నాతఁడు

పానినచలము చెల్లె బతుకవే యికను

చ 3: రూపెల్ల బిగువే నేరుపులు నీకేమి గొత్తె

తీపులఁబెట్టితివి యింతేసి యాతని

చేపట్టి నిన్నిట్టె కూడె శ్రీవేంకటేశుఁడు

పైపైనె మావలెనే బతుకవే యికను

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1175-1 ఆహిరి సం: 21-379

పల్లవి: ఏమి సేయవచ్చునయ్యా ఇంతుల భాగ్యము గాక

బూమెలనీగుణములే బుద్దులు నేరుపవా

చ 1: వెలుపలినీచేఁతలు వెల్లవిరులై యుండఁగా

తెలియదా నామాట దిష్టము నీకు

చలివాసి నీవలపు సరివచ్చివుండఁగాను

సెలవి నీనవ్వులింకాఁ జిమ్ముఁరేగవా

చ 2: మిక్కైలిపరాకులు నీమీఁద నిండివుండఁగాను

చిక్కదా నాకానికె చేతికి నీకు

మక్కువతో నీమేను మచ్చములు చూపఁగాను

తక్కక నీసిగ్గు లింకాఁదలకొనవా

చ 3: కరగిననీరతులు కాంరిటిలో నుండఁగాను

యిరవుగావా నాగోరియెచ్చరికెలు

యెరవులేక శ్రీవేంకటేశ నన్ను నేలితివి

ధరలోన నీబాసలు తగవులు చెప్పవా




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1175-2 శ్రీరాగం సం: 21-380

పల్లవి: నేరుతునా నేనేమైనా నీమహిమ లింతేకాక

వూరకేవుండేనన్నా వుద్యేగాలఁ బెట్టును

చ 1: నెట్టుకొన్న యటువంటినీతోడిపొందులు

రట్టుసేయవా నీచుట్టాలనెల్లా

గుట్టున నెంతవుండినాఁ గొచ్చికొచ్చి పెడఁరేచి

దిట్టమాట లాడించు దీకొని నీతోను

చ 2: కూరిమితో నీకాఁగిటఁ గూడేటి కూటములు

ఆరీతి రేఁచకుండునా అఁడవారిని

యేరేతిసాదులనైనా యెమ్మెలెల్లాఁ బుట్టించి

నేరములు పట్టింపించు నిన్ననే సారెకును

చ 3: సందడించినటువంటి సరసపురతు లివి

మందెమేళము సేయించు మానినులను

కందువ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను

అందాలు సేయించును నీయరఁగొరలెల్లాను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1175-3 వరాళి సం: 21-381

పల్లవి: ఇంకనేల కొసరూ యిన్నిపనులను నాయ

పొంకమైతి రిన్నిటాను పొరలెల్లాఁ బాసె

చ 1: యీవల నింటిలోన మిమ్మిద్దరినిఁ బొడగని

వేవేగ మామతిలోని వెఱపు వాసె

చేవలుమీరినమీకు చేతులారా వద్దనుండి

సేవలెల్లాఁ జేయఁగాను సిబ్బితి వాసె

చ 2: ననుపున నిద్దరూను నవ్వు లిట్టె నవ్వఁగాను

పనివడి తొల్లిటికోపమూఁ బాసె

పెనఁగుచు నొండొరులు ప్రియములు నటించఁగా

జయమంది తిట్లాడేచలమెల్లఁ బాసె

చ 3: అలమేల్మంగ నురమందు నీవెక్కించుకోఁగా

మొలచినయను మానములెల్లఁ బాసె

యెలమి శ్రీవేంకటేశ ఇద్దరూ మమ్మేలఁగాను

నెలకొంటి మిఁకను మానేరమెల్లఁ బాసె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1175-4 భైరవి సం: 21-382

పల్లవి: నేనే యెంతైనాను నిన్ను విడువలేఁగాక

నానఁబెట్టితే గొడ్డలి నానఁబొయ్యీనా

చ 1: చెలరేఁగి నీకెంత సేవలు చేసినాను

వలపుగలంతె కాక వద్దనుండేవా

మలసి నిన్నప్పటిని మాటలఁ బేలించినాను

తలఁపుకొలఁదే కాకతమకించేవా

చ 2: యెనసి నీతో నెన్నియిచ్చకము లాడినాను

కనుపట్టినంతేకాక కైకొనేవా

చనవుసేసుక మరి సరసములాడినాను

పెనఁగేకొలఁదిగాక ప్రియపడేవా

చ 3: పగటున నిను నెంత పట్టి యెచ్చరించినాను

నగవుకొలఁదేకాక నాటుఁకొనేవా

మిగుల శ్రీవేంకటేశ మెచ్చి నన్నుఁ గూడితివి

మొగమోటకైనాను మోహించకుండేవా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1175-5 పాడి సం: 21-383

పల్లవి: ముంచి కతలకుఁ గాళ్లు ముంతకుఁ జెవు లడిగేవు

అంచెలమోవితిట్ల కందుకేమడిగేవు

చ 1: గబ్బితనాననాడినకాఁకలమాటలకెల్లా

గొబ్బునఁ దెలుపుమని కొంగువట్టేవు

వుబ్బున రతివేళల నొకటొకటే యాడిన-

అబ్బురపుసుద్దులకు నందుకేమనేవు

చ 2: కూరిమి గొసరుతాను గొణఁగినబాసలకు

తారుకాణించుమనుచు దగ్గరేవు

యేరోరి అనుచునాడే యింపులరాకొట్లకు

ఆరసి యేకతమున నప్పుడేమనేవు

చ 3: జవ్వనమదాన నీపైఁ జల్లినపంతాలకు

చివ్వనఁ గాఁతాళించి చేయివట్టేవు

నవ్వుతా శ్రీవేంకటేశ నన్నుఁ గూడితి వింతలో

అవ్వల నిందుకు నాతో నర్త మేమనేవు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1175-6 శంకరాభరణం సం: 21-384

పల్లవి: గోరీగీరీ నాచెక్కు గోవిందుడు

కూరిములు గొసరీని గోవిందుడు

చ 1: నలిరేఁగి ననుఁ జూచి నవ్వీఁగదవే నేఁడు

కొలువులోపలనుండి గోవిందుఁడు

తలవంచుకొని నేను తరుణిమాటున నుంటే

కులికికులికి చూచి గోవిందుఁడు

చ 2: చిప్పిలుఁదమకమున చేసన్న సేసీఁగదే

కొప్పు ముడుచుకోఁగానే గోవిందుఁడు

వుప్పతిల్లుసిగ్గుతోడ నొడికా నే నుండితే

గొప్పతామరల వేసీ గోవిందుఁడు

చ 3: కమ్మటినిఁ దెరవేసి కాఁగిలించి కూడెఁగదే

కుమ్మరింపుమోహముల గోవిందుఁడు

ఇమ్ముల శ్రీవేంకటాద్రి నిరవై తిరుపతిలో

కొమ్మలతో నీడువెట్టీ గోవిందుఁడు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1176-1 ధన్నాసి సం: 21-385

పల్లవి: ఆత డెవ్వాడు చూపరే అమ్మలాల

ఏతుల నాడేటిక్రిష్ణుఁ డీతఁడే కాఁడుగదా

చ 1: కందువ దేవకి బిడ్డఁగనెనట నడురేయి

అంది యశోదకుఁ గొడుకైనాఁడట

సందడించి పూతకిచంటిపాలుఁ దాగెనట

మందల ఆవులఁ గాచి మలసెనట

చ 2: మంచిబండి దన్నెనట మద్దులు విరిచెనట

ఇంచుకంతవేలఁ గొండయెత్తినాఁడట

మంచాలపై గొల్లెతలమానాలు చేకొనెనట

మించులఁ బిల్లగోవివట్టి మెరసెనట

చ 3: కాళింగుని మెట్టెనట కంసుఁ బొరిగొనెనట

పాలించి సురలఁ జేపట్టెనట

యీలీల శ్రీవేంకటాద్రి నిరవైనదేవుఁడట

యేలెనట పదారువేలింతుల నిందరిని





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1176-2 దేశాక్షి సం: 21-386

పల్లవి: ఏమిసేతుమమ్మ నేము యెశోదమ్మ

గామిడితనములనే కడఁగీ బాలుఁడు

చ 1: అందెలు మువ్వలు ఘల్లురనఁగ వీదివీదుల-

నందుక వుట్లు గొట్టీనదె బాలుఁడు

గొందినున్నఁ బోనీక కోలలు చాఁచిచాఁచి

పొందుగ దొండ్లువోవఁ బొడిచీ మీబాలుఁడు

చ 2: చుంగలకాళతోడ సొరిది బాలులతోడ

ముంగిటి వుట్లు గొట్టీ ముద్దుబాలుఁడు

అంగవించి గొల్లెతలు అడ్డములురాఁగానే

యెంగిలిసేసీ మోవులు యిదిగో మీబాలుఁడు

చ 3: చొల్లెపుజెడ వీఁపున సోయగమై వేలఁగాను

చిల్లరవుట్టు గొట్టీఁ జిన్నిబాలుఁడు

మెల్లనె సతులుఁ దాను మేలములాడుకొంటా

ఇల్లిదె శ్రీవేంకటాద్రి యెక్కెను మీ బాలుఁడు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1176-3 పాడి సం: 21-387

పల్లవి: ఇంకనేఁటి మాటలే ఇయ్యకొనేదేగాక

పంకపుఁజెమటలు మైఁ బరగెఁగదే

చ 1: కడఁగి నీవలిగి గక్కన లేచి నిలుచుంటే

బెడిదపుటానలెల్లాఁ బెట్టీ నీపతి

వొడివట్టి తియ్యఁగాను వోపనంటాఁ బెనఁగఁగ

జడిసి పోఁకముడి జారెఁగదవే

చ 2: పంతమున నీవు లోనిపరపుపైఁ బండితేను

చెంతల నాతఁడు నీచెక్కులు నొక్కె

కొంతఁగొంత చెనకఁగఁ గోపగించి తిట్టఁగాను

బంతినే సిగ్గులు నీరై పారెఁగదవే

చ 3: ననుపున నింతలోనె నవ్వులు నీవు నవ్వితే

ఘనశ్రీవేంకటేశుఁడు కలసెఁగదే

మనసులు సోదించఁగా మరపులు మించఁగాను

నినుపులై పులకలు నిండెఁగదవే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1176-4 అమరసింధు సం: 21-388

పల్లవి: అక్కవు నీవు నాకు నైనానైతివి గాని

వొక్కింతవడికైనా నోపుదువటె

చ 1: చెలరేఁగి చెలరేఁగి చేతులు చాఁచేవు నీవు

వలెనటే నీతో నీకు వరవాతాను

బలుములు చూపి పెక్కుపంతములాడుకొనేవు

నిలిచేవా నాముందర నేరుపులను

చ 2: నారువోసి నారువోసి నవ్వులు నవ్వేవు నీవు

వోరిచేవటే నాతో వొడ్డారాలకు

పేరువాడి పేరువాడి బిరుదులు మెరసేవు

చేరఁగలవా నాచేవల్లకు

చ 3: పెచ్చురేఁగి పెచ్చురేఁగి పెనఁగేవు నాతోను

వచ్చేవటే నాతోడి వరుసలకు

యిచ్చగించి శ్రీవేంకటేశుఁ డిద్దరిఁ గూడె

మెచ్చేవటే నిన్నుమించినయందుకును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1176-5 సోమరాగం సం: 21-389

పల్లవి: బిగిసి యాపె నీకుఁ బెట్టనికోట

యెగసక్కేలకు నీవు యేమిసేసుకొంటివి

చ 1: కోపగించుకోఁబోఁగా కొలిచి మొక్కవలసె

తీపులఁ దిట్టినందుకు దీవించవలసె

చూపుల జంకించఁగాను సూడుపెనఁగవలసె

యేపున నెంతకు నెంత యేమిసేసుకొంటివి

చ 2: చేవట్టితియ్యఁగఁబోఁగా చెక్కులు నొక్కవలసె

చేవమీర నవ్వఁగాను సిగ్గువడవలసె

కావరించి పైకొనఁగా కైవశము గావలసె

యేవిదాన నుండివుండి యేమిసేసుకొంటివి

చ 3: కాఁకలు సేయఁగ బోఁగా గక్కనఁ గూడవలసె

పోఁకముడి యంటఁగాను భోగించవలసె

వేఁకపుశ్రీవేంకటేశ వెలఁదిఁ గలసి తిట్టె

యేఁకట నీయంత నీవు యేమిసేసుకొంటివి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1176-6 ఆహిరి సం: 21-390

పల్లవి: మానితివే తనతోడిమచ్చరములు

కానీవే ఇఁకనేమి కపటాలు బాసెనే

చ 1: వెనకటివలెఁగాక విచ్చేసెఁ దా నీడకు

మనసొక్కటాయ వేరేమాఁటలేఁటికే

చనవిచ్చె నింతఁగాను చలమెల్లా విడిచెను

కనుపట్టెఁ దనచేఁత కాఁతాళించనేలే

చ 2: పరులమాట వినక పైకొని నన్ను మన్నించె

మరిగితి నాలోని మంకు దీరెనే

సరసము లాడె నాతో సటలెల్లా విడిచెను

కెరలెను నామోహము కిసరు విడిచెనే

చ 3: వూసివాసు లెంచక వొగి నన్ను వేఁడుకొనె

సేసలు పైఁ బెట్టితినే చెల్లెఁ బంతము

ఆసల శ్రీవేంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె

సేసిననాపుణ్య మంబెఁ జెలఁగితినె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1177-1 శ్రీరాగం సం: 21-391

పల్లవి: ఇంకనేల కొసరేవు యింతిని

సుంకులు గావా గోరిసూటివాటు

చ 1: చిగురుఁజిత్తము లోనిచేఁగతనములే కావా

నగియేటిచెలిమోవినగవులు

మొగి విచ్చకకురిసేమోవితేనెలే కావా

పగటున నీతోడి పలుకులు

చ 2: వుదుటుఁగాంక్షలలోని వురుఁదాళ్లే కావా

సుదతి నిన్నుఁ జూచేచూపులు

వదలుఁ బయ్యెదలోని వన్నెకానికలు గావా

మెదలుఁజన్నులనీమేనిసోఁకులు

చ 3: వల్లేటి వలపుల సంగడి సేసలు గావా

చెల్లుఁబడి నింతిసేసే చేఁతలు

మెల్లనె శ్రీవేంకటేశ మించి యేలితి వాపెను

కొల్లలుగావా నీతో గొనకొన్నరతులు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శ్రు.రేకు: 1177-2 మధ్యమావతి సం: 21-392

పల్లవి: తప్పులేల పట్టేవు తరుణి నప్పటి నీవు

చప్పరింపుమాఁటలు సాజమే కాదా

చ 1: పతి సన్నసేసితేను పనిలేనిపనికైనా

సతులు జంకించేది సాజమేకాదా

రతికి రాయడించితే రాజసాన జంపు సేసి

చతురతఁ దిట్టేది సాజమే కాదా

చ 2: చేరి కొంగువట్టేవానిఁ జిగిరింపుఁగాఁకలతో

సైరణతోఁ జూచేది సాజమే కాదా

మేరమీరి కాఁతాళించి మీఁద మీఁదఁ బొదిగితే

సారె సిగ్గులు వడేది సాజమేకాదా

చ 3: అంకెల నీవు గూడఁగా నట్టె శ్రీవేంకటేశ్వర

జంకించి మోవడిగేది సాజమేకాదా

లంకెలై మీరిద్దరును లావులఁ బెనఁగేవేళ

సంకెలెల్ల మానేది సాజమేకాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1177-3 కాంబోది సం: 21-393

పల్లవి: నేమెల్లా నీయంట నేరమా యేమి

గామిడితనాలు బుద్ధికాదనికాక

చ 1: యిచ్చకపుమాటలు యెందాకా నాడేవే

పచ్చిగా విభునినేల భ్రమయించేవే

నెచ్చెలులు నీవలె నేరనివారా యేమి

తుచ్చెము సేయుట కడుదోసమనికాక

చ 2: చనవున నేంతని సాదించేవే యతని

యెనసి పను లెట్టు చేయించుకొనేవే

వనితలిందరు నీవంటివారే కారా యేమి

కొనల కెక్కేది కడు గోరతనికాక

చ 3: భావించి యెటువలె బాసలుగొనేవే నీవు

శ్రీవేంకటేశ్వరు నెట్టు చిక్కించితివే

నీవలెనే కూడమా నిండుగాగిట నితని

చేవదేరే దిది కడుసిబ్బితనికాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1177-4 వరాళి సం: 21-394

పల్లవి: కాఁగిలించుకొనవలెనా కమ్మటి నిన్ను

వీఁగక మాఁటాడితేనే వేడుకెల్లాఁ జెల్లెను

చ 1: కందువల నీవు నన్నుఁ గన్నులఁ జూచితేనే

అందరితోడివరుస లబ్బెను నాకు

చెంది నీవు వొకమాఁటు సెలవుల నవ్వితేనే

పొందినటువంటి రతిభోగములు నాయను

చ 2: చెనకి యొకమాఁటు నాచెక్కులు నీవు నొక్కితే

పనివడి సంసారఫల మబ్బెను

చనవున నిటువలె చదురంగమాడితేనే

తనువుమీఁది మదనతాపమెల్లా నారెను

చ 3: ఇచ్చగించ నావద్ద నేకతాన నీ వుండితే

నిచ్చకల్యాణము లిట్టే నెరవేరెను

యెచ్చరించి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

అచ్చపుమనోరథము లన్నియు సిద్ధించెను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1177-5 రామక్రియ సం: 21-395

పల్లవి: తానేల సిగ్గువడీనే తనకెలే వెరవు

నానాటిసుద్దులకు నవ్వేగాక

చ 1: యేలే తనతో నాకు నెక్కువ తక్కువ లాడ

మేలుమేలనుచుఁ గడుమేచ్చేఁగాక

చాలుకొని యప్పటిని చలము సాదించనేల

కేలెత్తి తనకు మొక్కి గెలిచేఁగాక

చ 2: పైకొని తన్నింతేసిబాసలు గొనఁగనేలే

యేకొలఁది కాకొలఁది యేనసేఁగాక

దీకొని మారుకుమారు తిట్లు దిట్టగనేలే

వాకున మంచి మాఁటాడి వలపించేఁగాక

చ 3: కనుచూపులను తన్ను కాంకలఁబెట్టఁగనేలే

చనుమొన లొత్తి మేలు చల్లేఁగాక

యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనే తానె నన్ను

పెనఁగనేలె రతుల బెరయించేఁగాక




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1177-6 రీతిగౌళ సం: 21-396

పల్లవి: ఆమాఁట నాతో నీవు ఆనతిమ్మా

యీమతకమింతా నీదా యేమోయివోయి

చ 1: పైకొని నిన్ను నేను పచ్చిగాఁ దిట్టితిననీ-

నాకెకుఁ దెలుపవోయి ఆసుద్ది

దాకొన్న మగఁడవంటాఁ దా నీకుఁ బూనుకవచ్చీ

చేకొని నీవే తనతోఁ జెప్పితివా వోయి

చ 2: చేరి నీచేత సేవలు సేయించుకొంటిననీ

నారుకొన నీ వాపెను నమ్మించవోయి

యీరీతిఁ జుట్టమవంటా నిచ్చకములు నెరపీ

ఆరీతిని నీవే యిన్నీ నాడించవోయి

చ 3: పక్కన నీపై నేను పాదాలు వేసితిననీ

పెక్కులాపెతో నానలు పెట్టుకోవోయి

ఇక్కువల శ్రీవేంకటేశ నన్ను నేలితివి

మొక్కీఁ దాను బావ వంటా మొరఁగులా వోయి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1178-1 శంకరాభరణం సం: 21-397

పల్లవి: వినపించవే యీసుద్ది వినే నేను

వనితరో యిన్నాళ్లవలెఁ గాదు నీవు

చ 1: చెలరేఁగి చెలరేఁగి చెలులతో నవ్వేవు

అలనీపతి నీతో మాఁటాడెనటె

తలవీడి మొలవీడి దగ దవ్వులఁబడేవు

వలపులసివములు వడిఁబట్టెనటవే

చ 2: తమకించి తమకించి తడఁబడ నడచేవు

అమరఁగ రతులు నీకబ్బెనటె

చెమటలమేనితో చిందువఁద్దై యుందానవు

కొమరెమదము నీకు గొనకొనెనటవె

చ 3: పదరి పదరి నీవు పాటలెల్లాఁ బాడేవు

యెదుటిశ్రీవేంకటేశుఁ డెనసెనటె

చెదరనికళలతో చిమ్ముల మాఁటలాడేవు

మరదరాజ్యగర్వము మతిఁ బట్టెనటవె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1178-2 అందోళి సం: 21-398

పల్లవి: రాఁగదవే అన్నిటాను రవ్వయితిమి

కాఁగినకాఁకలచేతఁ గరివడె నిపుడు

చ 1: సాదించేవు నీ కాతఁడు చాయలకు వచ్చీనా

వాదించేవు నీ కాతఁడు వలచీనా

ఆదిగొని చెలులెల్ల నట్టె పైపైఁ బడఁగాను

గాదిలియాతనిమది కాయగాచె నిపుడు

చ 2: చెనకే వాతఁడు నీచెప్పినట్టు సేసీనా

పెనఁగే వాతఁ డందుకు ప్రియపడీనా

వనితలందరు వచ్చి వద్దనే వుండఁగాను

చనుమానముల మొగచాటాయ నిపుడు

చ 3: యేకతానకు దీసేవు యింతలోనే లోనయ్యీనా

పైకొని కూడితి వట్టె బాఁతిపడి

శ్రీకాంత వురమెక్కిన శ్రీవేంకటేశుఁ డితఁడు

మైకొని వురమెల్లాను మట్టుపడె నిపుడు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1178-3 గౌళ సం: 21-399

పల్లవి: సరివారమా నీతో సరసములాడఁగా

నెరవాదివై మమ్ము నీవేల రేఁచేవు

చ 1: నగితేనే కాదా నాఁటుక వెంగేలయ్యేది

తగులనాడితేఁ గాదా తప్పు లయ్యేది

వెగటు లింతేసికి వెఱతుమయ్య నేము

వొగి నీమేమనినాను వోరుచుకుండేము

చ 2: ముందర నుండితేఁగాదా మొగచాట్లయ్యేది

కందువ లంటితేఁగాదా ఘాతలయ్యేది

విందువెట్టి పగలకు వెరతుమయ్య నేము

ఇందరివలెనే నీకు నిచ్చక మాడేము

చ 3: సన్నలు సేసితేఁగాదా చలములు పుట్టేది

కన్నులఁ జూచితేకాదా కాఁక వుట్టేది

యెన్నికతో శ్రీవేంకటేశ నీకు వెఱతుము

మన్నించి కూడితివి నీమఱఁగుఁ జొచ్చేము



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1178-4 సామంతం సం: 21-400

పల్లవి: రమణుఁడు వీఁడివో రాతిరి యీడ నున్నాఁడు

సముకాన నుండవే చలమువాసీని

చ 1: మంతనమాడవే చాలు మనసు నీకుఁ గరఁగీ

చెంతల నేమెల్లా బుద్ధిచెప్పనేల

పంతములాడవే చాలు పతితోడ నదే మించి

యింతి నీకు మచ్చుమందయ్యీ నదే నేఁడు

చ 2: కొచ్చి చూడవే చాలు కోపము తానె పోయీని

వచ్చి వచ్చి నేము నిన్ను వద్దననేల

పచ్చిగాఁ దిట్టవే చాలు పైకొని యదే నీకు

తచ్చి వలపులవల్లెతాళ్లయ్యీ నిపుడు

చ 3: విడెమియ్య వే చాలు వేడుక తానే పుట్టీని

కూడుమని నేము నిన్నుఁ గొసరనేల

యీడుగా శ్రీవేంకటేశుఁ డెనసె నీకు నిదె

వాడికరతులకును వాఁటమయ్యీ నికను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1178-5 బౌళి సం: 21-401

పల్లవి: నీయంత నీవెఱఁగవు నేనది విన్నవించితి

చేయి మీఁదాయెను నాచెక్కులు నొక్కకుమీ

చ 1: పిలువకు సారెసారె పేరుకొని నన్ను నీవు

వలపు పేరడిఁబడీ వద్దు నవ్వకు

బలిమిసేసి నీవు వట్టకు నాకుచములు

కొలఁదిఁబడదు కొనగో రంటించకుమీ

చ 2: తప్పక చూడకు నీవు తమకపుచూపుల

కుప్పలువడీ సిగ్గులు కొంగువట్టకు

కొప్పు జారీ నీవు నన్ను కూరుములు గొసరక

దప్పిదేరీ మోవి నిదే దంట మాటాడకుమీ

చ 3: వొడివట్ట కంత నీవు వూరకే దగ్గరి వచ్చి

తడఁబడీ మానములు తతిగొనకు

అడరి శ్రీవేంకటేశ యలమేల్మంగను నేను

యెడయక కూడితి ఇట్టె మరవకుమీ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1178-6 దేసాళం సం: 21-402

పల్లవి: మానవే యెక్కడిసుద్ది మంకుఁదనాలు

తానే యాతఁడు నిన్నుఁ దగులఁగాను

చ 1: చలపాదితనమేల సారెకుఁ బిలువఁగాను

పలుకరాదా నీపతితోను

తలపోఁత లింత యాల తమకించియాతడు

వెలయ నీపైఁ జేయివేయఁగాను

చ 2: పంతములింతేఁశేలే బలిమిఁ బెనఁగఁగాను

మంతనములాడరాదా మగనితోను

రంతుతోడ వాదులేలే రతినాతఁ డలముక

వింతలుగా నిన్ను నిట్టె వేఁడుకోఁగాను

చ 3: నివ్వెరగు లిఁకనేలే నిన్నుఁ బెండ్లాడఁగాను

నవ్వరాదా శ్రీవేంకటనాథునితోను

రవ్వగా నమ్మికలిచ్చి రమణుఁడు వేడుకతో

నివ్వటిల్లఁ బొగడుతా నిన్ను మెచ్చఁగాను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1179-1 నారాయణి సం: 21-403

పల్లవి: తుడుచుకొంటేఁ బోదు తొడరి నీవెంత్తైనా

వడియించీ మొక్కులనే వలపు నీమీఁద

చ 1: నిక్కిచూచి చెలి నీపై నిండా నవ్వులు నవ్వి

చిక్కనివెన్నెలతేట చిందీనదె

చెక్కులను కొనగోళ్లఁ జెనకి కాంతుల మించి

లక్కరసములు చల్లీ లావుగా నీమీఁద

చ 2: వొరసి వొరసి నీతో వూరఁగలమాట లాడి

సిరులగమ్మఁదేనెలు చిందీనదె

సరిగా సేవలు సేసి చన్నుల మెఱుఁగులను

సరుగ బంగారుపొడి చల్లీ నీమీఁద

చ 3: బలిమిఁ గాఁగిటఁ బట్టి భావములనే కరఁగి

చెలఁగి వయోమదము చిందీనదె

యెలమి శ్రీవేంకటేశ ఇంతి నిన్నిటాఁ గూడి

చలములఁ గూరిములు చల్లీ నీమీఁద



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1179-2 దేశాక్షి సం: 21-404

పల్లవి: అంగడిఁ బెట్టేవయసు అడియాల మానునే

బెంగతనాన నుండినాఁ బెడరేంచుఁగాక

చ 1: వాసికి నెంతలిగినా వలపేల తక్కువౌను

ఆసలతోఁ జిగిరించి అలరుఁగాక

యీసున నెంతదిట్టినా ఇంపులేల కొంచమౌను

వేసరనిపులకలై విట్టవీఁగుఁగాక

చ 2: ఆకడిమోమెఁత్తైనా ఆయమేల వూరకుండు

దీకొని తమకమై తిమురుఁగాక

చేకొని మాటాడకుంటే చిత్తమేల మరపించు

కాకుసేసి లోలోనె కరఁగించుఁగాక

చ 3: చేయి చాఁచకుంటేను సెలవి నవ్వేల వుండు

తోయరానిసరసమై తొడరుఁగాక

యీయెడ శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె

వేయిటికి నీరతులు వింతసేసుఁగాక



శృ.రేకు: 1179-3 లలిత సం: 21-405

పల్లవి: ఈపాటి మానేరుపు యెట్టువలసినాఁ జేయి

చోపినపాటి నే నొనగూడేఁగాక

చ 1: బిరుదుమగనితోడఁ బెనఁగఁగఁగలనా

గరిమ నే నొడ్డుకొనఁగలఁగాక

దొరవు చేతులఁబట్టి దొబ్బఁగలనా నేను

కెరలి కొనగోర దాఁకించఁగలఁగాక

చ 2: చలపాదివానితోడ సరసమాడఁగలనా

కలసి మెలసి మొక్కఁగలఁగాక

పెలుచుఁదనపునీతో బిగియఁగలనా నేను

వొలిసినట్టు చన్నుల నొత్తఁగలఁగాక

చ 3: శ్రీవేంకటేశ్వర నిన్నుఁ జేరి మీరఁగలనా

కావలించి సేవసేయఁగలఁగాక

యీవేళ నలమేలు మంగ నేను నన్నుఁ గూడితివి

చేవమీరఁగలనా చెందఁగలఁగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1179-4 శుద్ధవసంతం సం: 21-406

పల్లవి: ఎంతైనా నెక్కినవాని కేనుఁగు గుజ్జేకాదా

పంతమున మొగవానిఁ బచ్చిసేతురటవే

చ 1: మనసుమర్మమెఱిఁగి మాటలాడవలెఁగాక

చనవుగద్దంటాఁ బతి జంకింతురటే

చెనకితే ప్రియములుచెప్పి లాలింతురు గాక

కినిసి మారుకుమారు గేలిసేతురటవే

చ 2: వేళచూచుకొని నీవే వేఁడుకొనవలెఁగాక

మేలుగద్దంటా నట్టె మీరుదురటే

చేలకొంగు వట్టితేను సిగ్గువడుదురుగాక

పేలరివు యింతేసి పెనఁగుదురటవే

చ 3: కావించి నీవే యిచ్చకము లాడుదురు గాక

శ్రీవేంకటేశ్వరు నింతసేతురటే

యీవిభుఁడె నిన్నుఁ గూడె నిందుకు మొక్కుటకు గాక

భావించి యలమేల్మంగ పదరుదురటవె





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1179-5 గౌళ సం: 21-407

పల్లవి: అనరే యీమాఁటే మీరు ఆతనితోను

నసుపు చూపితే నవ్వు నాలిఁబడదా

చ 1: తననగరిలో నుంటే తనకే సెలవుగాదా

చెనకి పైకొని గాసిసేయవలెనా

మనసుగలిగితేనే మన్నించీఁగాక తానె

పెనఁగఁబోతే వలపు పిప్పి గట్టదా

చ 2: కొలువవారిలో నుంటే కోరి తన సొమ్ముఁగానా

మొలకచన్నులు సారె మోపవలెనా

వలసినప్పుడు తానే వచ్చీఁగాక యిట్టె

చలపట్టితే రతులు చప్పగాదా

చ 3: అండ బానుపుపై నుంటే ఆలఁ దనకేకాదా

బండుగాఁ గాఁగిట మెదుపఁగవలెనా

నిండు కలమేలుమంగ నేను శ్రీవేంకటేశుఁడు

దండిగాఁ దా నన్నుఁ గూడె తప్పే వొప్పుగాదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1179-6 శోకవరాళి సం: 21-408

పల్లవి: నీచిత్తమునఁ బెట్టి నీవే దయదలఁచేవు

యేచి నీతో సారె సారె యెదురాడేనా

చ 1: నిన్నుఁ గొసరేమాఁట నన్నే కొసరుకొనే

యెన్నఁగ నిన్నుఁ గాదననేఁటికి నాకు

వున్నతిఁ బ్రోడవు నీవు కన్నెపడుచను నేను

సన్నలచాయల నీతో సరిదూఁగేనా

చ 2: నీతోఁ బెనఁగేమారు నేనే నాతోఁ బెనఁగేను

యేతువ గాసిసేయనేఁటికి నిన్ను

యీతల నీ వేలికవు యేలినదాన నేను

కాతరించి నీకంటె ఘనమయ్యేనా

చ 3: నీకు విన్నవించేమారు నేనే బుద్దినేర్చేను

యీకత లిన్నియుఁ జెప్పనేఁటికి నీతో

అకడశ్రీవేంకటేశ యలమేల్ మంగను నేను

పైకొని కూడితి నింకాఁ బంతమాడేనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1180-1 ఆహిరి సం: 21-409

పల్లవి: గుట్టుతో నుండనీవయ్య గుణవంతుఁడవు నీవు

పట్టి పెనఁగఁబోతే పండు గాయయ్యీనా

చ 1: మలసి సారెకు నిన్ను మనసు సోదించనేల

యెలమి నందులోఁ దప్పులెంచనేల

బలిమి నుక్కు కాచితే పై పై రాపాడేకాక

కలిగీనా అందులోనే కనకపురజము

చ 2: పంతమాడి నీతోడ బలిమిఁ బెనఁగనేల

హోంతకారివైననిన్ను నోడించనేల

యెంతమాను రాచినాను ఎదుటఁ జూపరేకాక

బంతినే గందమువలెఁ బరిమళించీనా

చ 3: శ్రీవేంకటేశ నిన్నుఁ జేరి కోపగించనేల

మూవంకల నంతలోనె మొక్కనేల

యీవేళ నన్నుఁ గూడితి వే నలమేల్మంగనని

నీవు నీవేకాక మరి నేనయ్యేవా





# అన్నమయ్య



# సంకీర్తనలు



శృ.రేకు: 1180-2 పాడి సం: 21-410

పల్లవి: అప్పటిగురుతులెల్లా నట్టె వున్నవి

దెప్పరమునఁ గొంత సొత్మించనీయరాదా

చ 1: నెట్టనఁ గళలు దేరె నీ మొగము చూచితేను

నట్టుకొట్టి నాకైతే నవ్వువచ్చీని

ముట్టి నిన్నుఁ జూడుమని ముసుఁగేల తీసేవు

జట్టి నీవేఁడి చేఁతలు చల్లారనీరాదా

చ 2: వద్దనుండి నీమేని వాసన మూరుకొంటే

కొద్దిమీరి చూపులఁ గుంకుమ రాలీని

అద్దో నే వంచిన సిరసట్టె యేల యెత్తేవు

బద్దులు యీవేళ మట్టుపడనియ్యరాదా

చ 3: గక్కన నీచెమటమై కాఁగిలించుకొంటేమ

చిక్కి నాతమి నీమీఁదఁ జిమ్మిరేఁగీని

అక్కరై శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను

చెక్కులేల నొక్కేవు చిత్తగించరాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1180-3 బౌళి సం: 21-411

పల్లవి: ఎంతచేసిన నీవిద్య లేల మానేవు

బంతినే నీనవ్వులెల్లాఁ బచరింతువుగాక

చ 1: వెక్కసపుమాఁట లాడి వేమారు నిన్నుఁ దిట్టేటి-

యెక్కువసతులకుఁగా కేల వంగేవు

మొక్కులు మొక్కి నేము ముందే సేవలుసేయఁగ

మిక్కుటపుపంతాలు మామీఁద నింతువుగాక

చ 2: కొప్పువట్టితీసి నిన్ను గోరు నీమీఁదఁ బెట్టేటి-

యెప్పటియింతులకుఁగా కేల వంగేవు

ముప్పిరిఁ బ్రియాలుచెప్పి మొగమోడి పొందఁగాను

ఇప్పు డింతేసి మమ్ము నెలయించఁదగదా

చ 3: పరపుపైఁ బడవేసి పచ్చిమోవి గంటిచేసే-

యెరవులవారికిఁగా కేల వంగేవు

అరిది శ్రీవేంకటేశ ఆలమేల్మంగ నేనంటా

సరవిఁ గూడితి వింత చవిసేయవలదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1180-4 హిందోళం సం: 21-412

పల్లవి: తనకు నా కెంతదవ్వు దగ్గరఁ జేతెఁడు గద్దు

మొనసి నాకాలు దన్ను మోఁచెననీని

చ 1: తగవులఁబెట్టఁబోతే తనవంకదే నేరమి

యెగసక్కె లెవ్వరిఁ దా నేలాడనే

చిగురుఁజేతులఁ దనసేవచేసే దెఱఁగఁడు

అగడుచేసి గోర నంటితిననీని

చ 2: సాకిరులడుఁగఁబోతే జగడము తన్నే మోంచు

చేకొని మరేల నన్ను చిమ్మిరేఁచీనే

వాకుచ్చి తనకుఁ గాను వంకలాడే దెఱఁగఁడు

దీకొని సందుచేసుక తిట్టితిననీని

చ 3: నిజము తెలిసితేను నేనుఁ దాను నొక్కటే

గజరుఁజేఁతలనేల కాఁతాళించీనే

భజనఁ దా శ్రీవేంకటపతి నే నలమేల్ మంగను

త్రిజగ మెఱంగఁ గూడె దిట్ట నేననీని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1180-5 వసంతవరాళి సం: 21-413

పల్లవి: చూచేవారికె యివి సోద్యా లింతేకాక

యేచి నీకయితే యివి యింపులే కావా

చ 1: సారె సారె నాడేటిసవతుల జగడాలు

నారుకొన వింటే నీకు నవ్వులు గావా

చేరిచేరి వొండొరులు చేపట్లకుఁ జొచ్చితే

సైరణతో వినోదించఁ జవులు గావా

చ 2: కొలువులోని ఇంతులు గొణఁగి తిట్లాడితే

అలరి నీకుఁ జెర్లాటా లివియె కావా

వొలసి నీమీఁదఁ బెట్టి వొట్లు వెట్టుకొంటే

చెలరేఁగి నీకు విన సిగ్గులు గావా

చ 3: నీపెండ్లికూఁతు లిద్దరు నిన్ను సాకిరడిగితే

పై పై నీవుచేసినభాగ్యముగాదా

యేపున శ్రీవేంకటేశ యే నలమేలుమంగను

రాఁపుగాఁ గూడితి నీరపము గాదా




# అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1180-6 నాదనామక్రియ సం: 21-414

పల్లవి: సెలవినవ్వులతోడ సిగ్గులతోడ

తలఁపించరే పనులు తమితోనున్నారు

చ 1: పంతములాడే రిద్దరు బాగా లియ్యఁగదరే

వంతల కొకరొకరి వంకలాడరే

మంతనమాడేరేమొ మరి తెరవేయరే

కాంతయుఁ బురుషుఁడును గద్దెపై నున్నారు

చ 2: సరసమాడే రిద్దరు సంగడి నుండఁగదరే

అరిది మర్మపుమాఁట లందీయరే

కరఁగి మోహించేరేమో కందువలు దెలుపరే

సరికి బేసికిని మంచముపై నున్నారు

చ 3: యెనసిరి శ్రీవేంకటేశుఁ డలమేల్మంగయు

మొనయుచు నుపచారములు సేయరె

చనవులు గొసరేరేమొ సమరతి నుపరతి

పెనచి మొక్కరె పెండ్లిపీఁటపయి నున్నారు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1181-1 శ్రీరాగం సం: 21-415

పల్లవి: అంగనకు విరహమే సింగారమాయ

చెంగట నీవే యిది చిత్తగించవయ్యా

చ 1: కలికి నిన్నుఁ దలఁచి గక్కున లోలోఁ గరఁగి

జలజలఁ జెమరించి జలకమాడె

బలుతమకాన నీకుఁ బక్కన నెదురువచ్చి

నిలువునఁ గొప్పువీడి నీలిచీర గప్పెను

చ 2: సుదతి నిన్నుఁ జూచి సోయగపుసిగ్గులను

పొదలి చెక్కులదాఁకాఁ బూసె గంధము

మదనమంత్రములైనమాటల మర్మము సోఁకి

ముదురుఁబులకలను ముత్యాలు గట్టెను

చ 3: గక్కన గాఁగిట నిన్నుఁ గలసి యీమానిని

చొక్కి చంద్రాభరణపుసొమ్ములు వెట్టె

అక్కున శ్రీవేంకటేశ అలమేలుమంగ నీకు

దక్కి సరసములను తలఁబాలు వోసెను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1181-2 ఆహిరి సం: 21-416

పల్లవి: ఏమి సేతునయ్య ఇఁక నిదివో మాబ్రదుకు

చేముట్టినసరసాలు సిగ్గులకే మూలము

చ 1: తప్పులెంచఁబోతేను తగిలీ నీనుతులె

రెప్పలెత్తి చూడఁబోతే రేఁగీ వలపు

అప్పటిఁ బెనఁగఁబోతే ఆయములు గరఁగీని

యెప్పుడు నీతోడివాదు లింపులకే మూలము

చ 2: చేతుల దొబ్బఁగఁబోతే చిమ్మిరేఁగీఁ బులకలు

గాతలఁ జంకించఁబోతే కమ్మీ నవ్వులు

యేతులు నెరపఁబోతే నెలయింపులై తోఁచీ

నీతోడిమచ్చరాలు నెయ్యానకే మూలము

చ 3: కొప్పువట్టి తియ్యఁబోతే కూడీఁ బరవశము

ముప్పిరి నలుగఁబోతే ముంచీనాసలు

యిప్పుడే శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను

దెప్పరపునీతో రతి తేఁకువకే మూలము





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1181-3 పాడి సం: 21-417

పల్లవి: పొద్దు వొద్దు కిట్లానే భోగించరయ్యా

ఇద్దరికిఁ గలిగె నేఁ డిదివో సోబనము

చ 1: పెంచెపుమీతొడలే పెండ్లిపీఁటలు మీకు

ముంచినసిగ్గులే కడుముత్తేల సేస

పంచలచిమ్ముఁజూపులు పసవులు నలఁచుట

అంచెల మీయిద్దరికి నమరె సోబనము

చ 2: పొత్తులమోవితేనెలే బువ్వపుఁబాలకూళ్లు

బత్తి తోడినవ్వులే కప్రపుబాగాలు

హత్తినచెనకులే అలరినవుంకువలు

యెత్తలఁ జూచిన మీకు నెనసె సోబనము

చ 3: కందువకాఁగిటిరతి గందాక్షతలు మీకు

విందులసరసములు వీడుదోడులు

యిందునె శ్రీవేంకటేశ యింతి నీవు గూడితివి

సందడితో మెరసె నిచ్చలు మీసోబనము





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1181-4 కాంబోది సం: 21-418

పల్లవి: మంచితనము సేయఁగ మంకుఁదనా లేఁటికే

అంచెల విభునితోడ నంతచలమేఁటికే

చ 1: గక్కన నాతఁడు నిన్నుఁ గప్పురాన వేసితేను

ఇక్కువలు దాఁకెనంటా యేల తిట్టేవే

చెక్కులనొక్కేనని చేరి వేఁడుకొనరాఁగా

పెక్కుగోళ్లు దాఁకీనంటా పెనఁగనేమిటికే

చ 2: ఘనుఁడు వల్లెగా నీపై కలువదండ వేసితే

చనుఁగవ దాఁకెనంటా సాదించేవేమే

యనసి యందుకె యాతఁడిట్టె కాఁగిలించుకొంటే

తనువంటెఁ జెమటంటా తప్పువేయనేఁటికే

చ 3: శ్రీవేంకటేశుఁడు నిన్ను చెందామరలవేసితే

యీవేళనేల జంకించే విందరిలోన

చేవదేర నీతఁడే చేకొని రతిఁ గలిసె

భావిం చలఇంచెనంటా పంతమాడనేఁటికే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1181-5 దేసాళం సం: 21-419

పల్లవి: దిక్కుల నీకతలెల్లాఁ దెలిసెఁగాక

వెక్కసాన నిన్ను నావెంటవెంటఁ దిప్పనా

చ 1: యితరులు పిలిచితే నెఁత్తైనాఁ బలుకవు

సతిమాటకై తేను జవదాఁటవు

ప్రతినలాడుకోఁగా నీపలుకుల భ్రమయించి

వెతదీర నిన్ను నావెంటవెంటఁ దిప్పనా

చ 2: సరస మెవ్వరాడినా సరకుఁ గొనవుగాని

తరుణి నవ్వినంతేనే తమకించేవు

సరవులు దప్పఁగాని చలపట్టి నే నిన్ను

విరివిగా వలపించి వెంటవెంటఁ దిప్పనా

చ 3: కొలువులో నెవ్వరున్నాఁ గూరిమిసేయవుగాని

కలికిఁ బొడగంటేనే కరఁగేవు

మెలఁగి శ్రీవేంకటేశ మీరఁగాని నిన్నుఁ గూడి

వెలయ సిగ్గులుమాన్పి వెంటవెంటఁ దిప్పనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1181-6 వరాళి సం: 21-420

పల్లవి: మీవంటిదాన నటె మీరఁగ నేను

పూవుబరిమళమై పొదిగేఁగాక

చ 1: చలము సాదించేనటే సలిగెగలదానను

బలువుకొద్ది పంతానఁ బతికేఁగాక

అలిగేనటే పతి కంతరంగమైనదాన

పలుకురసమునఁ బైకొనేఁగాక

చ 2: తప్పు లెంచేనటవే తగినచుట్టపుదాన

ఎప్పుడూ మేలుదాననై యెనసేఁగాక

వుప్పటించేనటే నేను వూడిగముసేసేదాన

దప్పిదేర మోవితేనెఁ దనిపేఁగాక

చ 3: వొరసేనటవే నేను వురమెక్కినట్టిదాన

గరిమఁ గాఁగిట నించి కైకొనేఁగాక

యిరవై శ్రీవేంకటేశుఁ డిదివో నన్ను మన్నించె

సరిలేనివేడుకల సతమయ్యేఁగాక



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1182-1 గుండక్రియ సం: 21-421

పల్లవి: ఓజతో నుండినవారి కొకటొకటె రేఁచేవు

రాజవైతేనే మమ్ము రవ్వసేయవలెనా

చ 1: అప్పటికప్పటికి నీ వనుచరించేవుగాక

యెప్పుడును ఇంటికి నీ విట్టే వచ్చేవా

వొప్పగువేవేలుసతు లొద్దనే వుండఁగాను

చప్పనైకాక సతులు సరకయ్యేరా

చ 2: బాసదప్పీనంటా నాతోఁ బైకొని నవ్వేవుగాక

ఆసల నేపొద్దూ నిట్టె ఆదరించేవా

రాసికెక్క ఇరుమేలా రామలు కొల్వుసేయఁగా

వేసటేకాక రతులు వెలవెట్టీనా

చ 3: దయదలఁచేమో నన్ను తతిఁ గూడితివిగాక

ప్రియము లిట్టే నీకు పెనగొనీనా

నియతి శ్రీవేంకటేశ నేనే నీయండ నుండఁగా

జయమేగాక మేలు చండివడీనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1182-2 గుజ్జరి సం: 21-422

పల్లవి: నెలంత యెంతటిజాణో నీవెంత చతురుండవో

పిలిచితేఁ జెలియకు ప్రియముచెప్పితివి

చ 1: మగువ యలిగి నీతో మారుమోము వెట్టుకొని

మొగిచి యప్పటి నీతో మోము చూచెను

నగుతా నప్పటి నీవు నలినాక్షిఁ గాఁగిలించి

పగటున నాదరించి పంతములిచ్చితివి

చ 2: మానిని నీతోఁ గొంత మౌనము జరపి యట్టె

మానములు సోఁకించి మాటలాడెను

కానిమ్మని నీ వందుకు గతిగూడ నింపు చల్లి

మేనవావి పచరించి మేలెల్లాఁ జూపితివి

చ 3: కోమలి ముసుఁగువెట్టుకొని పవళించి నిన్ను

గామిడి శ్రీవేంకటేశ కాఁగిలిచెను

దోమటి దొడికి నీవు తొలుతటికంటెను

సేమమునుఁ బాలించి సిరుల మించితివి





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1182-3 పాడి సం: 21-423

పల్లవి: ఇంటికివచ్చిన వాఁడ వీడేర్చుకోవయ్య

జంటగూనవాఁడవు చనవియ్యవయ్యా

చ 1: తరుణి వలచినదే తప్పయితేఁగనక

వురవుగా నీవది వోర్చుకోవయ్యా

మరలి నిన్నుఁ జూచుటే మచ్చరమైతేఁగనక

నిరతితో నందుకొను నీకు మొక్కేనయ్యా

చ 2: వెలఁది మాటాడినదే వెంగెములై తేఁగనక

మలసి యీనేరమి మన్నించవయ్యా

అలమిపట్టినదే అపరాధమైతేఁ గన

బలిమిచెల్లఁగ నీకుఁ బంతమిచ్చీనయ్యా

చ 3: ఇంతి పాదాలొత్తి నదే యెగ్గులైతేఁ గనక

చెంతనే నేరు పాపెకుఁ జెప్పవయ్యా

కాంతను శ్రీవేంకటేశ కలిసితి వింతలోనె

వింతవింతరతులను వియ్యమందవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1182-4 వరాళి సం: 21-424

పల్లవి: నీవేళ భ్రమసేవు నే నుందాన నిడివో

సేవసేసేఁగాని యిట్టె సేయించుకోరాదా

చ 1: కప్పురవిడె మింద కస్తూరివుండ లివిగో

దప్పిదేర్చుకో కొంత దగదొట్టకు

కొప్పు చక్కఁబెట్టుకో గోణము చక్కఁగట్టుకో

అప్పటి మేను గిజిగిజియై వుందురా

చ 2: చల్లనిగందవో డిదే సొరపుఁబన్నీ రిదే

చల్లుకోరాదా మేని సరతువాసు

వల్లెవాటు వేసుకో వద్దవచ్చి కూచుండు

బల్లిదుఁడవై వుండి పాఁచి సింగారాలేల

చ 3: చాయపట్టుపర పదె సకినలమంచ మిదె

యీాయెడనే పవళించు ఇఁక లోఁగకు

పాయపుశ్రీవేంకటేశ పచ్చిగాఁ గూడితి

దాయదండై వుండు మేల తడఁబడ నిపుడు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1182-5 బౌళి సం: 21-425

పల్లవి: ఆనతిమ్మా వినేఁగాని అది గొంత

యీనెలఁత నీపైబత్తి యిటువంటిదా

చ 1: వద్దనే నుండఁగానె వనిత సన్నలు సేసీ

కద్దా తొల్లిఁ బొందు కాంతకు నీకు

ముద్దుముద్దువలెనే మోము చూచి నవ్వీని

యిద్దరికి లోలోనే యింతవలపా

చ 2: కమ్మటినిఁ గానకుండా కానికలంపీ నీకు

సమ్మతా నీ కాపెసేసేసరితలెల్లా

పమ్మి నీవు విందువంటా పాటపాడీ నాడనుండే

వుమ్మడి మీతమకపుటొద్దిక లింతేశా

చ 3: నీవూ నేనూఁ జూడఁగానే నిలుచున్న దీడ వచ్చి

కావర మింతేసి మీకుఁ గప్పివున్నదా

శ్రీవేంకటేశ యిద్దరిఁ జేతులు వట్టి కూడితి-

వీవేళనే నీయాపెయెన్నికలుఁ గూడెనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1182-6 భైరవి సం: 21-426

పల్లవి: ఎక్కడ పరాకు నీకు నింతకంటె నేమున్నది

చిక్కనాయఁ గోరికలు చిత్తగించవయ్యా

చ 1: సెలవినవ్వు చిందఁగాఁ జెక్కునఁ జేయివెట్టె

పులకపైరు పయ్యదఁ బొదిగ నిదె

కొలఁదిమీరె వయసు కొప్పు గట్టిగా ముడిచె

చెలియసింగారము చిత్తగించవయ్యా

చ 2: చిమ్ముఁజూపులు మీఱఁగా చెంపల గందాలు వూసె

ముమ్మరమై మేలు పోఁకముడి వేసెను

చెమ్మగిలె మోవితేనెఁ దమ్మరసములు నించె

చిమ్మిరేఁగె సొబగులు చిత్తగించవయ్యా

చ 3: చనుమొనల కడ్డము సరినిన్నుఁ గాఁగిలించె

ఘనమైనరతులను కళరేఁగెను

యెనసితివి శ్రీవేంకటేశ యీయింతిని నీవు

చెనకులమురిపెము చిత్తగించవయ్యా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1183-1 కేదారగౌళ సం: 21-427**

**పల్లవి: ఏమి బాఁతి నేఁ దనకు యెందాఁకనే**

**యీమాట నిజమయ్యే దెందాఁకనే**

**చ 1: పన్ని యలిగితినంటా పలుమారు దూరిదూరి**

**యెన్నిమాట లాడీని యెందాఁకనే**

**వెన్నెలనవ్వులు నవ్వి వేఁడుకొని చెక్కునొక్కి**

**యెన్ని నేఁ జెప్పిన మానఁ డెందాఁకనే**

**చ 2: గక్కునఁ దా లేచివచ్చి కప్పురవిడెమిచ్చీ**

**యెక్కడిసుద్దు లింకా నెందాఁకనే**

**పక్కన నానలు వెట్టి పచ్చడము గప్పి లోలో**

**ఇక్కువ లిదివో యంటె యెందాఁకనే**

**చ 3: పచ్చి మాఁటలెల్లా నాడి బలిమిఁగాఁగిటఁ బట్టి**

**యిచ్చీఁ బంతములు తానెందాఁకనే**

**ఇచ్చట శ్రీవేంకటేశుఁ డింతటఁ దా నన్నుఁ గూడె**

**హెచ్చి సరసములాడె దెందాఁకనే**




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1183-2 ముఖారి సం: 21-428

పల్లవి: చక్కజాడనుండవే చలమేమౌనో

నిక్కకువే సారెసారె నిలువేమౌనో

చ 1: సెలవి నవ్వఁగఁబోతేఁ జెక్కులెల్లాఁ బులకించె

పలుకకువే ఇఁకఁ బంతమేమౌనో

తలవంచఁబోతేను తనువెల్లాఁ బులకించె

నెలసి చూడకువే సిగ్గులేమౌనో

చ 2: చేసన్న సేయఁబోతే చిత్త మెల్లా నీరాయ

పాసి యడుగిడుకువే పాయమేమౌనో

వాసికిఁ జంకించఁబోతే వాడఁబారె మొగమెల్లా

ఆసలఁ జింతించకువే అప్పటి నేమౌనో

చ 3: కాఁగిటఁ గూడఁగఁబోతే కందువ మరపులాయ

మూఁగి బుసకొట్టకువే మోనమేమౌనో

పాఁగినశ్రీవేంకటాద్రిపతినై ననను నీవు

వీఁగక రతిసేసితి వెనక నేమౌనో



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1183-3 దేసాళం సం: 21-429

పల్లవి: నేనేమి సేసినాను నీచిత్తము

భావము వేరొకటై పదరి నేఁ జాలను

చ 1: కొంగువట్టితే నిన్నుఁ గోపగించఁజాలను

అంగజగురుఁడవు నీ వటుగాన

అంగడి నవ్వి నిన్ను నదలించఁజాలను

వెంగలిపదారువేలవిభుఁడవుగాన

చ 2: పూవుల వేసి నిన్నుఁ బొరిఁ దిట్టజాలను నీ-

వవ్వలఁ బారిజాతహరుఁడవుగాన

రవ్వల గోరంటఁగాను రాయడించఁజాలను

చివ్వలగోళ్ల నరసింహుఁడవుగాన

చ 3: చనుఁగొండ లొత్తఁగాను చాలుననఁజాలను

యెనసి గోవర్ధనగి రెత్తితివిగాన

మునుపె శ్రీవేంకటేశ మొక్కి నన్నుఁ గూడితివి

తనిసినా నిన్నుఁ బాసి తలమనఁజాలను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1183-4 ఆహిరి సం: 21-430

పల్లవి: మోహమెంతో కోపమెంతో ముదిత నీయెడ నేఁడు

వూహల యీభావములు వొక్కదోమటాయ

చ 1: సెలవినే నవ్వేఁగాని చేకొని మాటాడదాయ

చెలువుఁడ నీవు విచ్చేసితివంటే

వలచేత మొక్కేఁగాని వడి సుద్దిచెప్పదాయ

పొలసి నీకడకు నేఁ బోయేనంటేను

చ 2: కన్నులనె చూచెఁగాని కమ్మర డగ్గరదాయ

సొన్నల నీగురుతులు చూపినాను

సన్నలనే మెచ్చెఁగాని సరి దండె మీఁటదాయ

పన్ని నీ వల్లంతనుండి పాడఁగాను

చ 3: పరవశ మందెఁగాని పైకొని బిగించదాయ

గరిమఁ గాఁగిట నీవు గలయఁగాను

సిరుల సంతసమందె శ్రీవేంకటేశ నేఁడు

శిరసువంచి కొంత సిగ్గువడదాయ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1183-5 సామంతం సం: 21-431

పల్లవి: ఇంతి చూచి యేమనెనో యెంత భ్రమసితినంటా

కంతునిమాక లవుత గానసైతినే

చ 1: వెన్నెల గాయఁగఁ జూచి వెలఁది నవ్వెనోయంటా

పన్ని నే మారుకుమారు పతి నవ్వితినే

కన్నెచకోరాలఁ జూచి కన్నులఁ జూచెనోయంటా

మన్ననచూపుల నేను మారు చూచితినే

చ 2: కోవిల గూయఁగ విని కొమ్మ మాటాడెనోయంటా

వోవల మారుకుమారు వూఁకొంటినే

పూవులు మాఁకుల రాలఁ బొలఁతిసేసలోయంటా

యీవలఁ గమ్మర నవే ఇటు చల్లితినే

చ 3: చల్లగాని విసరఁగా సతినిట్టూర్పులోయంటా

వుల్లపుసంతసమున నొనరితినే

మెల్లనె శ్రీవేంకటాద్రిమీఁదనె నే నుండఁగాను

వొల్లనె చెలియ వచ్చి వూరడించి కూడెనే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1183-6 పాడి సం: 21-432

పల్లవి: ఏమో సేయఁగఁబోగా నేమో సుమ్మీ

మోమెదిరి, నందుపై మొక్కులే సుమ్మీ

చ 1: చిగురుఁగెమ్మోవి వంచేవు చేరి నన్నుఁగని

వొగరుటధరామృతం బొలికీఁ జుమ్మీ

సగము మాఁటాడి గుక్కి జడిసేవు యింతలో

పగటు నీపుక్కిటను పట్ట దది సుమ్మీ

చ 2: గొబ్బునను గమనించి కొంకేవు నన్నుఁ గని

వుబ్బెల్లఁ జెమటలై వుదిరీఁజుమ్మీ

మబ్బు విడువఁగ నవ్వి మానితివి అంతలోనె

గుబ్బతిల్లి యానవ్వు గుండెవట్టుఁజుమ్మీ

చ 3: యింపు చేకొనుచు బిగియించేవు కాఁగిటను

ముంపుఁగుచములవాఁడి మొద్దౌఁజుమ్మీ

తెంపున శ్రీవేంకటాద్రిదేవుఁడగనకు నన్ను

సంపదలఁ గూడితివి సరికిసరిసుమ్మీ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1184-1 కాంబోది సం: 21-433

పల్లవి: వద్దువద్దు తడవితే వాదులేసుమ్మీ . నీవు

పొద్దువొద్దు వారివీరిపోడులే సుమ్మీ

చ 1: పూచిననా మేనను పులకలకంత లివి

చేచేత నీమాటలచు చిల్లులేసుమ్మీ

చాఁచిననాచన్నులు నీజవ్వనపుయడిచే-

గాచినవురము మీఁది కాయలే సుమ్మీ

చ 2: వేఁకపునాకళ లివి వెలెకురికినయట్టి-

కాఁకల నీవిరహాగ్ని కాంతులేసుమ్మీ

చేకొను నాతురుమిది చిత్తములోపలనున్న-

చీకాకులచింతలచీఁకటి సుమ్మీ

చ 3: వన్నెలనామోవి యిట్టె వడిసేటితేనెలు

వున్నతి నీకు నోరూరేవూటలేసుమ్మీ

యెన్నఁగ శ్రీవేంకటేశ ఇంతలో నన్నుఁ గూడితి-

విన్నిటా నీవూ నేనూ నేకమేసుమ్మీ



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1184-2 సాళంగం సం: 21-434

పల్లవి: ఇట్టె వచ్చేఁగాని యీవనకేలికిఁ బోయి

నెట్టన నాడనుండేది నిమిషమేసుమ్మీ

చ 1: మఱవకుమీ నాపై మన్ననా నే-

నెఱఁగ కేమనినా నిముడుకోమ్మీ

గుఱిగా నాయుంగరమే కోరి యెప్పుడుఁ బెట్టుమీ

మఱి నాచెలులను నామారుగాఁ జూడుమీ

చ 2: తలఁచుమీ నామీఁది తగులాయమూ నా-

మెలుపుఁబాయము నీకే మీఁదుసుమ్మీ

సళుపునీపేరు నాకు జపముసుమ్మీ యీ-

యలరులఁబంతి నాయాత్మగాఁ జూడుమీ

చ 3: చవి నీతమ్ములమే నాచద్దిసుమ్మీ నేఁ-

బవళించేపానుపే నీపదవిసుమ్మీ

ఇవల శ్రీవేంకటేశ ఇంతలోనే కూడితివి

వివరించ దినమొకవింత ఇదెసుమ్మీ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1184-3 మంగళకౌసిక సం: 21-435

పల్లవి: సరికి బేశాయ నిది చాలదా నేఁడు

యిరవాయఁ బనులెల్ల నిఁకనేల మాటలు

చ 1: బయలువంటిదె నాపట్టి ననెన్నడుము

బయలుపందిలి నీపలుకులెల్లా

నయమైనకుచములు నావి కొండలవంటివి

దయలేని నీమనసు తగురాతివంటిది

చ 2: నిండిననాతురుమున నెరులెల్లా వంకలే

చండియై నీమేనెల్లా చంద్రవంకలే

పండిననామోవి ఇదె పైపైనే కడుఁదీపు

దండినీవినయములు తరితీపులే

చ 3: మెఱుఁగువంటిదివో మించయిననామేను

మెఱుఁగువంటిదెపో నీమేఁటివలపు

నెఱి శ్రీవేంకటేశ్వర నీవే ననుఁ గూడితివి

తఱితోడఁ జవులాయ తగిననీరతులు



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1184-4 వరాళి సం: 21-436

పల్లవి: చొల్లెపుఁజుట్ల వో చొక్కనాథా నీ-

చుల్లరిచేఁతలు గంటిఁ జొక్కనాథా

చ 1: చూడ వేగన్నుల నిన్నుఁ జొక్కనాథా నీకు

జోడు భూమియును లక్ష్మిఁ జొక్కనాథా

సూడిదె నాపాయమిదె చొక్కనాథా నీతో

సూడువట్టీ నారతులు చొక్కనాథా

చ 2: చొక్కపు సింగారాల చొక్కనాథా మోవిఁ

జుక్కలు నించె నెవ్వతో చొక్కనాథా

చొక్కించితి గోపికలఁ జొక్కనాథా నాతో

సుక్కులమాట లేలోయి చొక్కనాథా

చ 3: సొమ్ముతొవిఱ్ణవిగేచొక్కనాథా పోదు-

సుమ్మీ నీకు నాకుఁ జొక్కనాథా

ఇమ్ముల శ్రీవేంకటాద్రి నిటు నీవు గూడఁగాను

జుమ్మన మై పులకించెఁ జొక్కనాథా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1184-5 శంకరాభరణం సం: 21-437

పల్లవి: పచ్చి సేయకుందునా పై పై నిన్ను
అచ్చలపు నీవు దొరవని యింతేకాక

చ 1: నీకన్నుల కావి చూచి నిన్ను మెచ్చకుందునా
దాకొని నీవంటివాని దగ్గరక వుందునా
యీకడ నీమేనితావి ఇందు జొక్కకుందునా
పైకొని నామనసొడబడ దింతేకాక

చ 2: ముందు నీభావము చూచి మొక్కు మొక్కకుందునా
చిందేటి చెమట చూచి చెక్కు నొక్కకుందునా
పొందగుఁగళలు చూచి పొగడక వుందునా
యెందు నాపంతము నన్ను నెడసేసీఁగాక

చ 3: కాఁగిలించుకోఁగా కొంగు గప్పక నే నుందునా
మూఁగినరతులవేళ ముచ్చటాడకుందునా
వీఁగక శ్రీవేంకటేశ విన్నవించకుందునా
మాఁగినమరపు నన్ను మంకుఁ జేసీఁగాక





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1184-6 లలిత సం: 21-438

పల్లవి: ఏమిసేత మేమిసేత మేవంక చూచినాఁ దామె
దోమటి నాకెకు నాకు దొరసీ నేఁ డిపుడె

చ 1: కాసీ నదొకటి కాంతనవ్వువెన్నెలలు
వూసీ నదొకటి పూఁవవలపు
రాసీ నదొకవంక రాఁపుఁగుచములు రెండు
యేసీ మయఁ డీవంక నేమి సేసేదే

చ 2: చిమ్మీ నదొకటి చెలిచూపుల చీఁకటి
కమ్మీ మాటలనె కమ్మఁదేనెలు
తుమ్మీఁ జింకతుమ్ములు తుమ్మిదగుంపుల కొప్పు
అమ్మీ నల్లదె పాయ మాకెకె నన్నును

చ 3: చాఁచీ నదొకటి సతికాఁగిటికిఁ జేయి
పూఁచీ నదొకటి బువ్వపుమోవి
యేఁచీ యిట్టె శ్రీవేంకటేశుఁడ గనక నన్ను
లాచి కూడె నీమగువ లాగాయ నిఁకను



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1185-1 తెలుఁగుఁగాంబోది సం: 21-439

పల్లవి: అతనిఁదోడితెచ్చినందాఁకా

హితబుద్ధుల చెలి యేమరకుమీ

చ 1: వెలఁది విరహముల వేసవికాల మిది

యెలమి మోవిచిగు రెండనీకుమీ

కలికి నిట్టూర్పులగాలికాల మదె

తెలివలపుపదను తియ్యనీకుమీ

చ 2: వనిత పెంజెమట వానకాలమదె

మొనపులకననలు ముంచనీకుమీ

మనవుల సిగ్గుల మంచుఁగాల మదె

ఘనకుంచగిరులనుఁ గప్పనీకుమీ

చ 3: వెసఁ గాంత నవ్వువెన్నెల కాలము

ససిఁ గొప్పుచీఁకటి జారనీకుమీ

పసగా శ్రీవేంకటపతి విచ్చేసి కూడె

వసంతకాల మిదె వదలనీకుమీ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1185-2 సామంతం సం: 21-440

పల్లవి: తానొక్కఁడే గురి తమకమునకును

యే నింక నెవ్వరితో నేమిచెప్పేనే

చ 1: తనువొక్కటే గురి తన్నుఁ బాసెకాఁకలకు

మనసొక్కటే గురి మంతనాలకు

కనుఁగొనలే గురి కడునిట్టచూపులకు

యెనసి యెవ్వరి కింక నేమిచెప్పేనే

చ 2: పాయమొక్కటే గుఱి పచ్చివలపులకెల్లా

చేయి చెక్కిటికి గురి చింతలకును

మోయు నిట్టూర్పులు గురి మనుకొన్న కోరికకు

యేయెడ ముచ్చట లింక నేమిచెప్పేనే

చ 3: కూడినకూటములకు కొనగోరొక్కటే గురి

యీడనాకు శ్రీవేంకటేశునికిని

తోడనే కళలు గుఱి తుదలేనివేడుకకు

యేడ నెవ్వరికి నింక నేమి చెప్పేనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1185-3 మేఁచబౌళి సం: 21-441

పల్లవి: తనిసితి నన్నిటాను తాలిమే మేలిమాయ

యెనసినసంతసము లిఁక నెన్నఁడే

చ 1: ఆసలనే కొంతవొద్దు అంగమంటి కొంతవొద్దు

బాసచేసి కొంతవొద్దు భ్రమయించెను

వాసికి సరసమాడ వయసు వోయీనేమో

యీసుదీర మన్నించే దిఁక నెన్నఁడే

చ 2: మోము చూపి కొంతవొద్దు మొక్కులాడి కొంతవొద్దు

నాముదేద నవ్వి కొంత నాలిసేసెను

ఆమనిఁ గుంటెనమాఁట లాడఁగానే తెల్లవారె

యీమేర నన్నుఁ గూడె దిఁక నెన్నఁడే

చ 3: చేయివేసి కొంతవొద్దు సేసవెట్టి కొంతవొద్దు

యీయెడఁ గాఁగిటఁ గూడె నీపొద్దు

పాయపుశ్రీవేంకటాద్రిపతి కింతా సెలవాయ

యేయెడఁ జొక్కుదుఁగాక యిఁక నెన్నఁడే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1185-4 హిజ్జిజి సం: 21-442

పల్లవి: అది నీకుఁ దారుకాణ అవునోకాదో కాని

కదిసి చెప్పఁగబోతే కతలయ్యీఁ గాని

చ 1: కలలోని నీరూపు కన్నులఁగన్నట్లయ్యీ

చెలఁగి ఆసుద్ది చెప్పఁజింతయ్యీఁగాని

వెలయ నీపలుకులు వీనుల విన్నట్లయ్యీ

సెలవిఁ గమ్మరఁ జెప్పసిగ్గుయ్యీఁగాని

చ 2: మంతనాన నీతో మాట లాడినట్లయ్యీ

అంతటఁ జూచితే వెరగయ్యీఁగాని

కంతునమరతి నిన్నుఁ గాఁగిలించినట్లయ్యీ

పంతాన నేమనినాను పచ్చిదేరీఁగాని

చ 3: సరుస నీమోవితేనె చవిగొన్నఅట్లనయ్యీ

వొరసి చూపఁబోతే గోరొత్తీఁగాని

ఇరవయినశ్రీవేంకటేశ నీవు ద్రిష్టముగా

సరుగఁ గూడిన నదె చాలాయఁగాని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1185-5 లలిత సం: 21-443

పల్లవి: ఏమాటకేమాట యేమే నీవు వోరి

ఆమాటకామాట లవి యంతే కావా

చ 1: పచ్చిపాలు పోయవుగా పసిగొల్లెతా అవె

పచ్చిపచ్చి అయ్యీఁగాని పదరా నీవు

పచ్చిచిగురే కాదా భామ నీమోవి నీవు

పచ్చిగాఁ దిరుఁగఁగాను పసురెక్కకుండునా

చ 2: పెరుగు వెట్టవుగా గుంపెనగొల్లెతా నీవు

పెరిగి యింతై తివి పెక్కులేలర

పెరుగు నీకుచములు పిక్కటిల్లను నీవు

పెరుగఁగ నవి కడుఁబెద్దలు గాకుండునా

చ 3: వెన్నలైనఁ బెట్టవుగా వెడగొల్లెతా నిన్ను

వెన్నకంటె నున్నఁ జేసే వేగమేలరా

వెన్నతోఁ బెట్టినది యీవేషము నీకు

వెన్నలఁ గూడితి శ్రీవేంకటేశ చాలదా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1185-6 సామంతం సం: 21-444

పల్లవి: తొల్లిటి తాఁదానే కాఁడా దొరయాయనా

అల్లనాఁటి తగవు నేఁ డందదాయనా

చ 1: చాయల నే రానంటా సణఁగులాడేవాఁడు

కాయముఁ దానంటఁగా నేఁ గాదంటినా

పాయపుసతులత మింతే బలుమగవాఁడు దాను

పాయక గొల్లెతలను పచ్చి సేయఁడాయనా

చ 2: కన్నులఁ దిట్టితినంటా ఘాతలు సేసేఁవాడు

సన్నచేసి పిలువంగాఁ జరసితినా

కన్నెలము ఇదె నేము ఘనమైనప్రౌఢ దాను

మున్నే ఎరుకచేసితే మొగిఁ జెల్లదాయనా

చ 3: కులికి గోరంటితేను కోపగించేవాఁడు నన్ను

పలుసోఁకించఁగ నేను పదరితినా

యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె

ఆలమి పదారువేల నంగవించఁడాయనా




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1186-1 శంకరాభరణం సం: 21-445

పల్లవి: ఏమయ్య రమణుఁడ యింత సేతురటవయ్యా

కామిని నూరడించి కలయఁగరాదా

చ 1: పడఁతి కధరమిచ్చి పలుసోఁకించినది

బడి బడి విందువెట్ట పగలాయ

వెడవెడఁగా నవ్వి వెంగెమాడినది

తొడికేదోమటి పాలఁదోడనే వేఁడాయ

చ 2: తరుణిఁ దప్పకచూచి తలవంచినది

అరిది నమ్మించి తప్పినట్లాయ

సరస మాడియాడి సరుగన దాఁగినది

పొరిఁబొరి మధ్యాహ్నఁ బొద్దుగుంకినట్లాయ

చ 3: మెలుఁత గాఁగిటఁ గూడి మేను మరచినది

నిలువునీడలలోన నివ్వెరగాయ

అలరి శ్రీవేంకటేశ ఆదరించినది

ఫలియించి పసిఁడిలోఁ బరిమళమాయ




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1186-2 శంకరాభరణం సం: 21-446

పల్లవి: చూచినవారికినెల్లా సోభనమై వుందువు

తాచిన శ్రీవేంకటేశ దైవమై వుందువు

చ 1: నాలుగుచేతులతోడ నలి నీవు నిలుచుంటే

చాలి కొమ్ములకల్పవృక్షమువలె నుందువు

మేలిమపీతాంబరాన మెరసి నీ వుంటేను

వాలిన బంగారురాశివలె నుందువు

చ 2: జమళిపాదములతో సరి నీవు నిలుచుంటే

అమరి యిహపరము లందినట్టె వుందువు

తమినీలవర్ణముతోఁ దగ నీవు నిలుచుంటే

గమిఁ గనకవరుషకాలమేఘ మౌదువు

చ 3: కొండవంటి తురుముతోఁ గోరి నీవు నిలుచుంటే

మెండుశిఖరముతోడి మేడవలె నుందువు

అండనె శ్రీవేంకటాద్రి నలమేలుమంగఁ గూడి

వుండితే మిన్నునేలా నొక్కటైనట్లుందువు





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1186-3 పాడి సం: 21-447**

**పల్లవి: చల మింకానా నీకుఁ జాలదా నేఁడు**

**సలిగెడు పతితోడఁ జాలదా నేఁడు**

**చ 1: వదనము వసివాడె వనిత నీకొప్పు వీడె**

**చదురులబింకము చాలదా నేఁడు**

**గుదిగొనెఁ బులకలు కుమ్మరించెఁ జెమటలు**

**సదమదమైతి వింకఁ జాలదా నేఁడు**

**చ 2: కన్నులఁ గెంపులుదేరెఁ గడునిట్టూర్పులు మీరె**

**సన్నలుఁజాయలు నింకఁ జాలదా నేఁడు**

**వెన్నగా మతి గరిఁగె విభుపైఁ దనువొరగె**

**సన్నపుమోవితిట్లు చాలదా నేఁడు**

**చ 3: సెలవుల నవ్వులు చిందె సిగ్గులు లోలోఁ గుందె**

**చలివేఁడి కొసరులు చాలదా నేఁడు**

**బలిమి శ్రీవేంకటాద్రిపతి నిన్ను నిదె కూడె**

**సళుపులెల్లాఁ బాసెఁ జాలదా నేఁడు**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1186-4 సౌరాష్ట్రం సం: 21-448

పల్లవి: చాలుఁజాలు వాఁడులేని జన్మమేలా

జాలి నన్నుఁబెట్టకురా సారె సారెఁ జెలులు

చ 1: నేఁడు వానిఁబాసిన వెన్నెలబయలేలా

వోడక వాఁడుగాఁగిటనుండనినిద్రేలా

కూడి వాఁడు నేను గప్పుకోనిపయ్యెదేలా

వీడని చెక్కుతోడివెరగే చాలును

చ 2: లీల వానిసరసములేనినవ్వేలా

ఆలించి వాడువినని ఆమాటలేలా

సోలి నిద్దరు నొక్కటై చూడనియద్దమేలా

తాలిమితో లోలోనె తలపోఁతే చాలును

చ 3: యీకడ వాఁడుగూడ నియీజవ్వనమేలా

ఆకు వాఁడు మడచియియ్యనితమ్ములమేలా

వాఁకగా శ్రీవేంకటాద్రి వాఁడు నన్నుఁ గూడె నిదె

మాఁకు పడఁజొక్కినయీమరపిదె చాలును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1186-5 ముఖారి సం: 21-449

పల్లవి: చాలునె చాలునె సట లిఁకనూ ని-

న్నేలినపతికడ కేఁగగరాదా

చ 1: పెంచినఁ బెరుగును పెనునీచలములు

నించిన కొప్పునెరులవలె

వంచిన వాలును వడి నీకోపము

చుంచులనీకనుచూపులవలెను

చ 2: కరఁచినఁ గరఁగును కలికి నీమనసు

పరుగునీకాంతులపసిఁడివలె

మరపిన మరగును మహి నీగుణములు

పెరతేనేలనీపెదవులవలెను

చ 3: కదిసిన గద్దా కాంక్ష నీరతులు

ముదిరిన నీకుచములవలెను

యెదురనె శ్రీవేంకటేశుఁడు గూడెను

పదవులజవ్వనసాయమువలెను




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1186-6 మంగళకౌసిక సం: 21-450

పల్లవి: కంటిమి వింటిమి నాఁడె కమ్మర నేఁడు కొత్తేల

వొంటినుండఁగాఁ జేత నొత్తకురా మమ్మును

చ 1: వొప్పుల నీతీపుమోవినుండి వెడలేమాఁట

దెప్పరపుటొగరౌనా తీపేకాక

ముప్పిరి నీతరితీపు మొగచాటాయ మాకు

అప్పుడే తనిసితిని అంటకురా నన్నును

చ 2: నయగారిగుణమున నడపేనీచేఁతలు

నయములెకాక వేరేనాఁటి వెట్టవునా

నయములఁ బ్రియముల నమ్మికలఁ దనిసితి

చెయిముట్టి నీవంత చెనకకు నన్నును

చ 3: చల్లనికాఁగిట నీవు సరిఁగాఁ గిలించఁగాను

చల్లనయ్యేవుండుఁగాక సారెఁ గాఁకౌనా

యెల్లగా శ్రీవేంకటేశ యిన్నిటా నేఁ దనిసితి

మెల్లనె మారుకుమారు మెచ్చకురా నన్నును





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1187-1 వరాళి సం: 21-451

పల్లవి: ఎన్నఁటికెన్నఁటిపొందు యిస్సీ నేను
ఎన్నుకొను నామనసు యిస్సీ నేను

చ 1: కొంకక నీరాతి గుండె గుణ మెరిఁగుండియు
యింకా నిన్నుఁ గొసరే నిస్సీ నేను
వుంకువ వేరొకతెతో వుండఁగా నిన్నుఁ జూచియు
యింకవు నాకన్నీళ్లు యిస్సీ నేను

చ 2: మంతనాన నాడిననీమాఁట గల్లైవుండఁగాను
యెంతైనా మానఁగలేను యిస్సీ నేను
పంతాన నీవటుమోమై పరాకై వుండఁగాను
యెంతకెంత మాఁటలాడే నిస్సీ నేను

చ 3: తొప్పఁదోఁగి చమటల తొల్లిటినీబాగు చూచి
యిప్పుడె నేఁ గాఁగిలించే నిస్సీ నేను
అప్పుడె శ్రీవేంకటేశ ఆదరించి కూడితివి
యెప్పుడో మైమరచితి నిస్సీ నేను





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1187-2 శంకరాభరణం సం: 21-452

పల్లవి: మెచ్చనిదాననా నీవు మితిమీరఁగాఁగాక ని-

న్నెచ్చరించే దాననాయిచ్చలోనే కాక

చ 1: యింత నీవు వద్దునుండే దెరఁగనిదాననా నీ-

పంతము చెడీనంటాఁ బట్టఁగాక

అంతకంటె ముద్దుమాఁట లాడకుండేదాననా

వింతరీతిఁ దిరుగఁగా వెరచితిఁగాక

చ 2: గుట్టునఁ బిలువఁగ నే కొంకేటిదాననా నీ-

వొట్టు దప్పీనని లోన నుంటిఁగాక

తొట్టి ననీ మైచెమట తుడువనిదాననా

మట్టు నీమైగురుతులు మాసీననికాక

చ 3: నీకపుఁ గాఁగిట నిన్ను నించకుండేదాననా

చొక్కపునీసరితెలు చూచితిఁగాక

యెక్కువ శ్రీవేంకటేశ యిటు నీవె కూడితివి

మొక్కకుందునా నీవు మొక్కేవనికాక





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1187-3 మంగళకౌసిక సం: 21-453**

**పల్లవి: ఏమన్నా నాకుఁ బోదు ఇచ్చగించ నీకుఁ బోదు**

**మోముచూచినంతలోనె మొక్కనేఁటికయ్యా**

**చ 1: పాయమె నాకు నెక్కె పంతమె నీకు నెక్కె**

**చేయార యేమైనాఁ జేయవయ్య**

**కాయము నాకే సెలవు కాఁకలు నీకే సెలవు**

**చాయలు సన్నలు ఇంకఁ జాలించవయ్యా**

**చ 2: వలపు నాకాయ నీకు వలసీనొల్లములాయ**

**మలకలబొంకు లిఁక మానవయ్య**

**పులకలు నావంతు బూటకాలు నీవంతు**

**నిలువునివ్వెరగులు నీకేలయ్యా**

**చ 3: బాగుగఁ గూడేది నాది పై పైఁ జొక్కేది నీది**

**చేగలనీసరసము చెల్లునయ్య**

**యీగతి శ్రీవేంకటేశ యిద్దరముఁ గూడితిమి**

**తీగెనవ్వులెల్లా నేఁడు దిష్టమాయనయ్యా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1187-4 లలిత సం: 21-454

పల్లవి: ఇంప నీచిత్తముకొలఁదిదేమాఁట

అంకెల చెలికడకు నంపనేల నన్నును

చ 1: చెప్పిచూపవచ్చుఁగాని చెట్టవట్టి తియ్యరాదు

ఇప్పుడెట్టున్నదో గాని చెలి యిదేమాట

రెప్పలెత్తవచ్చుఁగాని రిచ్చవడివుండరాదు

అప్పటి చెలికడకు నంపనేల నన్నును

చ 2: మోముచూడవచ్చుఁగాని మోహము గడించరాదు

యీమగువప్రాణ మెత్తు మిదేమాట

దోమటిదొడకవచ్చుఁ దూరి కాలుదొక్కరాదు

ఆమాట చెలికిఁ జెప్ప నంపనేల నన్నును

చ 3: పంతమాడవచ్చుఁగాని పాడిదప్పకుండరాదు

యింతలో చెలిఁ గూడితి విదేమాట

చెంతల శ్రీవేంకటేశ్వర చెల్లుఁజెల్లు నిద్దరికి

అంతయు మేలాయ నిఁక నంపనేల నన్నును





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1187-5 శుద్ధవసంతం సం: 21-455

పల్లవి: కూడినంతఫలమె కోరి నీ వేఁపకుండితే

ఆడికెరమణుఁడ నేఁ డందు కదె చాలును

చ 1: కులికికులికి నవ్వె కొమ్మ నీయాసలకు

పలికిపలికి మెచ్చె పచ్చినీసేఁతలకు

నిలిచినిలిచి చూచె నిండునీరాజసము

అలసెఅలసె నింతె అందు కదె చాలును

చ 2: తిరిగి తిరిగి చూచె తెఱవ నీరాకలకు

వొరగివొరగి వుండె వొక్కతె నీఅలుకకు

మొరగిమొరఁగి చొక్కె మొన్నటినీపొందులకు

అరసియరసి నవ్వె అందు కదె చాలును

చ 3: తనిసితనిసి కూడె తరుణి నీకాఁగిటికి

యెనసియెనసి వీఁగె యెక్కువనీరతికి

మునుపె శ్రీవేంకటేశ మొక్కె నీసన్నలకు

అనుమానము వాసె నందు కదె చాలును





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1187-6 ముఖారి సం: 21-456

పల్లవి: సమ మోహములతోడ సంగడి భ్రమతతోడ

నిమిషము సందేహించి నిలిచి రిద్దరును

చ 1: వనితకుచంబులు వనజంబులు హరి-

కనుచూపుతామరలు కలబెరకై

యెనసి చిక్కువడి యేరుపరచఁగరాక

నినుపునివ్వెరగుల నిలిచి రిద్దరును

చ 2: కాంతచెక్కుటద్దముల ఘనునిచెక్కుటద్దాల-

కాంతి నిద్దరిచూపులు కలబెరకై

అంతలోనే తమమేను లవె తడఁబడెనని

వింతలై నిలిచి రట్టె వెరగై యిద్దరును

చ 3: చెలిబాహులతలును శ్రీవేంకటేశ్వరుని-

కలయుబాహులతలు కలబెరకై

అలమి మరుకేళిని అవి యేర్పరచరాక

నెలకొన్న మరపున నిలిచి రిద్దరును





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1188-1 ముఖారి సం: 21-457

పల్లవి: ఎవ్వరు జాణలే వీరిద్దరిలోన

రవ్వలు మాయలుసేసీ రాజనపుకృష్ణుడు

చ 1: దోసిట నీరు నించె తొయ్యలి మోము గడిగె

ఆసమయాన కృష్ణుఁడు అటు వెనకనుండఁగా

వోసరి యాతనినీడ దోసిటిలోఁ గని నీరు

వాసి గాళ్లఁజల్లుకోఁగా వడి నవ్వె కృష్ణుఁడు

చ 2: అద్దము చూచి నామ మటు దీర్చుచును ఇంతి

వొద్దనే మానిమీఁదనున్నకృష్ణు నందుఁ గని

అద్దము తామరగొని యడిచిన నది చూచి

చద్దికి వేఁడికి నవ్వి జంకించెఁ కృష్ణుఁడు

చ 3: నిక్కపుపూలు గోయుచు నీరెండగాయఁగాను

పక్కన కృష్ణునినీడ పడఁతి గని

అక్కడ నేతెంచి వద్దియంగనఁ గూడఁగాను

వెక్కసాన మెచ్చెను శ్రీవేంకటాద్రి కృష్ణుఁడు







# అన్నమయ్య సంకీర్తనలు

శృ.రేకు: 1188-2 దేశి సం: 21-458

పల్లవి: మీఱరాదు దూరరాదు మేనవానివలెనాయ

ఆఱడి నీతోడిపొందు లగడాయ నిఁకను

చ 1: చేరి మాటలాడఁబోతే సెలవుల నవ్వు చిందీ

వూరకుంటే పెంజెమట లుమ్మగిలీని

యీరీతి ముందరనయ్యి యెంచ వెనకఁ దగరు

యేరా నీతోడిపొందు యేమిసేతు నిఁకను

చ 2: తప్పకచూడఁగఁబోతే తనువెల్లాఁ బులఁకించే

రెప్పలు మూసిన కాఁకరేఁగీని

విప్పకపట్టితే నుమ్మ విడిచి తేనెగారీ

తిప్పరానినీపొందు ద్రిష్టమాయ నిఁకను

చ 3: మోవి చవిగొంటేను మోహ మగ్గలమయ్యి

తావితములమందితే తమివుట్టీని

యీవేళ మందాఁబాలు యింటాఁ బాశమాయ

శ్రీవేంకటేశ కూడితి చెప్పరాదు ఇఁకను



**శృ.రేకు: 1188-3 దేశాక్షి సం: 21-459**

**పల్లవి: అంటివి వింటిని అవుఁ బదరా నీ-**

**దంటతనంబులు తగుతగురా**

**చ 1: నిక్కల గంటిని నీమాట చేకొంటి**

**చొక్కుల నను నిఁక సొలయకురా**

**చెక్కిలి నొక్కిలి సేసయుఁ బెట్టితి**

**యెక్కడిసుద్దులు యేఁటికిరా**

**చ 2: సెలవుల నగితిని సేఁతలఁ దెగితిని**

**బెళకుల ఆనలు పెట్టకురా**

**పులకల మునిఁగితి బూతులఁ గొణఁగితి**

**వలపుల చల్లఁగవలెనటరా**

**చ 3: కాఁకల వాడితిఁ గాఁగిటఁ గూడితి**

**వాకుసరసములు వలెనటరా**

**యీకడ శ్రీవేంకటేశ నీప్రియము**

**కైకొంటి పయ్యెదఁ గప్పేరా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1188-4 శుద్ధవసంతం సం: 21-460

పల్లవి: ఇంకనేలే మాటలూ యింతి నీజాడ చూచితి

అంకెలఁ జల్లగాలికి నాయాలు ముట్టితిని

చ 1: కప్పురము దిన్ననోటఁ గాదన నింపుగాక

వుప్పుదిన్న నోట నంటే నొడఁబాటౌనా

నెప్పున నాబుద్ధి విని నీవు పతిఁ గలసేవా

విప్పుఁగోవిలనోటికి వెరచితిగాక

చ 2: వుంగరపువేల సన్న లూరకనైనా నింపుగాక

సంగతి రుత్తైనవేల చవిపుట్టీనా

బంగపడి మొక్కినాను పతివి దగ్గరితివా

వుంగిటిఁ జంద్రునిరాక కులికి వచ్చితివి

చ 3: కాటుకవెట్టినకంటఁ గసరితే నింపుగాక

గాఁటపురుత్తకన్నులఁ గందువయ్యీనా

నాటినమరునమ్ములనంజు తలకెక్కఁగాను

కూటువ శ్రీవేంకటేశుఁ గూడితివే మగువా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1188-5 శంకరాభరణం సం: 21-461

పల్లవి: దవ్వుల పంతాలు చెల్లె దగ్గరరా

యివ్వలనవ్వల మీకు నిద్దరికిఁ దగులు

చ 1: కాయములో కరుఁగు కనుచూపులో మొరఁగు

చేయిచెక్కువెరగూ చెలియ కదె

పాయములో బిగువూ పచ్చిమోవినగవూ

యీయెడ నీకే చెల్లె యింతిమనోహరుఁడా

చ 2: పలుకులకొదలూ పయ్యెదలోవదలూ

అలకలకదలూ అతివె కదె

నిలువుఁదమకము నిట్టూర్పుగమకము

చెలువుఁడ నీకుఁ జెల్లె చెప్పనిఁకనేలా

చ 3: మొనపేటిసిగ్గులూ మోములోని నిగ్గులూ

పనిలేని యెగ్గులూ పడఁతె కదె

యెనసితివి శ్రీవేంకటేశ నీవే విచ్చేసి

వనితకు నీకుఁ జెల్లె వాసు లింతలోనె




# అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1188-6 సామంతం సం: 21-462

పల్లవి: తక్కులు మొక్కులు తగులాయ

దిక్కులుమోహము ద్రిష్టములాయ

చ 1: కాంతమేను కడుఁగాఁకలఁ బొరలఁగ

చెంతలఁ జెక్కులు చెమరించె

వంతుల నెండయు వానయు నొక్కట

దొంతులఁ గూడిన తోయములాయ

చ 2: తెలినిట్టచూపు దీపాలు గలుగఁగ

కలికితురుముచీఁకటి నెరసె

వెలసిన చీఁకటి వెలుఁగును నొక్కట

కలిగినభావము కతలై నిలిచె

చ 3: పూవులపులకలు పొడిమినవేళ

మోవులపండు ముదిరె నదె

శ్రీవేంకటపతి చేరి కూడఁగ

వావులరతు లేవంబులు గాచె





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1189-1 రామక్రియ సం: 21-463**

**పల్లవి: సారెసారె నన్నంత జరయకురే**

**మేరతో నాపతియట మేలు మఱచీనా**

**చ 1: తానే వచ్చీఁగాని తడవకురే కొంత**

**నానితేనే మెత్తనౌను నయగారాలు**

**పోనీపోనీవే అంతపాదుగకురే**

**పూనిపూచినవిరులు పూఁపలు గాకుండునా**

**చ 2: కూడీకూడీఁగాని కొసరకురే కొంత**

**వాడితేను చవులౌను వలపైనాను**

**నాడెనాడె మొక్కె నవ్వకురే**

**వేడుక చంద్రోదయము వెన్నెల లేకుండునా**

**చ 3: వుండీనుండీఁగాని వొరయకురే**

**కొండలైనఁ గోట్లవును గుట్టుగలితే**

**దండి శ్రీవేంకటపతి తానే విచ్చేసి కూడె**

**మెండుగా మెరచినందు మేఘము లేకుండునా**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1189-2 శంకరాభరణం సం: 21-464

పల్లవి: చెలి నీవు సేసవెట్టి సిగ్గులింకేలే

ఫలము దెలుసుకొమ్మీ పతి యిందున్నాఁడు

చ 1: తరుణి నీవు బింబాధరివి

సరిఁ జిలుకపలుకు లిచ్చట నీకేలే

పొరసి మోవిఁ జిలుకపోట్లాఁ జుమ్మీ

వరుస నీరమణుఁడు వద్దనే వున్నాఁడు

చ 2: అంగన నీవు చకోరాక్షివి

అంగడి వన్నెలనవ్వు లవి నీకేలే

ముంగిటఁ బొత్తుగలసి యెంగిలౌఁజుమ్మీ

చెంగట నీరమణుఁడు చేకొని యున్నాఁడు

చ 3: కోమలిరో కరికుంభకుచవు నీవు

ఆమ్మైఁ జెమటమడుగు లవి నీకేలే

గామిడిజవ్వన మిది కలగీఁ జుమ్మీ

యామేర శ్రీవేంకటేశుఁ డిటు నిన్నుఁ గూడె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1189-3 సాళంగం సం: 21-465

పల్లవి: నీచందములు వేరె నాచందములు వేరె

ఏచి నీకు నాకుఁ బొందు లెట్టు గూడెరా

చ 1: కమ్మినినీకన్ను లిట్టె కడుఁదెల్లఁగాఁ గాను

ఇమ్ముల నాకనుఁగొన లెట్టుఁబారెరా

సమ్మతించి నీమేను చల్లనైనందులకె

కమ్మర నామేను యిట్టె కాఁకరేఁగెరా

చ 2: పూచిననీమేన నిట్టె పులుక లుబ్బఁగ జూచి

లాచి నీవుండి నాదేహలత వాడెరా

వీచుల నీసెలవుల వెన్నెలలు గాయఁగాను

యీచాయ నాకోపముల యెండగాసెరా

చ 3: అంతలో శ్రీవేంకటేశ ఆదరించి కూడఁగాను

వింతగా నాతురుమును వెడవీడెరా

చింతలనీమతి నీవే చిమ్మిరేఁగి మఱవఁగా

యింతట నాతమకము లెచ్చరించీరా




# అన్నమయ్య

# సంకీర్తనలు


శృ.రేకు: 1189-4 సౌరాష్ట్రం సం: 21-466

పల్లవి: పట్టినదెల్లాఁ దప్పు భావించినదే తప్పు

యెట్టయినఁ దలపోఁత లెనయనిచోటికి

చ 1: మించుఁగాఁగిలియ్యఁబోతే మేనురాయుటే తప్పు

కంచపువిడిమిచ్చితేఁ గారమౌటే తప్పు

వుంచముగాఁ బిలిచితే నూఁకొనుటే తప్పు

ఇంచుకంత మతిలోన నీసడించేచోటికి

చ 2: చేకొని మొక్కఁగఁబోతే చేతులు దాఁకుటే తప్పు

యీకడ మోవానితేను యెంగిలైనదే తప్పు

మేకుఁ గొప్పు దువ్వితేను మే గోరంటితే తప్పు

వూకించి లోలోన నొరటైనచోటికి

చ 3: పానుపుపైఁ గూడితేను బడలఁజేయుటే తప్పు

యీనెపానఁ దారకాణ లిందరికిని

కోనలశ్రీవేంకటేశ కూడితివి నన్ను నేఁడు

యీనవ్వు మనకేకాని ఇంపుగానిచోటికి



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1189-5 కాంబోది సం: 21-467

పల్లవి: ఇంత చాలదా మరి యేమైన నాయఁగాని

వంతులు వాసులు నందే వక్కణించఁ గంటిఁగా

చ 1: చూచినచూపులలోన చురుకన్నా ననెఁగాని

కాచినమోవి కెంపైనాఁ గంటిఁగా నేను

వేచినచిరునవ్వులు వేఁడైనా నాయఁగాని

చేచేతనే సిగ్గు చేవదేరఁ గంటిఁగా

చ 2: వారింపులమాటలలో వాండ్లయినా నాయఁగాని

తీరైనగొణములెల్లఁ దెలిసితిఁగా

వేరులేని మొక్కులలో వెంగెమైనా నాయఁగాని

నారుకొన్నపులకల నములైనాఁ గంటిఁగా

చ 3: పట్టినకైదండలోనె పచ్చయినా నాయఁగాని

చిట్టంటు చేఁతలు మేనఁ జేయఁగంటిఁగా

గుట్టుగా శ్రీవేంకటేశ కూడినాఁ గూడితిఁగాని

వొట్టులు సత్యాలు నీచే నొనరించఁగంటిఁగా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1189-6 ముఖారి సం: 21-468

పల్లవి: నీయందు కడమా నిండుదొరవు నీవు యీ-

నాయము లోకపునడవడేకదరా

చ 1: సగము చీఁకటియు సగము వెలుంగును

జిగి యొకదినమునఁ జెలఁగీనటా

నిగిడి నీగుణములు నిజమును కల్లయు

వొగి నీకుఁ గలుగు టుచితమేకదరా

చ 2: చేఁదు కాఁకరను చెరకునఁ దీపును

పోదితో నిట్టే పొడమీనటా

నేదల మతి నొలసియు నొల్లమియును

యీదెస నీకిది ఇటు దగుఁగదరా

చ 3: శ్రీవేంకటేశ్వర చిగురును చేఁగయు

వోపల నొకమాన నుండీనటా

నీవల వినయము నిటు రాజసముఁ

దావాయ నీరతిఁ దగుఁదగుఁ బదరా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1190-1 సామంతం సం: 21-469

పల్లవి: చెక్కునొక్కేనా బుద్ది చెప్పుటగాక

గక్కన నిందులకుఁగా కళవళ మేఁటికే

చ 1: .తనుఁదానె రాకుండితే తలఁపులో రాఁడా

మనసునా రాకుండితే మాటలో రాఁడా

తను నిందరిలో దొలతనమే చెరుచనేలే

వెనకఁ జెప్పేఁగాని వేగిరించనేఁటికే

చ 2: పాడి దా నొల్లకుండితే పంతమైన నొల్లఁడా

వాడికా నొల్లకుండితే వంతులకు నొల్లఁడా

యీడనె ఇంతిటిలోన యెమ్మెలు చెరుచనేలే

ఆడఁ దనరచ్చలలో నైనదయ్యీఁగాని

చ 3: సెలవి నవ్వకుండితే చెక్కు చెమరించఁడా

చెలగి వూరకుండితే చేతికి లోఁగాఁడా

బలిమి శ్రీవేంకటాధిపతి నన్నుఁ గూడె ఇట్టె

పలువినయాలు సేసీఁ బచ్చిసేయనేఁటికే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1190-2 శంకరాభరణం సం: 21-470

పల్లవి: ఇద్దరు నిద్దరే మిమ్ము నేమనేదే

నిద్దపునాబుద్ధి వినని మీకుఁ దగదే

చ 1: ముందుముందే వొట్లు మోవిమీఁది తిట్లు

నిందలునాడే దాతని నీకుఁ దగదే

కందువై నబీరాలు కాఁకవుట్టేనేరాలు

అందమై నీమీఁదఁ జేసే దాతనికిఁ దగదే

చ 2: చలివేఁడి గొణఁగులు సారె సారె సణఁగులు

నిలిచి మారుమొగము నీకుఁ దగదే

వలవనితమకాలు వాడు మోముసముకాలు

అలిగితే మారలుగ నతనికిఁ దగదే

చ 3: కాఁగిటిలో వాసులు కదిసినరేసులు

నీఁగనిచలము వీడ నీకుఁ దగదే

వీఁగక నిన్ను శ్రీవేంకటేశుఁ డిటు గూడె

ఆఁగి చలములుచూప నాతనికిఁ దగదే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1190-3 లలిత సం: 21-471

పల్లవి: ఇది దా నావలపంటా యీడుచూపీనే

పదరేనామతికిఁ దాఁ బై కొసరా

చ 1: నిక్కి నే విరహమున నిట్టూర్పు నించఁగాను

పుక్కటఁ దా నేమిసేశో బుసకొట్టీనే

చెక్కుచేతిచింతతో నే చెమరించఁగాఁ దాను

చిక్కినసురతముల చెమటఁ దోఁగీనే

చ 2: తనపై మోహమున నే దగఁ బులకించఁగాను

పొనిగి తానేమిటివో పులకించీనే

నినుపుఁగోరికల నే నివ్వెరగుపడఁగాను

వెనకటి చేఁతలకు వెరగందీనే

చ 3: కమ్మరఁగమ్మర నే కాఁగిలించఁగా తాను

కమ్మి యెవ్వతోఁ దలఁచి కాఁగిలించీనే

అమ్మరో శ్రీవేంకటేశుఁ డట్టివాఁడా కాఁడు నేఁడు

నమ్మించి నన్నుఁ గూడి నవ్వు నవ్వీనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1190-4 దేసాళం సం: 21-472

పల్లవి: నీకుఁ బ్రియమైన వెల్లా నేఁడు నాయందివిగో

పైకొనిచేకొనుమీ యౌభళనారసింహా

చ 1: కొండలెక్కి చూచితివి కోరి యౌభళాన నా-

కొండలకుచములె ఇక్కువవో నీకు

అండనే కంబాన నుంటి వలనాఁడు నాతొడలు

నిండునరఁటికంబాలు నీకు నివివో

చ 2: యెత్తితివి రెండురూపు లేకమైనమేను నాఁడు

అత్తిననీనారూపు లటువలెఁబో

చిత్తగించి నవనారసింహములై వుంటి వాడ

మొత్త మినానవరసములఁ దేలరాదా

చ 3: నిచ్చలును భవానాశినీట నోలలాడితి వందు

పచ్చినాచెమటనీరు పతి యిదివో

లచ్చనల గురుడాద్రిలక్ష్మీపతివి నాఁడు

చెచ్చెర శ్రీవేంకటాద్రిశ్రీపతివి నేఁడు




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1190-5 సాళంగం సం: 21-473

పల్లవి: నాకె సతమైనప్పుడు నమ్మేఁగాని

చీకాకుకొనగోర చిమ్మకురా నన్నును

చ 1: వడఁగండ్లగుళ్లాయ వానలేని జల్లాయ

వొడఁబాటు లిఁకనేనల వోపరా నేను

ముడిలేనివలలాయ మూఁగగన్నకలలాయ

యెడనెడ నీపొందు; లేఁపకురా నన్నును

చ 2: యెండమావినీళ్లాయ యెదుటి గుక్కిళ్లాయ

చండితో నీవినయాలు చాలురా నేఁడు

వండ వండనట్లాయ వావిగావి వొట్లాయ

అండనే మొక్కులు మొక్కే అంటకురా నన్నును

చ 3: తినఁదినఁ దీపులాయ తిద్దులేనిరూపులాయ

తనియ నీమోవితేనె దక్కెరా నాకు

ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విదె నన్ను

అనువాయ నిఁకనేమీ నాడకురా నన్నును



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1190-6 మంగళకౌసిక సం: 21-474

పల్లవి: పడఁతి యిందులకే భ్రమసితినే

నిడుపుఁగుఱుచ లివి నేర్చితివే

చ 1: చిక్కవినవ్వులు శిరసుల నవ్వులు

వొక్కటఁ గులుకుచు వొలుకకువే

పుక్కిటివూర్పులు బూమెలనేర్పులు

మిక్కిలిఁ గంటిని మెచ్చితినే

చ 2: కెరలినచూపులు కెమ్మోవితీపులు

సరిసరి నొక్కట జరపకువే

మరువపుఁబులకలు మాఁటలఅలకలు

అరుదుగఁ గంటిని అవునౌనే

చ 3: వేగిరపురతులును వేడుకమతులును

పోగాయ నెమ్మెలఁ బొరలకువే

యీగతి శ్రీవేంకటేశుఁడ నేనిదె

బాగుగఁ గూడితి పదరకువే



శృ.రేకు: 1191-1 కాంబోది సం: 21-475

పల్లవి: ఓబులేశుఁ డీకొంత నోరసీఁ గొంత

యీబిగువు దనకేల ఇంతెఱఁగఁడా

చ 1: అదివో లకిమమ్మ ఆయపుచూపులు చిమ్మ

యెదురై నవ్వీ నితఁ డిదేమమ్మ

మది నీఁతగలవారు మారుగొండ లెక్కినారు

వదలుఁబయ్యదజారు వనితకుఁ జూడఁడా

చ 2: సొమ్ములతో ఆకె వీఁగీ సొంపుఁజెమటలఁ దోఁగీ

వుమ్మలయీతఁడైతే వూర్పు రేఁగీ

యెమ్మె లింతగలవాఁడు యీడనేలున్నాఁడు ఇంతి-

తమ్మిమోముచింత వాఁడు తాఁ గానఁడా

చ 3: కామినిమోహము రేఁచెఁ గాఁగిటికిఁ జెయి చాఁచె

యేమిరే యీనరసింహుఁడిందాక లాచె

ఆమని శ్రీవేంకటాద్రి నన్నినోములు నోఁచె

కామతంత్రముల నంతఘనుఁడు గాఁడా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1191-2 ముఖారి సం: 21-476

పల్లవి: కానికాని మెచ్చుసేసేఁగానీ నేను

సోనల శ్రీనరసింహ చూడుమీ నేను

చ 1: గొంది నీవు వోబుళపుకొండలో వుండేవునికి

ఇందిరతో విన్నవించే నిదివో నేను

చెంది నీవు చేచేతఁ జేసినట్టి ఆగడాలు

అంది యాకెతోనే చెప్పే నప్పటి నేను

చ 2: శిరసువంచి నీవు చిరునవ్వులు నవ్వేది

సిరితో విన్నవించే నంచెలనే నేను

అరుదై నీమేన నిండానానినపెంజెమటలు

ధర నాపె కెఱఁగించేఁ దప్పక నేను

చ 3: అమరు నీవాఁడిగోళ్ల అందపువిటతనాలు

కమలతో విన్నవించేఁ గందువ నేను

సమమై శ్రీవేంకటేశ సతిఁ గాఁగిటఁ గూడి నా-

కమర లంచమిచ్చితి వంతదాన



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1191-3 రామక్రియ సం: 21-477

పల్లవి: ఆన లింకా మానవా ప్రహ్లాదవరదా

నానెఁ జెమటఁ జెక్కులు నవ్వులింత చాలదా

చ 1: పిప్పిచేసితివి మోవి బెదరించితివి నీవి

అప్పటి నాసోదమా ప్రహ్లాదవరదా

కొప్పు జారఁజేసితివి కొంగువట్టితీసితివి

రెప్పలెత్తి చూచే వింకా రేసెంత గలదో

చ 2: మానముపైఁ దిట్టితివి మర్మము చేముట్టితి

విన నింతచాలదా ప్రహ్లాదవరదా

మేనెల్లఁ జొక్కించితివి మేకుల దక్కించితివి

శేననవ్వులు నవ్వేవు సేఁత లింత చాలదా ,

చ 3: చెక్కుఁ గడునొక్కితివి చేతులెత్తి మొక్కితివి

అక్కరింకానేఁటికి ప్రహ్లాదవరదా

యెక్కువ శ్రీవేంకటాద్రి నిరవైనదేవుఁడవు

దక్కి నన్నుఁ గూడితివి తమి యెంతగలదో





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1191-4 భైరవి సం: 21-478**

**పల్లవి: ఇదివో చెలియభావ మిఁక నీచిత్త మెట్టో**

**పెదవులు మోఁపిమోఁపి పేరుకొని పాడును**

**చ 1: నీవు వచ్చేవని చెలి నిలుచుండినిలుచుండి**

**తోవకెదురుగ వచ్చి తొంగిచూచును**

**భావములో నీరూపు భావించి భావించి**

**నీవి జారఁ గరఁగుచు నివ్వెరగు నొందును**

**చ 2: యెవ్వరు మాఁటాడినా నీయెలుఁగని సారె సారె**

**అవ్వలనివ్వలఁ జూచి యాలకించును**

**జవ్వని గాలివెట్టినచప్పుడట్టె వినినిని**

**మవ్వపుఁగళవళాన మాటలాడును**

**చ 3: యింతలో శ్రీవేంకటాద్రి యెక్కి ప్రహ్లాదవరద**

**కాంత నిన్నుఁ గూడి కవకవ నవ్వెను**

**చింతదీర నీవు మేనఁ జేసినరేకలు చూచి**

**వంతుల నీమేనఁ జేయవలెనని యెంచును**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1191-5 లలిత సం: 21-479

పల్లవి: చూచినవారికి నిది సోద్యములయ్యా

నీచనవు గాదనేనా నీచిత్తమయ్యా

చ 1: కాకిపైఁడి మాబొట్టు కప్పు పారిటాకు పట్టు

పైకొనఁ జూచేవు నీకు బాఁతైతినా

మేకుల మొల్లలకొప్పు మేనెల్లఁ గస్తూరితుప్పు

కైకొని నిన్ను మెప్పించఁగలనటవయ్యా

చ 2: చెక్కుల జవ్వాది నూనె చెంచుజాతి తోడుతోనె

యిక్కువ నాతోఁ బెనఁగే వింత కోపేవా

పెక్కువపూఁబొద యిల్లు పిసకత్తి యేదుముల్లు

నిక్కి నిక్కి చూచేవు నీకు నింతేలయ్యా

చ 3: పానుపు లేఁతచిగురు పట్టువలపు జిగురు

నానాఁటి కిఁక నంత నవ్వకువయ్యా

యీనెపాన శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

ఆని నీనామై గురుతు లంటెఁ బైపైనయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1191-6 నాదనామక్రియ సం: 21-480

పల్లవి: అందుకదే తారుకాణ అంతే చాలునేఁ

జెంది నిన్ను దూరఁజుమ్మీ చెప్పితిఁగాని

చ 1: వింటిఁజుమ్మీ నీనటన వింతసుద్దులు నిన్ను-

నంటిముట్టి యిఁకనేమి ననఁగాని

కంటిఁజుమ్మీ నీమేన గబ్బిచేఁతలు నే-

నొంటి నీకు బుద్దిచెప్పనొల్లఁ గాని

చ 2: హెచ్చెఁజుమ్మీ నీవేసా లిందరిలోన అంత

విచ్చి విచ్చి యిటు వెళ్లవేయఁగాని

వచ్చెఁజుమ్మీ నీబాస నీవద్ది కప్పుడే నే

రచ్చనీదొలతనాలు రాఁపుసేయఁగాని

చ 3: చిక్కెఁ జుమ్మీ నీకాఁగిలి చేతికిఁజేయి వేరే

తక్కినసుద్దులు మరి తడవఁగాని

దక్కెఁజుమ్మీ నీమన్నన తప్పక నాకు నేఁ

జక్కని శ్రీవేంకటేశ చాలించఁగాని



www.annamayya.net


# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1192-1 పాడి సం: 21-481

పల్లవి: ఇందును బతిమాలించ నిది యేలయ్యా

అంది దవ్వుచుట్టరిక మదియే మేలును

చ 1: పన్నినతెరమఱఁగు బహురూపములెల్లాను

కన్నదాఁకానే కాని కడఁ జవుకే

యెన్నిక నీనాపొందు లెడనివుండఁగఁగాని

మన్ననఁ గూడినమీఁద మరి ఇట్టెపో

చ 2: వోడక ముచ్చటమాట లొకరొకరు గదిసి

ఆడినదాఁకానేకి అంతటఁ జౌక

యీడ నీనాయెడమాట లింతులాడఁగానేకాని

కూడిమాటాడితి నిఁకఁ గొస రింతేపో

చ 3: గరిమ సమరతులు కడుఁజలములు మేను

మరిగినదాఁకాఁ గాని మరిచౌకే

సిరుల శ్రీవేంకటేశ చేరి నీకాఁగిట నేను

అరమరచితిఁ బను లన్నియు నింతేపో





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1192-2 గౌళ సం: 21-482**

**పల్లవి: పెక్కు నిచ్చకల్యాణాలపెండ్లి కొడుకా**

**మిక్కిలి జాణఁడవయ్యా మేలయ్య నీకు**

**చ 1: చెలులుపదారువేల సేసవెట్టినచేతుల**

**చెలఁగి నాకు మొక్కేవు చెల్లునా నీకు**

**కలఁగక గొల్లెతలకాలుదొక్కే పాదమున**

**అలరి నాకాలు దొక్కే వౌనయ్య నీవు**

**చ 2: పురకాంతలఁగూడ బోడించినమాటల**

**ధర సరసమాడేవు తగునా నీవు**

**పరగఁ గొలనిలోని పచ్చితనపుచూపుల**

**వొరసి మమ్ముఁ జూచేవు వోయమ్మ నీవు**

**చ 3: కడుబలిమి రుక్మిణిఁగాఁగిఁలించిన కాఁగిట**

**యెడయక కాఁగిలించే విదివో నన్ను**

**కడఁగి శ్రీవేంకటాద్రిఘనుఁడ నీకు నాకు**

**బడినే శోభనములు పైకొనెనయ్యా**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1192-3 కేదారగౌళ సం: 21-483

పల్లవి: నీకే తెలుసును నెలఁతభావములు

యీకడఁ గలదియు నింతేమాట

చ 1: చెలువుఁడ నీపేరు చెవిలో నుడిగిన

చెలియకుఁ జెక్కులు చెమరించె

పులకలు కుచములఁ బొదలెను కమ్మర

నిలువునివ్వెరగు నిండెను మతిని

చ 2: కాంతకు నీరూపు కన్నులఁ జూపిన

వింతగునగవులు వెడలె నదె

చెంతల నుదుటునఁ జెదరె నెరిఁగురులు

కంతునికళలును గరఁగెను తుదిని

చ 3: తరుణిఁ గాఁగిటికి దగ్గరఁ బిలువఁగ

అరిది బాహులత లదె యదరె

యిరవుగ శ్రీవేంకటేశ యిద్దరికి

మరుతంత్రంబుల మర్మము లలరె





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1192-4 కాంబోది సం: 21-484

పల్లవి: అల్లదివో చూడరమ్మ అతివభావము నేఁడు

వెల్లవిరిఁ బతివద్ద వింతలాయఁగదరె

చ 1: తప్పక చూచి యింతి తలవంచి సిగ్గువడి

చిప్పిలఁ గడమచూపు చిత్తములోఁ జూచెనే

కొప్పు గదల నడచి కొంచి కడమనడపు

చెప్పక పయ్యద మాఁటుసేయుచు నడచెనే

చ 2: సెలవిఁబారఁగ నవ్వి సిగ్గునఁ గడమనవ్వు

కులికి కులికి తనకుత్తికలో నవ్వెనే

నిలిచి కొంతమాఁటాడి నీఁటునఁ గడమమాఁట

సెలసిచేయి మరగుచేసుక మాటాడెనే

చ 3: చేతికి నాకు చుట్టిచ్చి సిగ్గుతోడ సగమాకు

చేతనే చిదిమి తనవాతెరఁ గీలించెనే

యీతల శ్రీవేంకటేశుఁ డింతిభావములు చూచి

కాతరానఁ గూడఁగాను గడుసై నిలిచెనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1192-5 ముఖారి సం: 21-485

పల్లవి: ఇంతచాలదా నిన్ను యింక సొలయనేల

పంతముఁబలుకు నొక్క పాటేయఁగదరా

చ 1: చొక్కి మనతనువులు సోఁకకుండినా నేమి

ఇక్కువ నీనాచూపు లిటు సోఁకెఁగా

మిక్కిలి నీటిలోని మీనములు కన్నులనె

తక్కక చూచితేనే తనివయ్యీఁగదరా

చ 2: ఇమ్ముల నీనాపాన్పు లెడదవ్వయినా నేమి

చిమ్ము నీపై తలపోఁత చేరువలేకా

పమ్మినకూర్మములు పాసి యెచ్చోటనున్నా

తమ్ముఁదామె తలఁచితే తనివయ్యీఁగదరా

చ 3: శ్రీవేంకటేశ నీచిత్తము పరాకైనా

వోవరి నాకాఁగిటిలో నున్నాఁడవుగా

యీవలఁ బక్షులు భూమి నెందు మేసి వచ్చినాను

తావులఁ బొదిగితేనే తనివయ్యీఁగదరా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1192-6 సామంతం సం: 21-486

పల్లవి: కంటివో కానవో కాని ఘనమై నామోహ మిది

వెంటవెంట నీకు వేవేలై వున్నదిరా

చ 1: నెమ్మది నాశిరసే నీతొడపై నుండెఁగాని

కమ్మర నాచిత్తము నీకాఁగిటిపై నుండెరా

దొమ్మి నాకొనగోరు నీతొడమీంద నుండెఁగాని

పమ్మి నాయాస నీమోవి పంటిపై నున్నదిరా

చ 2: పాయక నాచన్నులు నీపాదముపై నుండెఁగాని

మోయుచు నాచూపు నీమొగముపై నుండెరా

చేయార నాచేఁతలు నీసిగ్గులపై నుండెఁగాని

మాయపుదిట్లు నీమానముపై నుండెరా

చ 3: పొంది నాతములను నీపుక్కిటిలో నుండెఁగాని

చందపునాకుటమి నీసమరతి నుండెరా

వొందిలి శ్రీవేంకటేశ వురాన నే నుందుఁగాని

అందపునావయసు నియాతుమ నున్నదిరా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1193-1 ముఖారి సం: 21-487

పల్లవి: ఏమంటి వేమంటి వెఱగ నేను వో-

కామిని నీకిప్పుడైనఁ గానవచ్చెఁగా

చ 1: వేలఁ దలుపుమీఁటినవిటుఁ డెవ్వఁడే వో

తాలిమి నేనే మాధవుఁడను

వాలినమాధవుఁడవంటె వసంతుఁడవా కాదే

గాలింపుచక్రము చేతఁగలవాఁడ నేనే

చ 2: ధరఁ జక్రివైతేఁ గుమ్మరవాఁడవా కాదే

సిరుల భూమి ధరించినవాఁడనే

శిరసున భూమిమోఁచే శేషుఁడవా కాదే

అరయ నిన్నియునేలేహరినే నేను

చ 3: వంతులకు హరివైతే వానరమవా నీ-

మంతనపు లక్ష్మీరమణుఁడ నేను

యింతయేల శ్రీవేంకటేశుఁడ ననఁగరాదా తొల్లి

అంతేపో నామారు నీవంటివిగదే





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1193-2 రీతిగౌళ సం: 21-488**

**పల్లవి: ఔనయ్య నీకింతా నలవాటే పో**

**నానాఁటఁ దెలిసేవు నన్ను నీవే చెలియా**

**చ 1: యేమయ్య యిందాఁకా నెటువోతివే నే-**

**నామనిమెకాల వేఁటలాడఁబోతినే**

**బూమి సర్వసముఁడ వీబుద్ధి దగునా అందు-**

**కేమే రావణాదిదుష్టు లిందరి నేఁ జంపనా**

**చ 2: ఐతే నీమేనివాస నది యేడదె**

**ఆతలఁ బుప్పొడి నామై నంటుకొనెనే**

**యీతల నీమేనిజీర లేల వచ్చెను**

**వోతరుణి పూఁదీగె లొరసెనే నన్ను**

**చ 3: కాని మెయి చెమరించఁ గారణమేల నేఁ-**

**డీనెపము వేసఁగి యెండదాఁకెనే**

**మోనపుశ్రీవేంకటేశ మోవిగంటేలా నేఁ**

**బూని శంఖమూ దఁగానే పొరయెత్తెనే**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1193-3 రామక్రియ సం: 21-489

పల్లవి: అదియేల నీవుచెప్పినట్టు చేసేనే

కదిసితి మిఁకనేల కంటి మన్నిపనులు

చ 1: బాససేయుమంటే నేఁ బాముఁ బట్టేనే అవులే

భాసురపునీపరపు పామేకాదా

మోసదీర జలధి ఇమ్ములఁ జొచ్చేనే నీవు

వాసికి జలధిఁబండేవాఁడవే కాదా

చ 2: చింతదీర ననలంబు చేతఁబట్టేనే తొల్లి

బంతి నగ్నిమింగినట్టిబాలుఁడవేకా

దొంతరకొండలతో నేఁ దులఁదూఁగేనే నీ-

కింతేల గోవర్ధనగిరెత్తవా తొల్లి

చ 3: యెంచనేల మీఁదిమాట లేమనేవే అయితే

పంచ నొక్క యక్షరమె పంతమీవయ్యా

పెంచనేల నీకు నాకు భేదమటవే యిఁకఁ

గొంచక శ్రీవేంకటేశ కూడితి యిందులకు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1193-4 దేసాళం సం: 21-490

పల్లవి: ఓపననఁగా నేపో వొళ్లు వేసీని

తీపుల జంకించి నాపైఁ దేనెచల్లీని

చ 1: మాటలాడెఁబో తాను మరి నే నూఁకొంటినా

కూటమి నిందులకే తాఁ గొంగువట్టీని

నీటున సన్నసేసెఁబో నిక్కి నేఁ జూచితినా

తాటల నిందులకే తాఁ దగులనాడీని

చ 2: సరుసఁ దా నవ్వెఁబో నే జాణతనాలాడితినా

అరుదై యిందులకే నన్నంటవచ్చీని

అరసి తా మొక్కెఁబో నే నామొక్కు గైకొంటినా

సిరుల నందులకే తా సేసవెట్టీని

చ 3: చేయివట్టి తీసెఁబో నే సిగ్గువడి రాకుంటినా

బాయట నందులకే తాఁ బచ్చి సేసీని

వోయమ్మ శ్రీవేంకటేశుఁ డోఁగునూఁతులాడ నన్ను

చాయలకే కూడెఁబో వేసాలు సేసీని




# అన్నమయ్య

# సంకీర్తనలు


శృ.రేకు: 1193-5 లలిత సం: 21-491

పల్లవి: ఇంతకతొల్లేమియు నే నెఱఁగఁబో

మంతనానఁ దనకే నే మరులైతిఁబో

చ 1: చెక్కులెల్లాఁ జమరించెఁ జింతలెల్లాఁ జిగిరించె

చొక్కుల నిట్టే తాఁ జూడఁగానేపో

ముక్కున నూరుపు దొట్టె మోమెల్లా వాడువుట్టె

మక్కువ నాతోఁ దా మాటలాడఁగాఁబో

చ 2: అంగమెల్లాఁ బులకించె నాయమెల్లా గిలిగించె

అంగడిఁ బయ్యదకొంగు అంటఁగానేపో

ముంగురులెల్లాఁ జెదరె మోవియంతయు నదరె

సంగతి సెలవినవ్వు చల్లఁగా నేపో

చ 3: కన్నులఁ గెంపులుమీరె కాఁగిటఁ బంతము చేరె

కన్నెనైననన్నుఁ దాఁ గలయఁగాఁబో

చన్నులు పై పై నిక్కె జవ్వనము రతికెక్కె

యిన్నిటా శ్రీవేంకటేశుఁ డిటు గూడఁగాఁబో





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1193-6 రామక్రియ సం: 21-492

పల్లవి: పట్టితే నాతోపని పదియుఁబది ఇట్టె

నెట్టుకొని నిలువుము నీవే నేను

చ 1: వొరసి తప్పకచూచే వోతఁడా

తిరిగి యిట్టె తల దియ్యకుమీ

గిరిపితేఁ బోదింక కెరలీ పంతాలు

సరస నీనవ్వులెల్లా చక్కఁజేసే నిఁకను

చ 2: అడుగు దియ్యకుమీ నీవంతేసి నీవు

గొడవల కియ్యకొంటేఁ గొంకేనా

అడవే మేడెము మాయంకెకు నీ-

వెడనీలికాసెకు వెఱతు నేను

చ 3: మాఁటలపచారమేల మగవారికి

గాఁటపునీరాతిగుండె కంటి నేను

నేఁటనే శ్రీవేంకటేశ నిన్ను నన్ను వొకటిగా

తూఁటవిలుతుఁడు వచ్చి దొమ్మి సేసెఁగా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1194-1 ముఖారి సం: 21-493

పల్లవి: నీవు నన్ను దగ్గరుటే నేరమాయఁగా

కావిరి నీసుద్దులెల్ల కతలాయఁగా

చ 1: తొలఁగి కడలు నీవు తొక్కివచ్చినట్టివేళ

సెలవి నానవ్వు నీకుఁ జేఁదాయఁగా

పలుచేఁతలను నీమై వచ్చియైనయీవేళ

కలికినాకనుచూపే కారమాయఁగా

చ 2: యెంచఁగ వేరొకతెతో నేకతమైవున్నవేళ

వంచిననామొక్కు నీకు వాఁడాయఁగా

నించి రాత్రిజాగరాలు నీవు నిద్రించేవేళ

పొంచిననామట నీకు పులుసాయఁగా

చ 3: కందువకాఁగిటఁ గూడి కరఁగివుండేవేళ

సందడి నాకొనగోరే చవులాయఁగా

ఇందునందు శ్రీవేంకటేశ నన్నుఁ గూడఁగాను

చందపువపులలెల్లా సతమాయఁగా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1194-2 ఆహిరి సం: 21-494

పల్లవి: ఇంకా నీమనసెట్టో యెఱంగఁజుమ్మీ

కొంకితి నింతే నేఁ గొసరఁజుమ్మీ

చ 1: చుక్కలు గాయఁగా నేఁజూడఁ దలెత్తితి నింతె

ఇక్కడ నేముండుతా నే నెఱఁగఁజుమ్మీ

చిక్కువడ్డముత్యములు చేతులఁ బట్టితి నింతే

అక్కర నివేఁటివని యడుగఁజుమ్మీ

చ 2: తుమ్మిదలు బెదరఁగాఁ దోడ నే నవ్వితి నింతే

తమ్మిమోవి నిన్ను నేమీఁ దడవఁజుమ్మీ

వుమ్మ గాలివిసరఁగా నొంటి నేఁ బండితి నింతే

అమ్మరో నీతో నే నలుగఁజుమ్మీ

చ 3: చీకాకురేకులు చూచి చే గోరగీరితి నింతే

చేకొని నీమేను పచ్చిసేయఁజుమ్మీ

యీకడ శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి

పైకొని చొక్కితి నింతు పదరఁజుమ్మీ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1194-3 గుండక్రియ సం: 21-495

పల్లవి: కేరడమాడఁగలనా కేశవరాయా

చూరగొని మర్మములు సోఁకింతుఁగాక

చ 1: పంతమాడితే నీతోఁ బతి యాడఁగలనా

కాంతలతోఁ జెప్పి నవ్వఁగలగాక

దొంతి సాకిరివెట్టేవు తొలమనఁగలఁగాక

కొంత మోముమూసుక సిగ్గున నుండుఁగాక

చ 2: వట్టియెమ్మె మెరసితే వద్దన నేఁ గలనా

చుట్టపుమొకమోటానఁ జూతుఁగాక

వెట్టినీచేఁతలకు వేఁగై మాడఁగలనా

కిట్టి మరునికి నొప్పగించఁగలఁగాక

చ 3: కాఁగిలించితే నిన్నుఁ గాదనఁగఁగలనా

లోఁగి యందులకే చొక్కి లోనౌదుఁగాక

నాఁగులెల్లఁ దీర మాఁచనవోలిచెన్నుఁడవై

మూఁగితి శ్రీవేంకటేశ మోవి యిచ్చేఁగాక





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1194-4 లలిత సం: 21-496

పల్లవి: ఇది మేలు నీలాబ మిందరిలోన

అదనెరిఁగి బేహారాలాడనేర్తువే

చ 1: కన్నులఁ గెంపులుదేరెఁ గాఁకల ముత్యాలు రాలె

వున్నతి మరునిపెద్దవోడ దిగెను

మున్ను మోవిఁ బగడాల మునిఁగేవు నిలాల

కన్నెరో నీవేడనైనా గని గంటివో

చ 2: చెక్కులఁ గస్తూరి నిండెఁ జెమటఁ గుంకుమ గూడె

మొక్కలాన నీకుచాలు మూల గలదో

చిక్కనిమేన జాజులు సెలవిఁ గప్రము చిందె

పక్కన నిదేమి నీకుఁ బంట వండెనో

చ 3: కోరి మేనఁ బైఁ డి రాలీ కొనగోర వెండి రాలీ

నేరుపుల నీవు పెన్నిధి గంటివో

సారెకు శ్రీవేంకటేశ్వరుఁడును నీవు నిట్టె

చేరి మారుబేరాలాడి చెలఁగే రిదెట్టిదో



శృ.రేకు: 1194-5 శ్రీరాగం సం: 21-497

పల్లవి: మమ్ము మన్నించి విచ్చేయు మగువకడకె నీవు

కమ్మర నన్నంటకు నీకపటమే యెఱుఁగు

చ 1: తిలకించి చూచె నినుఁ దేరకొన దేఁటికో

చెలికన్ను లెఱఁగు నీచిత్త మెఱుఁగు

పిలిచె నూరక నిన్ను బిగువున నేఁటికో

మలయుమో వెఱఁగు నీమర్మమే యెఱుఁగు

చ 2: పక్కన నవ్వె నదె పడఁతి యదేఁటికో

చెక్కు సెలవు లెఱుఁగు సిగ్గు లెఱుఁగు

అక్కడఁ జేనన్న సేసె నతివ యదేఁటికో

నిక్కుఁబాయ మెఱుఁగు నీనిండుమోహ మెఱుఁగు

చ 3: పూవులచెండున వేసె పొలఁతి యదేఁటికో

తావులచే యెఱుఁగు నీతను వెఱుఁగు

యీవల శ్రీవేంకటేశ ఇద్దరిఁ గూడితి విట్టె

కావరపుగుణములు కంతుఁడే యెఱుఁగు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1194-6 వరాళి సం: 21-498

పల్లవి: చెల్లఁబో నన్ను నీవింత సేతురటవే

వెల్లవిరిగా నేమైనా వింటివటవే

చ 1: వెన్నెలలే మరిగేవు వెంటవెంటఁ దిరిగేవు

నన్ను నీవు మతి నంత నమ్మవటే

వెన్న నున్నఁగా నూరేవు వెక్కసమై దూరేవు

కన్నెరో నీవేమైనాఁ గంటివటవే

చ 2: కుంకుమలే కురిసేవు కొంగువట్టి జరసేవు

ఇంకా నాగుణము నీ వెఱఁగవటే

లంకెనుండి జునిఁగేవు లావులకే పెనఁగేవు

కంకిగా నెందుకైనా నేఁ గాదనేనటే

చ 3: పన్నీరే చిలికేవు పట్టి తేనె యలికేవు

అన్నువనాకాఁగి లింత యలపటవే

వున్నతి శ్రీవేంకటాద్రి నుండి వచ్చి నంబటూరి-

చెన్నుఁడనై కూడితిని చేకొంటివటే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1195-1 భైరవి సం: 21-499

పల్లవి: అప్పు డెట్టుండెనో చిత్త మయ్యో యెఱఁగనైతి

చెప్పుడుమాటలకే నేఁ జేరనైతిఁగా

చ 1: కొసరికొసరి నీపై కోపమున నుంటిఁగాని

అసమిచ్చి నీతో మాటలాడనైతిఁగా

పసలేని సిగ్గుతోడిపంతాననే వుంటిఁగాని

ముసిముసినవ్వుమోవి మోపనైతిఁగా

చ 2: విరహపుఁగాఁకల నావిసుపే చూపితిఁగాని

సరిఁ బిల్చితే నూఁకొనఁజాలనైతిఁగా

వరుసవంతులకై నే వాదులాడితిఁగాని

మురిపేన మొక్కితే నే మొక్కనైతిఁగా

చ 3: వేగమే నీవు గూడితే వెస భ్రమసితిఁగాని

చేగలనీమేను పచ్చిసేయనైతిఁగా

భోగపుశ్రీవేంకటేశ పోట్లదొరితిలోన-

నీగతిఁ జెన్నుఁడవైతే నెనసితిఁగా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1195-2 పాడి సం: 21-500

పల్లవి: ఎక్కడి కెక్కడి సుద్దు లేమనేవురా

వొక్కమారే యింతసేయ నొద్దు వొద్దురా

చ 1: మాటలనే కరఁగితి మన్ననకే పెరిగితి

యీటునఁ గోపించనేర నేమిసేతురా

నీటున నివ్వెరగైతి నెయ్యానకే పొరుగైతి

నేఁటికి నన్నారసేవు యేడకేడరా

చ 2: చింతలనే జునిఁగితి సిగ్గులనే మునిఁగితి

ఇంతలోనే పిలిచేవు యేమందురా

పంతానకే పాలైతిఁ బాయానకే లోనైతి

యెంతకెంత సారె నిన్ను నెచ్చరింతురా

చ 3: కాఁకలనే తనిసితి కాఁగిట నే నెనసితి

వాకున నన్నుఁ బొగడవలెనటరా

పైకొని శ్రీవేంకటేశ పలురతులుఁ జొక్కితి

యేకచిత్తమాయఁ బను లియ్యకొంటిరా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1195-3 ఆహిరి సం: 21-501

పల్లవి: నెలఁత మోహించినదే నేరమటయ్యా

పలువిన్నపాల కిఁకఁ బనిలేదయ్యా

చ 1: చెక్కునఁ జేర్చినచేత సేమంతిరేకులు రాలె

చొక్కపు నీసతి దెస చూడవయ్యా

నిక్కి చూడ నంతలోనే నిలువునఁ గొప్పు వీడె

వెక్కసపుఁజలమేల విచ్చేయవయ్యా

చ 2: ముంచినవూర్పులవెంట ముత్యపుఁగన్నీను జారె-

నించుకంత తెమలపు యిదేమయ్యా

చంచలపునడపుల సందడించెఁ జెమటలు

అంచెల నీమనసు కాయటవయ్యా

చ 3: పెట్టినపయ్యదలోన బేఁటుగందములు రాలె

చిట్టకాల కింతి నింతసేసితివయ్యా

యిట్టె శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి

అట్టె మేను పచ్చి సేతురటవయ్యా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1195-4 సామంతం సం: 21-502

పల్లవి: అయినట్టయ్యీఁగాక అతనునిమాయ లివి

దయయు దాక్షిణ్య మెంచీఁ దనకేఁటికే

చ 1: రచ్చకెక్కె వలపులు రాఁపులకెక్కెఁ జన్నులు

ఇచ్చకాలు మాపుదాకాఁ నిఁకనేఁటికే

వెచ్చనాయ నిట్టూర్పు వెరఁగు పైతరవాయ

తచ్చనజగడములు తనకేలే పతికి

చ 2: కొప్పు గడువెడజారెఁ గోపము కన్నుల మీరె

ఇప్పుడు మూసిదాఁపురా లిఁకనేఁటికే

చప్పనాయ సాదింపులు చౌకాయఁ గుంటెనలు

దప్పిదేరేవినయాలు తనకేఁటికే

చ 3: రంగుమీరెఁ బులకలు రతులు కాఁగిటఁ జేరె

ఇంగితాకారాలు చూడ నిఁకనేఁటికే

అంగవించి శ్రీవేంకటాధిపుఁడు ననుఁ గూడె

దంగుడు బంతములాడఁ దనకేఁటికే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1195-5 బౌళి సం: 21-503

పల్లవి: వేగిర మిప్పుడేయేల వింతవారమా

సోగల నివెల్ల నేఁడే సోద్యమా

చ 1: యీతల మెచ్చకయున్న నెదలో మెచ్చేవుగాక

ఆతల నిప్పుడే యేమి అవసరమా

ఘాత మోవి నవ్వకుంటు కన్నుల నవ్వేవుగాక

తోతో ఇంతన యేమి దోసమా

చ 2: యెదుట మాటాడకున్న నింటిలో నాడేవు గాక

పదరి నీమీఁద నేను పై తరవా

మదిరేపట రాకుంటే మాపట వచ్చేవుగాక

కదిసి ఇప్పుడు యేమి కక్కూరితా

చ 3: రచ్చల వీఁగకయున్న రతుల వీఁగేవుగాక

వచ్చివచ్చి నీతోడ వావాదమా

పచ్చిగా శ్రీవేంకటేశ పైకొనికూడితి నిట్టె

గచ్చుల నీగుణ మిది కానమా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1195-6 భూపాళం సం: 21-504

పల్లవి: మూలనున్న వారి నీవు ముంగిట వేసేవుగాక

గోలవై యూరకుండితే కొంగువట్టేనా

చ 1: పిలువఁగాబో నీతోఁ బ్రేమమున నూఁకొంటి

అలిగినట్టే వుంటే నదేమనేనా

నిలిచి చూడఁగఁబో నే నిన్నుఁ జూచితిని

తలవంచుకొని యుంటేఁ దడవఁబోయేనా

చ 2: చెనకఁగాఁబో నేఁ జేబలిమి చూపితిని

కొనగొనలనే వుంటే గోరఁ దీసేనా

మనసిచ్చి నవ్వఁగాఁబో మారుకొని నవ్వితిని

వెనకటివలె నుంటే వేగిరించేనా

చ 3: పైనొరఁగఁగానే పో పంతానకే కూడితిని

మాని నీ వూరకుండితే మాయసేసేనా

యీనెపాన శ్రీవేంకటేశ నన్ను నేలితివి

నేనే నీవైనమీఁద నేరమెంచేనా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1196-1 ఆహిరి సం: 21-505

పల్లవి: ఎండగాదు నీడగాదు యెక్కువనీ పొందులు

బండుబండులైతి నింకఁ బడలేనురా

చ 1: పచ్చిగారు వెచ్చిగాదు పాయపునీసేఁతలు

ఇచ్చట నే మొకమోట నేమందురా

వెచ్చనాయ పచ్చనాయ వెడ నీమేను నీమోవి

రచ్చలకెక్కె వలపు రాకు రాకురా

చ 2: వేండ్లాయ వాండ్లాయ వెడద నీచూపులు

యేండ్లాయ నిమిషము లేమిసేతురా

ఆండ్లైరి గోపసతులంటావే బిగిసేవు

వీండ్లవాండ్లమాటలు వినలేనురా

చ 3: అంకెలాయ లంకెలాయ అందపు నీకాగిఁలి

యింక నిన్ను వీడనాడ యేడకేడరా

తెంకినే శ్రీవేంకటశ తేజముతోఁ గూడితవి

మంకులనీగుణ మింక మానుమానురా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1196-2 ముఖారి సం: 21-506

పల్లవి: చాలునిది పదివేలు సరివచ్చెఁగా

తాలిమిఁ జెలులమాఁటే తప్పదాయఁగా

చ 1: అదె నామతి పలచనైనా నాయఁగాని

కదిసితే నీనవ్వు గట్టియాయఁగా

అదన నాచూపు తెల్లనైనా నాయఁగాని

యెదుట నీమోవి యిదె యెఱ్ఱనాయఁగా

చ 2: కడగిననామేను కాఁకైనా నాయఁగాని

చిడుముడి నీచెక్కు చెమరించెఁగా

నడుమనే వేగించినా వేగించితిగాక

తొడరి నీకైతే నిద్ర తొట్టుకొనెఁగా

చ 3: రేఁగుచు నాగోరఁ జిన్న రేకయినా నాయఁగాని

కాఁగిటినీయాసలైతేఁ గనమాయఁగా

చేగఁదేరెను రతుల శ్రీవేంకటేశ నేఁడు

తోఁగినమనరతులు తులఁదూఁగెఁగా





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1196-3 సామంతం సం: 21-507**

**పల్లవి: తాను సేసినట్టి చేఁత తనకుఁ జెల్లెననరే**

**ఆవినతనకిది సందాయననరే**

**చ 1: చిత్తజుఁ డమ్ముల నేసె సిగ్గులు నానోరు మూసె**

**వొత్తి తన్ను దూరనేరకున్న దాననే**

**జొత్తుఁగూడెఁ బులకలు సొంపువీడె నలకలు**

**యెత్తినతనతోఁ బెనఁగ నెఱఁగనైతినే**

**చ 2: చిన్నిగాలి సందు దూరె చెమట నామేనఁ గారె**

**పన్ని తనకొంగు బిగ్గెఁబట్టనై తినే**

**కన్నులఁ గెంపుల మూఁగె కమ్మర నామోవి మాఁగె**

**మున్నిటిచేఁత మరచి మొకమోడితినే**

**చ 3: చందురుఁడు సుంకుమోఁపె జవ్వనము చిమ్మిరేఁపె**

**మందలించి నామేను మరచితినే**

**యిందులో శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె**

**అందెను మన్ననరతి కందునే చొక్కితినే**



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1196-4 సాళంగం సం: 21-508

పల్లవి: వలపు చల్లుదుఁగాని వాడిక నే నొల్లనయ్య

తొలతొల యింతేసిలోఁతుకు నే వెరతురా

చ 1: మునుప నీచూపులకు మొక్కేఁగాని నే

వెనక నీసన్నలకు వెఱతుమయ్య

యెనలేనినవ్వులకు నెఁ త్తైనాఁ బొగడేఁగాని

వొనరేనీసరసము లుత్తరమీనోపరా

చ 2: ఇప్పటినీకానికలు యియ్యకొనేఁగాని నే

వొప్పుల నీవిడె మందనోపమయ్య

తప్పనినీనిజమరితనము మెచ్చేఁగాని

చెప్పేనీయేకతములు చెవియొగ్గనోపరా

చ 3: సంగడి జాణతనాలు సమ్మతించేఁగాని నే

అంగపుఁజెనకులు పయ్యాడలేనయ్యా

యెంగిలిగా శ్రీవేంకటేశుఁడ కూడితి నిట్టె

ముంగిట నిన్నుఁకఁ బాసి మోసపోనోపరా



www.annamayya.net

 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1196-5 ముఖారి సం: 21-509

పల్లవి: అలుగఁజూచేవు నీవు అంతేసికిఁ బొద్దేది

తలపోఁత యిప్పుడింతే దాచఁగఁ బొద్దేది

చ 1: నీరాక వింటే నింతే నివ్వెరగైతి నిట్టె

ఆరసి నీతో మాటలాడఁ బొద్దేది

చేరితి నిప్పుడే యింతే సిగ్గున మునిగితిని

మోరతోపు మాని నీకు మొక్కఁగాఁ బొద్దేది

చ 2: నీదెస చూచితి నింతే నిలువెల్లఁ బులకించె

నాదించి నీతో నవ్వఁబొద్దేది

పాదము లొత్తితి నింతే భావమెల్లఁ గరఁగితి

సేదదేర వినయముసేయఁ బొద్దేది

చ 3: కూడితి నిట్టె ఇంతె గొబ్బన మేను చొక్కితి

మేడెపునీరతులక మెచ్చఁబొద్దేది

వాడికశ్రీవేంకటేశ వరస నాకిపుడింతే

తోడనే నేసవెట్టితి తొలఁగఁ బొద్దేది



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1196-6 సామంతం సం: 21-510

పల్లవి: నీకు నీకే తెలుసును నీచేఁతలు

జోకలాయ నీసుద్దులు సొంపులెల్లా వింటిరా

చ 1: పంతము చూడవలసి పక్కన నవ్వితిఁగాక

కాంతుడ వొచ్చేము నీమైఁ గంటినా యేమి

అంతలోనె సిగ్గువడే వందరిలో నీకునీకే

యెంతని నీగుణమున కిఁక నేమిసేతురా

చ 2: నిజముఁ గనవలసి నీమోము చూచితిఁగాని

భజన నిన్ను నమ్మనిభావమా యేమి

గుజగుజఁబొయ్యేవు కొంకికొంకి నీకునీకే

గజరునీచేఁతలకు కమ్మదా నేమందురా

చ 3: మోహము గానవలసి ముందరమొక్కితిఁగాక

సాహసించి వుప్పటపుసాదనా యేమి

యిూహల శ్రీవేంకటేశ ఇంతలోనె కూడితివి

ఆహా నీరతు లెన్నియని పొగడుదురా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1197-1 లలిత సం: 21-511

పల్లవి: మైల వాసి మఱుఁగాయ మాటలేలరా

చాలుఁజాలు బనులెల్లఁ జక్కనాయరా

చ 1: తొడిఁబడ నవ్వితిని తోడుతనే మొక్కితిని

చిడుముడి నిఁక నేమి చేసేవురా

అడరి నేఁ దిట్టితిని అంతలోఁ బంతమిచ్చితి

వడిగాఁ బైపై నాతో వాదులేలరా

చ 2: కోపగించి చూచితిని గొబ్బననే మెచ్చితిని

మాపుదాక నింత జోలిమాటలేలరా

రేఁపకాడ నెడసితి మాపటంతఁ గూడితివి

యీపాటి వాసికిని యెగ్గులేలరా

చ 3: మోవి గంటిసేసితి నామోమితేనె లిచ్చితిని

దేవుఁడ శ్రీవేంకటేశ తెగువేలరా

భావమెల్లఁ గరఁగితి పక్కన మెప్పించితిని

చేవదేరెఁ బనులెల్లఁ జింతలేలరా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1197-2 ఆహిరి సం: 21-512

పల్లవి: దగ్గరగరాదు మరి దగ్గరకుండఁగరాదు

యెగ్గులాయ జవ్వనము యిఁకనేఁటికే

చ 1: చేరి వానిరూపు చూచి జిగి సంతోసించేనంటే

సారె నాకన్నులనీరు సంగరమాయ

ఆరయ వానితో మాటలాడి చొక్కేనంటేను

దూరేనానవ్వులే నాకుఁ దొడసాయెనే

చ 2: మునప వానింటికేఁగి ముచ్చటఁ బాసేనంటే-

నను వైనమరపులే అడ్డమాయెనే

తనివోక వానిరతి తలపోసివుండేనంటే

కొనసాగి కోరిక పైకొసరాయెనే

చ 3: గక్కన వానిమేను కాఁగిలించి పట్టేనంటే

పక్కన నాసిగ్గులు దెప్పరమాయెనే

ఇక్కువ శ్రీవేంకటేశు నిట్టె నేఁ గూడితిని

దక్కిన వాని మన్నన తలకూడెనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1197-3 సామంతం సం: 21-513

పల్లవి: అంతటిపై నీవుచెప్పినట్టే సేసేఁగాని

పంతమాడ కందాఁకా పండరంగి విట్ఠలా

చ 1: చెదిరినకురు లివి చెరిగినందాఁకను

పదరకు మంత నీవు పండరంగివిట్ఠలా

వదలుఁబయ్యదకొంగు వైపుగాఁ బెట్టినదాఁకా

పదిమారులు నవ్వకు పండరంగివిట్ఠలా

చ 2: చిక్కువడ్డహారములు చేతదిద్దునందాఁకా

పక్కనఁ జెనకకుమీ పండరంగివిట్ఠలా

చెక్కులనూనినయట్టిచెమట లారినదాఁకా

పక్కన వోరుచు పండరంగివిట్ఠలా

చ 3: చలువనీమోవితేనె చవిగొన్న యందాఁకా

పలుకులు చాలించు పండరంగివిట్ఠలా

చెలఁగి కూడితి విట్టె శ్రీవేంకటాద్రిమీఁద

బలిమి నీకె చెల్లెఁ బండరంగివిట్ఠలా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1197-4 భైరవి సం: 21-514

పల్లవి: చెప్పితి నిప్పుడే నే నాచి త్తములోఁ గలమాట
యెప్పు డేడ మాటలాడే దిది మేలుసుమ్మీ

చ 1: మనసులో కోపమెల్లా మఱచేనంటే నాకుఁ
దనమేవిగుఋతులు తలఁపించీనే
తనుఁదానే విచ్చేసినాఁ దలవంచుకొందుఁ జేతు
యెనలేక ఇందుకు సిగ్గువట్టీఁ జుమ్మీ

చ 2: మొదలితనవోజలు మూసిదాఁచేనంటేను
యెదిరి తనమైకాఁక లెత్తి పెట్టీనే
కదిసి తాఁ గూచుండినాఁ గడ వేరేమంచముపై
నిదిరింతుఁ జేతు నది నేరమెంచీఁ జుమ్మీ

చ 3: గోలనై తనతిట్లు గుట్టుసేసుకొనేనంటే
నాలితనమొక్కు చూచి నవ్వువచ్చీనే
యీలీల శ్రీవేంకటేశుఁ డింతలో విచ్చేసికూడె
పాలుపడి మెత్తుఁ జేతు పంతమాడీఁ జుమ్మీ




# అన్నమయ్య  సంకీర్తనలు


శృ.రేకు: 1197-5 ముఖారి సం: 21-515

పల్లవి: ఇప్పటినీచేఁతే వొకటినుమడై పొడచూపీ

దప్పితో సిగ్గువడకు తారుకాణయ్యీని

చ 1: సారెసారె నవ్వకువే సరి నవె వెన్నెలలై

ఆరయ విరహవేళల నలయించీని

మేరమీరి వల్కకువే మించి యివె తేనెలై

తేరుకొని నిన్నుఁ దరితీపులఁబెట్టీని

చ 2: తప్పకచూడకువే తగుచూపులే యమ్ములై

యప్పటి నలిగితే నాయము గాఁడీని

వుప్పటించి జంకించకు వూర కవి పొగలై

ముప్పిరిఁ దాపాగ్ని రాఁజమొదలుసేసీని

చ 3: సరసములాడకువే సారే బాహులతలై

సొరిదిఁ గాఁగిట నవె చుట్టుకొనీని

యిరవై శ్రీవేంకటాద్రి నిద్దరముఁ గూడితిమి

విరుల వేయకువే వేడుకరేఁచీని



శృ.రేకు: 1197-6 ఆహిరి సం: 21-516

పల్లవి: ఏమని వుత్తరమిచ్చీ నీఁకఁ దా నాకు

వేమారు సారె సారె వెడమాట లేఁటికే

చ 1: అద్దరిపాటు రమణుఁడాకెయింటఁ బానుపుపై

నిద్దరించంగా జూచి నే నాఁపలేక

వొద్దఁబండి కుచముల నొత్తితి నాతనివీఁపు

అద్దివో న న్నా కెనంటాఁ నాపెపేరఁ బిలిచె

చ 2: తక్కక ఆకెమేడలో దాఁగిలిముచ్చులాడఁగా

గక్కన మోవి యాని గంటిసేయఁగా

పెక్కుమారు లానెలఁతపేరఁ దిట్టె నన్ను నేఁడు

తక్కులేమీ నెఱఁగఁడు తన్ను నేమనెందునే

చ 3: దొంతులై ఆకెయుఁ దాను దొమ్మిరతి సలుపఁగా

కాంతఁగన కాఁగిలించి కళలంటఁగా

అంతలో శ్రీవేంకటేశుఁ డాకెనంటా నన్నుఁ గూడె

యెంతకెంత అవసర మిపుడు దాఁ గనెనే





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1198-1 కాంబోది సం: 21-517

పల్లవి: చెల్లినంతయు నీవు సేతువుగాక

మొల్లంపునీచేఁత ముయికిముయిగాది

చ 1: ప్రేమమున నంటఁగాఁ బెనఁగే వవుర నీ-

దీమసం బెట్టిదో తెలియఁగలదు

వేమారు నీకింత వేగితేఁ జాలుఁగా-

కేమాయ నుప్పొలి కినుమడేకాదా

చ 2: పిలువనంపిన రాక బిగిసితి విందాఁక నీ-

అలరుఁదలంపెట్టిదో అడుగఁగలదు

నిలుకడై నీమనసు నిల్చితేఁ జాలుఁగాక

వలపు వేయింటిపై జవ్వాదికొమ్ముగాదా

చ 3: కాఁగిలించిన నపుడె కరఁగేవు నీతొంటి-

నాఁగుఁజలములకు నిది నవ్వుగాదా

వీఁగ కిటు నన్ను శ్రీవేంకటేశ కూడితివి

రేఁగితివి గోర గీరిన నేరుగాదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1198-2 ఆహిరి సం: 21-518

పల్లవి: మొక్కేరా నీకంటే ముందుముందే

కక్కూరి తింతయేల కాఁకఁలబెట్టకురా

చ 1: నీటిలోని ముల్లువంటి నీగుణము దెలియ

యేఁటవెట్టి హెచ్చుకుందు లెంచనోప

యేఁటికి గొరసెరాయ డెందుఁ బొందనివేళ

ఆఁటదాన నింతే నన్నారడిసేయకురా

చ 2: వేవేలుఁ జేసి నీకు వేఁడుకొనేదే గుణము

ఆవల నలిగితే మారలుగనోప

వావిదప్ప కంత నీవు వల్లెవేసే వెందునైనా

పూవువంటిదాన నింతే బూకలు సేయకురా

చ 3: మానుమాను మిఁకనైనా మాతోడిచలములు

కేనముతో రాయి గిలిగించ నేనోప

యీనెపాన శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

ఆనిపట్టి నన్ను నింత అలయింపించకురా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1198-3 పాడి సం: 21-519

పల్లవి: ఇంతి నీపైఁ జేయు టిదిగదా వలపు నీ-

వంతటికి సమ్మతించు టదిగదా వలపు

చ 1: పెదవిపైఁ దములంపుబేంట్లటురాలఁగా

యెదుట నేకతమాడు టిదిగదా వలపు

వదలుఁదురుమునశిరసు వడి నీదుతొడలపై-

నదన నిడుకొని నవ్వు టదిగదా వలపు

చ 2: కనుఁగొనలమోడ్పుతో కాఁకదేరఁగఁ జూచి

యెనలేక మైమరచు టిదిగదా వలపు

కొనచెమట జవ్వాదిఁ గూడి చెక్కుల జార

అనుగుఁజేయి పయివేయు టదిగదా వలపు

చ 3: వొడలునొడలునుఁ బెనచి వొక్కటై చెమరించి

యెడపుఁబయ్యెద దడుపు టదిగదా వలపు

జడిసి శ్రీవేంకటేశ్వర నీవు నీచెలియ

అడియాలముగఁ గలము టదిగదా వలపు



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1198-4 కేదారగౌళ సం: 21-520

పల్లవి: నీరాజసముతోడ నెమ్మది నుందువుగాక

కూరవండి కసవేరి గుణ మింకానేఁటికి

చ 1: కోపగించఁజెల్లునా కొంగువట్టితివి నీవు

ఆపని; కేమైనాఁ జెలి యనుఁగాక

వోపననఁజెల్లునా వూఁకొంటివి పైఁడికత-

కీపాటివాఁడవు ముందేల నవ్వితివి

చ 2: వేగిరించఁజెల్లునా వెలఁదిఁ బిల్చినవాఁడ-

వాగతి నాకెచిత్తమది నీభాగ్యము గాక

రాగిదేర్చ కంత నీవు రాలుదింటా మలిగండ్లా

వేగి లేరి వచ్చి నీవు వేసాలే సేసేవు

చ 3: వంతమాడఁజెల్లునా పడఁతికాఁగిటఁ జిక్కి

చెంతల నాకె యేమైనాఁ జేసుఁగాక

వింతగా శ్రీవేంకటేశ వేసితే వేయిరూపులాయ.

మంతనపురతులు నీమగువకును నీకును





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1198-5 సామంతం సం: 21-521**

**పల్లవి: చెట్టవట్టి తీసినదే సెలవుగాక**

**నెట్టన నాతనితోనే నిష్ఠూరమేఁటికే**

**చ 1: చింతలెల్లాఁ దీరె నింకాఁ జెక్కుచే యేమిటికే**

**అంతటా విచారించేనంటే నూయి**

**కాంతుఁడు మతిలో మొక్కెఁ గన్నుల దీవించితివి**

**యెంతకెంతదొరతోడ నెచ్చుకుందులేటికే**

**చ 2: తనువు చెమటఁ దోఁగె తాప మింకా నేఁటికే**

**కనుఁగొంటె నింతటాఁ జీకటే వెలుఁగు**

**మొనగోర గీరెఁ బతి మోహమున కేరువారె**

**వనిత బలువునితో వావాదమేఁటికే**

**చ 3: సేస దలమీఁద మోఁచె సిగ్గులింకా నేఁటికే**

**పోసరించి వోరిచితేఁ బూవే పిందె**

**ఆసల శ్రీవేంకటేశుఁ డాదరించి నిన్నుఁ గూడె**

**పాసికూడేపతితోడఁ బంతమాడనేఁటికే**



 

# అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1198-6 బౌళి సం: 21-522

పల్లవి: ముందుముందే నిక్కితే మూరెఁడు మాట

వొందితి నీసతినైతే వొడఁబాటు లేదా

చ 1: కడదాఁక నీసుద్దులే కాంతలతోఁ జెప్పేవు

అదరి నామాటఁ గొంత ఆడనీరాదా

తొడిఁబడ నీవు గడుదొరవైతే రాజ్యమేలు

పడఁతులతోనే ఇంతబలువా నీకు

చ 2: సందడించి యెందునైనా సాకిరులేల పెట్టేవు

విందుఁగా నాతగ వింత విననీరాదా

కందువలఁ జెల్లుఁబడి గలితే నీవే బదుకు

యిందువదనలతోడ నెగసక్కెమేఁటికి

చ 3: పచరించి యాన నీవే పలుమారుఁ బెట్టుకొనే-

విచట నావొట్టుసత్యా లెక్కనీరాదా

రచన శ్రీవేంకటేశ రతుల నన్నుఁ గూడితివి

పచరించి నాతోనే పంతమా యిపుడు





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1199-1 శ్రీరాగం సం: 21-523

పల్లవి: లోకు లేమందురోయని లోఁగేఁగాక

మేకొని నిన్నిట్టె కిందు మీఁదు సేయనా

చ 1: మానవుగా అదేమోయి మాటిమాటికిఁ దిట్టేవు

కానీలే మగనాలింత కడునసుదా

పోనీపోనిమ్మనికాక పొరుగిరుగు మొరఁగి

తేనెవంటినీమదము దించ నిట్టె వోపనా

చ 2: వుండవుగా చక్కజాడ నొకటొకటె చెనకే-

వండనే ఇల్లాండ్లింత ఆటపాటలా

కొండవంటిదొర వంటా గొంకితిఁగా కిట్లయితే

కండగర్వమెల్లాఁ దీర్చి కంకిసేయనోపనా

చ 3: విడువవుగా చలము వెసఁ గాఁపురాలుసేసే-

పడఁతుల కూరనుండఁ బాసెనా యేమి

యెడపుశ్రీవేంకటేశ యింతలోఁ గూడితిఁగాక

విడువనిపంతమైతే వింత వింత సేయనా





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1199-2 ముఖారి సం: 21-524

పల్లవి: ఏమని చెప్పుదునే యీతని జాణతనము

నాముదేర నూరకిట్టె నవ్వించీనే

చ 1: సిగ్గువడి తనవద్ద శిరసు నే వంచుకొంటే

బగ్గన నామోము తప్పక చూచీనే

అగ్గలపు మోహముతో నరమరచి నేనుంటే

బుగ్గలాంటి నామేను పులకింపించీనే

చ 2: కడుఁదమకములఁగాఁ కల నేనుండఁగ నాకు-

మడిచియిచ్చి మేను చమరింపించీనే

బడిఁ బాన్పుపై నలసి పవ్వళించి వుండఁగాను

నిడివి నాకళ్ల లంటి నిద్దిరింపించీనే

చ 3: అంగవించి తనరతి కడ్డమాడకుండఁగాను

చెంగట నందంద మెచ్చి చెక్కునొక్కీనే

యింగితాన శ్రీవేంకటేశు డిట్టె నన్నుఁ గూడె

కొంగువట్టితీసి నన్నుఁ గొసరింపించీనే



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1199-3 సామంతం సం: 21-525

పల్లవి: ఎవ్వరి దూరే మేమనఁగల మిఁక

జవ్వనపుమీకె చందములాయ

చ 1: కలిమికి లేమికిఁ గాణాచి యదియె

అలివేణిచన్ను లసియాడునడుము

చెలువుఁడ నీలోచిత్తము కఠినము

పలచనికెమ్మోవి పతికిఁ బతియాయ

చ 2: చీకటి వెలుఁగుకు సీమది యొకటే

నీకాంతతురుము నీచూపు

వాకున వినయము వళుకులు చెంతల

సాకిరిరమణుఁడ సరికి సరియాయ

చ 3: చిగురుకుఁ జేవకు శేఖరమొకటే

మగువహస్తనఖమహిమ లవె

తెగి శ్రీవేంకటదేవ నీకొకటె

తగవులు నగవులు తగురతులాయ



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1199-4 సౌరాష్ట్రం సం: 21-526

పల్లవి: చాలుఁజాలు దీమసము సతిమాట వినవయ్య

మేలుగలవాఁడవు గామిడిచేఁతలేలా

చ 1: అవ్వలిమోమైనపరా కంత గలవాఁడవైతే

.జవ్వనిఁ గాంతలచే విచారించనేల

నవ్వకపిలిచినాను నాలిసేసేవాఁడవైతే

పువ్వులవలె నీమేను పులకించనేలా

చ 2: యింటిలోననుండి బీరా లింత గలవాఁడవైతే

అంటి నాఁడు సరసములాడఁగనేల

వొంటి నే మాటాడినా వూఁకొననివాఁడవైతే

అంటుముట్టుచెమటల నలయఁగనేలా

చ 3: కాలుదొక్కి యింతలోనే కళదాఁకే వాఁడవైతే

బాలకితో నలి గింత పాయఁగనేల

మేలిమి శ్రీవేంకటేశ మెచ్చితి నీగుణము

వేళతోఁగూడితి వింత వేగిరించనేల



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1199-5 బౌళి సం: 21-527

పల్లవి: ఇంపుగాని సొంపుగాని యెఱిఁగించితి నిదివో

జంపులనీగుణములచంద మెట్టోకాని

చ 1: పలుకఁగవచ్చుఁగాని పంతములియ్యఁగరాదు

చెలితోడ జగడించఁ జెల్లదుసుమ్మీ

పలుకఁగరాదుసుమ్మీ పక్కన జాణతనాన

తొలఁగి పిమ్మట నటు దూరవచ్చుఁగాని

చ 2: కాఁకసేయవచ్చుఁగాని కలఁకదీర్చఁగరాదు

తేకువకు నెమ్మెకు తీదీపుసుమ్మీ

కాఁక సేయరాదుసుమ్మీ కమ్మర నేరుపుతోడ

వేఁకపునిష్ఠూర మందె వేయవచ్చుఁగాని

చ 3: జంకించవచ్చుఁగాని సారెకుఁ బొంకఁగరాదు

వంకలనేమీ ననవద్దు సుమ్మీ

జంకించరాదుసుమ్మీ సతిమనసు దెలిసి

కొంకక శ్రీవేంకటేశ కూడవచ్చుఁగాని



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1199-6 మధ్యమావతి సం: 21-528

పల్లవి: అందులకుఁ దగినట్టు అప్పుడే చూచుకొందును

ముందుముందే యింతసేసేమొరఁగులు గానవైతి

చ 1: పిలువనంపెననేటి పెద్దరికమే చూచితి

తలఁపు వెరొకటౌట దలఁచనైతి

నిలిచి మాటాడెనని నెయ్యపుమేలే యెంచితి

వలపని జోలిమాటలవ గెఱఁగనైతి

చ 2: యీరానచనవులెల్ల నిచ్చేదే చూచితిఁగాని

దారకాన మచ్చుచల్లి తగిలించే దెంచనైతి

చేరి ప్రియములు సారెఁ జెప్పేదే చూచితిఁగాని

కారించి నాకొడఁబాటుగానిపని చూడనైతి

చ 3: కాఁగిలించి బుజ్జగించేఘనతే చూచితిఁగాని

ఆఁగి మేలుమరపించే ఆయము దెలియనైతి

రాఁగినశ్రీవేంకటేశురతులఁ గూడితిఁగాని

యేఁగించి పురమెక్కించే ఇక్కువ దెలియనైతి





# అన్నమయ్య  సంకీర్తనలు



**శృ.రేకు: 1200-1 దేసాళం సం: 21-529**

**పల్లవి: ఇట్టివిందు గంటివా నీ వెక్కడనైనా**

**అట్టె ఆకెపొత్తున నీ వారగించవయ్యా**

**చ 1: కలికికెమ్మోవితీపు కమ్మని తేనెలవిందు**

**చలువచూపులు నీకుఁ జక్కెరవిందు**

**సెలవిలేనవ్వులే చిలుపాలతోడివిందు**

**అలమేలుమంగ సేసీ నారగించవయ్యా**

**చ 2: కాంతగోరిచెనకులు కారపుఁగూరలవిందు**

**పంతపుమాటలే ఆవపచ్చడివిందు**

**వింతబొమ్మజంకెనలే వేఁడిపడిదాలవిందు**

**అంతసేసీ నీదేవి యారగించవయ్యా**

**చ 3: అట్టడి సమరతియాటడి తరితీపువిందు**

**గట్టిసిగ్గు పెరుగుమీఁగడలవిందు**

**గుట్టుతో మన్నించితివి కొమ్మను శ్రీవేంకటేశ**

**అట్టె నీతనివిదీర నారగించవయ్యా**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1200-2 సామంతం సం: 21-530

పల్లవి: చిత్తమెట్టున్నదోకాని చెప్పవెరపయ్యీ నాకు

మొత్తాన నూరకేవుంటే మోసమౌఁబో యిపుడు

చ 1: తొయ్యలిచెక్కునుఁ జేయీ దొంతరతామరలాయ

వొయ్యనె నీవిరహసూర్యోదయవేళ

నెయ్యపునీనవ్వుల వెన్నెలఁ గొంతచిలికితే

చయ్యన వానివాఁడి సమసుఁబో యిపుడే

చ 2: అంగన మోనాన మోవు లమడమంకెనలాయ

భంగపుఁగోరికల ప్రభాతవేళ

అంగపునీమాటల పయ్యెద గొంతవిసరితే

వెంగలి వానిగుట్టు విరియుఁబో యిపుడె

చ 3: కాంతమేను నీమేను కదంబపుఁబువ్వులాయ

ఇంతలో శ్రీవేంకటేశ యీకెఁ గూడఁగా

పొంతల మీరిద్దరును పొంది యెడయకుండితే

బంతినే వాసనలంకెపాటు లౌఁబో యిపుడె



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1200-3 పాడి సం: 21-531

పల్లవి: చాలదా ఇంత సారెసారె వలెనా తాను

యేల చలమున నిఁక నేమి సేయుమనీని

చ 1: మొక్కితిఁగదె తనకు మొన్ననే నేను

యెక్కడనుండిన మనసేకమని

దక్కితి నంటిఁగదె తనపాలికి

యిక్కడఁ జెలులమాటలెల్లాన నే వింటినే

చ 2: ఇచ్చితిఁగదె పంత మింతకుముందె నాకు

హెచ్చి తా నాడినమాట లియ్యకోలని

మెచ్చితిఁ గదెతన్ను మీఁదమీఁదనె మరి

పచ్చియెమ్మెలు నావద్దఁ బచరించనేఁటికే

చ 3: అంటితిఁగదె తనఆయము నేనే ఇది

దంటపాయ మిందరికిఁ దగునని

గుంటిపై శ్రీవేంకటేశుఁ గూడితిఁగదె ఇఁక

వెంటవెంటఁ దను నే విడువనని




# అన్నమయ్య  సంకీర్తనలు


**శృ.రేకు: 1200-4 లలిత సం: 21-532**

**పల్లవి: చాలుఁజాలు ననరె సాదించ మమ్మింతయేల**

**యీలకూర కప్పు చాల దిందేమి గలదే**

**చ 1: గొప్పలు మాకన్నులు కొంచము మానెమ్మొగము**

**తపపులెన్నైనాఁ గలవు తడవనేలే**

**చిప్పిలీ నాకిదె నవ్వు చిందీ నామోవిఁ దేనె**

**యెప్పుడు వచ్చినాఁ దన కిందేమి గలదే**

**చ 2: పిడికెఁడు మానడుము పెచ్చువెరిగేచన్నులు**

**వెడ మామేనివొాచ్చాలు వెదకనేలే**

**వుడికీ నామనసైతే వూరికె యదరీ మేను**

**యెడయక తాఁ బిలిచీ నిందేమి గలదే**

**చ 3: కంచువంటిది కుత్తిక కపురాలు పలుకులు**

**యెంచి మామాటలు సోదించఁగనేలే**

**అంచెల శ్రీవేంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె**

**యెంచియెంచి పొగడీని యిందేమి గలదె**





# అన్నమయ్య  సంకీర్తనలు



శృ.రేకు: 1200-5 ముఖారి సం: 21-533

పల్లవి: తానే యెఱఁగఁడా తగినజాణఁ డతఁడు

మానిని నిను మన్నించె మన్ననలె చాలదా

చ 1: మట్టులేని మాటలేల మందెమేల మింతయేల

గుట్టుతో నవ్వుటే మంచిగుణముగాదా

చిట్టంబుఁజెనకులేల సిగ్గువడి వుండనేల

వొట్టినమోహము తోడ నుస్సురంటెఁ జాలదా

చ 2: కానికానివొట్లేల కాఁకలఁ బొరలనేల

మౌనముతో నుండుటే మంచిదిగాదా

పానుపుపై నిద్దురేలపైఁ గలవరింపేల

పూనిన జాగరముల పొద్దువోకే చాలదా

చ 3: యిందాఁకా బింకమేల యిటు పంతమియ్యనేల

పొంది మేనుమరచుటే బుద్దిగాదా

అందపు శ్రీవేంకటేశుఁ డంతలోనె నిన్నుఁ గూడె

గొందినే మేని చెమటే గురితిది చాలదా



 అన్నమయ్య  సంకీర్తనలు 

శృ.రేకు: 1200-6 తోండి సం: 21-534

పల్లవి: ఇంకనేల మొరఁగు యిదివో నివ్వెరగు

వుంకువ నేనన్నమాట కుత్తరమీవేఁటికే

చ 1: చిత్తమెల్లఁ జిగిరించె చెలి నీజవ్వనమున

అత్తిననవ్వులు పువ్వు లవి యెన్నఁడే

కొత్తగాఁ గాఁకర గాచె గోరికొనతాఁకులెల్ల

యెత్తి చన్నులనిమ్మపండ్లెక్కడ దాఁచితివె

చ 2: కురులచీఁకట్లవె కొంతగొంత సమకూడె

అరచందురులపొడ పది యేడదే

విరివై సిగ్గులఁ గడువెన్నెలలు గాసికాసి

తిరమై కెంపుఁగన్నుల తెల్లవారెఁగదవె

చ 3: చెమట వాన గురిసి చిత్తడి యేరులువారె

తమకాన వెలిచేటితతి యెప్పుడె

తమి శ్రీవేంకటపతి తగ నిన్నేలుటఁ గంటి

గుమురుఁబులకలేల కొంగునఁ గప్పేవే

